# అపరాధ పరిశోధన

రు.3·50 మార్చి '79

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం — 63

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## కరుణించని అరుణ!

రచన : వసుంధర

## ప్రాణానికి ప్రాణం!

రచన : టెంపోరావ్

## పెయింటింగ్ కోసం పోరాటం

రచన: 'సికిందర్'

## మృత్యు లేఖ

రచన: అజీజ్

## అడుగు ముందుకు వేస్తే చస్తావ్!

మూడవ భాగము—రచన: వసుంధర

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 63
మార్చి, 1979
వెల : రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవితచందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# కరుణించని అరుణా!

వసుంధర

పెద్దలు సంపాదించిన ఆస్తి వుందికానీ పెద్దలెవ్వరూ లేరు నాకు. పెద్దరికం చేయాలనుకున్న బంధువుల్ని మేజరు కాగానే తరిమేశాను.

ఒంటరి జీవితమే చాలా బాగుంది నాకు. బాధ్యతలు లేవు, సమస్యలు లేవు, ఆంక్షలు లేవు.

పియ్యూసీదాకా చదివాను కానీ ఇంగ్లీషు బాగావచ్చు కాన్వెంట్ చదువు కారణంగా. నన్ను పెంచిన పద్ధతుల్లోనో, నా మనస్తత్వంలోనో ఎక్కడో లోపముండి వుండాలి. సంఘంలో నా హోదాకుతగ్గ బుద్ధులు లేవు నాకు. అడ్వెంచరస్ లైఫ్ అంటే చాలా యిష్టం. అలాగని మంచుకొండలు ఎక్కలేదు, ఈతపందాల్లో పాల్గో లేదు.

నేను నడుపుతున్న సాఫీ జీవితానికి విరుద్ధంగా బ్రతకాలనిపిస్తుంది. అలాంటి కోరిక నాలో యెందుకున్నదో తెలియదు. ఈ విషయాన్ని ఒక పర్యాయం నా స్నేహి

తుడితో చర్చించాను. అతను నవ్వుతూ "వడ్డించిన విస్తరి లాంటి నీ జీవితంలోని మాధుర్యం తెలుసుకోవడం కోసం నువ్వు పెళ్ళిచేసుకోవాలి" అన్నాడు.

పెళ్ళి చేసుకోవాలన్న కోరిక నాకెప్పుడూ కలుగ లేదు. స్నేహితుడలా అనగానే పెళ్ళిగురించి ఊహించు కున్నాను. నాకు తెలిసిన దంపతులెందరో కళ్ళముందు మెదిలారు. పెద్ద వుత్సాహంగా అనిపించలేదు.

పెళ్ళిగురించి నాకట్టే ఉత్సాహం లేకపోవడానికి కారణం అంతవరకూ సరయిన ఆడపిల్ల నాకళ్ళబడకపోవ డమేనని నేను అనుకున్నాను. ఆ రోజునుంచీ నాకంట బడే ప్రతి అమ్మాయినీ పరిశీలనగాచూస్తూ ఇది నా పెళ్లాం అయితే ఎలా వుంటుందీ అని ఆలోచించ సాగాను. అలా అయిదారు నెలలు గడిచాయికానీ నా మనసుకు ఉత్సాహం కలిగించే ఆడపిల్లలెవ్వరూ ఇంకా కనిపించ లేదు.

దగ్గర బంధువులు, దూరపు బంధువులు అన్న పేర్లతో అయిదారుగురు నన్ను పెళ్ళిచూపులకు పిలిచారు. చూపు లకు వెళ్ళి పిల్లల్ని నఖశిఖ పర్యంతం పరీక్షించి, ప్రశ్న లతో హింసించి ఆ తర్వాత నచ్చలేదని చెప్పాను.

వాళ్ళు నాకు నచ్చనిమాట నిజమేకాని ఆ విషయం చెప్పడానికి నేను ఎన్నుకున్న పద్ధతి బాగోలేదని నాకే అనిపించింది. అయినా అలాగే చేశాను. అయితే నా ఈ ప్రవర్తన కారణంగా నన్ను పెళ్ళిచూపుల కాహ్వా నించే బంధువులు తగ్గిపోయారు.

ఇలా వుండగా ఒకరోజు సినిమాహాల్లో నాకు అరుణ కనిపించింది.

ఆమె ఎవ్వరో నాకు తెలియదు. పేరుకూడా నాకు తెలియదు.

సినిమాలో వాడు ముందువరసలో కూర్చుంది. చిన్న పువ్వుల పరికిణీ కట్టుకుంది. దానిమీద లేతాకుపచ్చ ఓణీ వేసుకుంది. ఇంచుమించు అదేరంగు జాకెట్ వేసుకుంది. చెవులకు బుట్టలోలకులు. ముఖానికి పొడుగాటి యెర్ర బొట్టు. కళ్ళకు కాటుక. ఒకచేతికి గాజులు. ఇంకో చేతికి వాచీ. కాండక్ జోళ్ళు వేసుకుంది.

ఆమె శరీరం బంగారు ఛాయలోవుంది. నవ్వుతున్నప్పుడు ఆమెపళ్లు ముత్యాల్లా మెరుస్తున్నాయి. ఆమె నవ్వినప్పుడు—నవ్వు ఆమె నవ్వడం కోసమే పుట్టిందనిపించింది. ఆ నవ్వు చూడని వాడి జన్మ వ్యర్థమనిపించింది. చూసిన వాడి జన్మ ధన్యమనిపించింది. ఆమె అలా నవ్వుతూ వుండిపోతే నేను చూస్తూ వుండిపోవాలనిపించింది.

ఇంత అందమయిన అమ్మాయిని నేనింతవరకూ చూడలేదు. దేవలోకంనుంచి దిగివచ్చిన దేవకన్య అనిపించడం వల్ల ఆమెనుగురించి తప్పుగా ఊహించడానికి కూడా భయపడ్డాను. భార్య అనే పదాన్ని ఆమెప నా పరంగా లభించడం గురించి వూహించడానికి సంకోచం కలిగింది.

నేను కవిని కాను. ఆమాటకొస్తే కథల్లో కవిత్వముంటే చదవను. కథ చదువుతూ వర్ణనలు రాగానే ఆ పేజీలు చకచకా తిప్పేస్తాను. అలాంటి నాకు ఆమెని చూడగానే ఎన్నో భావాలు స్ఫురించాయి. ఎన్నో రకాలుగా ఆమెను మనసులో వర్ణించుకున్నాను.

ఎన్నో జన్మలుగా నేను చేస్తున్న తపస్సు కారణంగా ఆమె నా కళ్ళబడి వుంటుంది. ఇంక ఈమె యెవ్వరో తెలుసుకోవాలి. ఈమెతో పరిచయం కలిగించుకోవాలి. ఆలోచిస్తున్నాను.

కొంతలో కొంత అదృష్టం. ఇంటర్వెల్లో ఒకమ్మాయి ఎక్కణ్ణించో ఈ అమ్మాయి దగ్గరకొచ్చింది. సూర్యాడి

## 6

ముందు దివిటీలా వున్నదామె.

"అరుణా!" అని పిలిచింది దివిటీ.

అరుణ వులిక్కిపడి "నువ్వేటే విజయా!" అన్నది.

దివిటీ పేరు విజయ అన్నమాట. విజయను మనసులోనే థాంక్సు చెప్పుకున్నాను. ఆమె కారణంగానే ఆమె పేరు తెలుసుకోగలిగాను.

సినిమా అయిపోయాక అరుణను అనుసరించాను. కొంతదూరం అనుసరించాక ధైర్యం చేయాలనిపించింది. "అరుణా!" అని పిలిచాను.

ఆమె వులిక్కిపడి వెనక్కి తిరిగింది. ఆమె దృష్టిని నేనాకర్షించలేదు. వెనకాలవున్న చాలామంది జనంలో పరిచిత ముఖంకోసం వెతుకుతోందామె.

నేను మరో రెండడుగులు ముందుకువేసి "అరుణా' నువ్వేనా?" అన్నాను.

అరుణ ఆశ్చర్యంగా నావంక చూసి, "ఎవర్నువ్వు?" అంది.

ఏమనాలో తెలియక "నేను, అరుణా నన్నింకాగుర్తుపట్టలేదా?" అన్నాను.

అరుణ రెప్పలు టపటపా కొట్టుకున్నాయి. కళ్ళలోని ఆశ్చర్యం క్రమంగా ఆనందంగా మారడం గమనించాను. ఆ అమాయకమైన ముఖానికి ఏ భావమైనా అందంగానే వుంటోంది. ఆమె నెమ్మదిగా పెదవులు కదిపి "బావా!" అంది.

ఉలిక్కిపడ్డాను. ఏమనాలో తెలియలేదు. ఆమె నన్ను బావా అని ఎందుకు పిలిచింది? నేను వేళాకోళ మాడుతున్నానని గ్రహించేసిందా లేక ఆమె బావకూ నాకూ దగ్గర పోలికలున్నాయా? రెండూ అసాధ్యమే నని నాకు తోచినప్పటికీ అరుణ నాతో బావ అని వరస

కలపడం నాకు చాలా నచ్చింది.

ఏమయితే అయిందని "అమ్మయ్యా గుర్తు పట్టావన్న మాట. గుర్తుపట్టలేవేమోనని చాలా భయపడ్డాను..." అన్నాను.

"నీకోసం వెయ్యికళ్ళతో యెదురు చూస్తున్నాను బావా. పద ఇంటికి పోదాం. నిన్ను చూసి అమ్మా, నాన్న ఎంతో సంతోషిస్తారు..." అంది అరుణ.

నాకు మతిపోయినట్లయింది. కథ ఇలా మారిందేమిటి?

"పద బావా!" అంది అరుణ.

"ఇప్పుడు రాలేను అరుణా!" అన్నాను ఏదో వుపాయ మాలోచిస్తూ.

"అలాగంటే ఎలా బావా? అమ్మా, నాన్నా నిన్ను చూసి ఎంతో సంతోషిస్తారు? అసలు నువ్వీ వూరెప్పు డొచ్చావు?" అంది అరుణ.

తాత్కాలికంగా చిన్న ఉపాయం దొరికింది. "ఒక పనిమీద ఇక్కడకు వచ్చాను. ప్రస్తుతానికి యింటికి రాలేను. నేను వచ్చినట్లు అత్తయ్యకీ, మావయ్యకీ చెప్పకు. అంతా రహస్యం. నన్ను కలుసుకోవాలనుంటే మాత్రం రేపు సాయంత్రం గ్రీన్‌పార్కుకి రా. అక్కడ నీకోసం ఎదురు చూస్తూంటాను. ఈ విషయం యింట్లో ఎవ్వరికీ చెప్పకూడదు" అన్నాను చనువుగా.

అరుణకళ్లు మెరిసాయి. "అప్పుడుమాత్రం నాకుఅన్నీ చెప్పేయాలి."

"అలాగే-మనిద్దరం మనసులువిప్పి మాట్లాడుకుందాం-ఓ.కే." అన్నాను అరుణతో.

అరుణ నాదగ్గర శెలవుతీసుకొంది. ఆమె ముఖం చూస్తూంటే నాతో వేళాకోళ మాడుతున్నట్లు అనిపించ లేదు. అలాగని నమ్మడానికీ లేదు. ఎందుకంటే నా

ముఖంలో ఆమెకూ అనుమానాస్పదకరమయిన భావాలు కనబడినట్లు లేదు. ఆమెకూడా నా అంత సామర్థ్యం కలిగినదై బాగా నటిస్తోందనుకోక పోవడానికి కారణం లేదు.

నాకు నచ్చిన నా మనను మెచ్చిన అరుణ అనబడే ఆ అందాలరాశిని అంత సులభంగా నేను వదలిపెట్ట దల్చుకోలేదు. వీడ్కోలు పుచ్చుకున్నట్టే పుచ్చుకొని ఆమెను రహస్యంగా అనుసరించి ఆమె ఇల్లు తెలుసుకొని వచ్చాను.

## 2

గ్రీన్ పార్క్‌లో అరుణకోసం ఎదురుచూస్తూ ఆలోచిస్తున్నాను.

ఈ అరుణకు నిజంగా బావ వున్నాడా? ఉంటే నేనే తన బావనని ఎందుకు భ్రమపడింది? ఆమె నిజంగా భ్రమ పడిందా లేక నాటకమాడుతోందా? ఇప్పుడు తనిక్కడకు వస్తుందా లేక ఏమయినా ఎత్తు వేస్తుందా? రహస్యంగా తనవాళ్ళ నెవరినీ తీసుకురాదు కదా?

నా కళ్ళకు దూరంగా అరుణ కన్పించింది. అంత దూరంలోవున్న అరుణను చూడగలగడం నాకళ్ళ గొప్పతనంకాదు. జిగేల్మనిపించే ఆమె రూపాన్ని యెవరయినా ఎంత దూరాన్నించయినా కనిపెట్టేయవచ్చు.

అరుణను చూస్తూనే నేను పొదలచాటున దాక్కున్నాను. అరుణ అనుకొన్న ప్రాంతానికివచ్చి నాకోసం అటూయిటూ చూస్తోంది. ఆమెతో ఇంకెవ్వరూ వచ్చిన జాడలేదు.

“నిజంగా నే వచ్చేశా వే?”

ఈ పలకరింపు విని అరుణ వులిక్కిపడి అటుతిరిగి—

“నువ్వెవరో నాకు తెలియదు” అంది.

"ఇప్పుడు తెలుసుకుంటావు గాని. నా పేరు శోభ. ప్రఖ్యాత రచయిత్రిని" అంది అరుణను పలకరించిన అమ్మాయి.

"నమస్కారం" అని అటూయిటూ చూడసాగింది అరుణ.

"నా రచనలేమీ చదవలేదా నువ్వు?" అనడిగింది శోభ.

"లేదు. నీ పేరుకూడా వినలేదు" అంది అరుణ.

"అయితే దేవదూత చదవ్వా నువ్వు?" అంది శోభ.

"దేవదూత అంటే?"

"అందులో నా సీరియల్ వస్తోంది. దేవదూత ఒక ప్రముఖ మాసపత్రిక."

"అలాగా—" అంది అరుణ నిరాసక్తంగా.

"నువిక్కడి కెందుకొచ్చావో నాకు తెలుసు. అందుకే నేనూ ఇక్కడికి వచ్చాను. నీకూ నా నవలలోనిపాత్రకూ చాలా పోలికలున్నాయి" అని ఆగింది శోభ.

"నిన్న ఒకడు నిన్ను అరుణా అని పెద్ద ఎరుగున్నట్లు పిలిచాడు. వాణ్ని నువ్వు బావా అని పిలిచి దెబ్బ తినిపించావు. ఏంచేయాలో తోచక వాడు నిన్నిక్కడకు రమ్మన్నాడు. నువ్వు నిజంగానే వచ్చావు. నా కథలోనిపాత్ర అచ్చు ఇలాగే చేసింది" అంది శోభ.

"అతను మోసగాడని అనుకోను. అతను నిజంగానే నాబావ" అంది అరుణ.

శోభ నవ్వి, "నిజంగానే నీబావ అయితే వెంటనే ఎందుకు గుర్తుపట్టలేదు?" అంది.

"నాకు బావ ఎలాగుంటాడో తెలియదు. మేమిద్దరం ఒకరినొకరు చూసుకొని పదిహేనేళ్ళకుపైగా అయింది" అంది అరుణ.

శోభ ఆశ్చర్యపోతూ "ఐతే నీబావ నిన్నెలా గుర్తుపట్టాడు?" అంది.

"బావదగ్గర నాఫోటో వుంది" అంది అరుణ.

"మరి బావఫోటో నీదగ్గర లేదా?"

"లేదు" అని నిట్టూర్చింది అరుణ.

శోభకు ఆశ్చర్యం వేసింది. "నిన్న మీయిద్దరి సంభాషణ విని రచయిత్రిగా కుతూహలంతో ఇక్కడేం జరుగుతుందో తెలుసుకొందామని వచ్చాను. అయితే వాస్తవం నేనూహించినదానికి భిన్నంగా వుంది. నీ కథేమిటో చెప్పకూడదూ?"

"చెబుతాను" అంది అరుణ. ఆమె ఒకసారి టైం చూసుకొని చుట్టూచూసి చెప్పడం ప్రారంభించింది.

"కథంటూ పెద్దగా ఏమీలేదు. నాబావకు తల్లీ తండ్రి లేరు. మా ఇంట్లోనే పెరిగేవాడు. అతనికి ఏడు యేళ్ళ వయసప్పుడు ఇంట్లో యేదో గొడవజరిగి యిల్లు వదలి వెళ్ళిపోయాడు. ఏమయిపోయాడో తెలియదుగాని యేడాదిక్రితం ఇంటికి వుత్తరం రాశాడు. ఇంటినుంచి పారిపోయి తను చెడిపోలేదని— ప్రస్తుతం వ్యాపారం చేస్తూ బాగా డబ్బు గడిస్తున్నాననీ రాశాడు.

బావ ఇల్లు వదిలేటప్పుడు నాకు మూడేళ్ళనుకుంటాను. నా ఫోటో ఒకటి పంపించమని రాశాడు. ఫోటో చూసినప్పటినుంచి నాకు ప్రేమలేఖలు రాయడం మొదలు పెట్టాడు. నేనూ జవాబులు రాస్తూ తనఫోటో పంపించమన్నాను. ఫోటో ఎందుకూ, త్వరలో నేనే వస్తున్నానని రాశాడు.

తను వస్తున్నట్లుగా బావ నెలరోజుల క్రితం నాకో ఉత్తరం రాశాడు. ఫలానా ట్రయిన్‌కి వస్తున్నాననీ స్టేషన్‌కి రమ్మనమనీ రాశాడు. తనే నన్ను గుర్తించి పేరు

పెట్టి పిలుస్తానని రాశాడు. ఆరోజు యింటిల్లిపాదీ స్టేష నుకు వెళ్లాం. బావరాలేదు. ఏం జరిగిందో తెలియదు. ఆ తర్వాత ఇంతవరకూ బావదగ్గర్నుంచి కబురుకూడా లేదు. నిన్న బావ నన్ను స్వయంగా పలకరించగానే ప్రాణం లేచి వచ్చినట్లుంది—"

శోభ ఆమె చెప్పిన వివరాలన్నీ విని "ఈ కథంతా తెలియక మీ విషయాన్ని నేనింకోలా అర్థం చేసు కున్నాను. నీ బావ ఇక్కడే ఎక్కడో వుండి వుంటాడు. నే నుండడంవల్ల అనుమానపడి అతను రావడంలేదేమో- నీకు శ్రమ ఇచ్చినందుకు విచారిస్తున్నాను. సెలవు-" అని వెళ్ళిపోయింది.

శోభ వెళ్ళిపోయిన నిముషంలో "అమ్మయ్య - ఆ రచ యిత్రి వెళ్ళిపోయిందా?" అంటూ నేను అరుణను సమీ పించాను.

"బావా!" అంది అరుణ ప్రేమనిండిన కంఠంలో.

ఆ పిలుపు విన్నాక ఈ ప్రాణం పోయినా ఫరవా లేదనిపించింది.

ఇద్దరం అక్కడే చతికిలబడ్డాము.

అరుణ సమాచారం తెలుసుకోవడం కోసం శోభను నేనే నియోగించాను. అందుకామెకు పాతికరూపాయలు ఇచ్చాను. ఇప్పుడు అరుణ కథ విన్నాక నాలో ధైర్యం పెరిగింది. అయితే అరుణను మోసంచేయడం నా అభి మతం కాదు. ఆమె మనసును నావైపు మళ్ళించుకుని పెళ్ళి చేసుకుని సాఫీ అయిన జీవితం గడపాలని నా ఆశ! అరుణవంటి భార్య వుంటే జీవితంలో బోర్ అన్నది వుండ దనీ—వేరే థ్రిల్ కోసం వెతుక్కో నవసరం లేదనీ నాకు బాగా అనిపిస్తోంది.

"నీ బావ ఎలా వున్నాడు అరుణా-నువ్వు ఊహించి

నట్లున్నాడా?'' అనడిగాను.

''నేనూహించినదాని కంటే ఎన్నోరెట్లు అందంగా వున్నాడు'' అంది అరుణ నావైపు ఆరాధనా భావంతో చూస్తూ.

ఆమెనుండి ఇలాంటి సమాధానం వస్తే బాగుండునని నాకూ వుంది. నేను అందంగా వుంటానని నాకు తెలుసు. కానీ అరుణవంటి ఆడపిల్లకంటికి అందంగా కనిపిస్తున్నానంటే అదో థ్రిల్!

''నువ్వుమాత్రం ఫోటో కంటె కోటిరెట్లు బావున్నావు'' అన్నాను.

''బావా-నువ్వు ఇంటికి రాకూడదా-నువ్వు వచ్చేవన్న ఆనందాన్ని నేనొక్కత్తినే పొందడం నాకు బాగోలేదు. నిన్నరాత్రి అమ్మ నా ఉత్సాహాన్ని గమనించి గుచ్చిగుచ్చి కారణం అడిగింది. ఏం చెప్పాలో తెలియక సినిమా చాలా బాగుందనీ, గుర్తొస్తోందనీ అన్నాను'' అంది అరుణ.

''సమయం వచ్చినపుడు తప్పక వస్తాను అరుణా! కొంతకాలం నా ఉనికి రహస్యంగా వుంచాలి. అసలు నీ దగ్గరకూడా బయటబడకూడదనుకున్నాను. కానీ నిన్ను చూసి ఊరుకోలేకపోయాను'' అన్నాను.

అరుణ నిట్టూర్చి ''కనీసం ఈ ఊళ్ళోనైనా కొన్నాళ్ళుంటావా?'' అనడిగింది.

''వుంటాను. నువ్వు కరుణిస్తే ప్రతిరోజూ ఈ సమయంలో నిన్నిక్కడ కలుసుకుంటూనే వుంటాను'' అన్నాను.

''బావా—నీకు స్వయానా మరదలినిగదా — నువ్వు చేస్తున్న వ్యాపారమేమిటో, ఈ రహస్యాలన్నీ ఏమిటో-నాకు చెప్పకూడదా?'' అంది అరుణ. ఆమె నాతో చాలా చనువుగా మాట్లాడుతోంది.

"నీ దగ్గర నాకు రహస్యాలేమిటి? అన్నీ నీకు సమయం వచ్చినపుడు చెప్పేస్తాను. అయితే నేను ప్రమాదకరమైన పని ఏమీ చేయడంలేదని మాత్రం గుర్తుంచుకో" అన్నాను.

తర్వాత ఇద్దరూ కాసేపు అవీ ఇవీ మాట్లాడు కున్నాము. సునిశితమైన శృంగార పదాలు ఒకటి రెండుపయోగించి మరదలి ముఖం ఎర్రబడితే చూసి ఆనం దించాను. ఆఖరున విడిపోబోయేటప్పుడు "ఏమీ అనుకోక పోతే రేపు నేను నీకు రాసిన ఉత్తరాలన్నీ తీసుకు వస్తావా?" అన్నాను. అరుణ అలాగేనని తలాడించింది.

అంటే రేపుకూడా నన్ను కలుసుకోడానికి వస్తుందన్న మాట! ఆ ఉత్తరాలన్నీ చదివి ఆమె అసలు బావగురించి తెలుసుకోవాలి. అసలు అతనెవరో — నెలరోజుల క్రితం వస్తానని రాసి ఎందుకు రాలేకపోయాడో?

నా నాటకం మరికొంత కాలంపాటు కొనసాగాలంటే అరుణ బావగురించి బాగా తెలుసుకోవాలి. అందుకా ఉత్తరాలు నాకు బాగా సహకరిస్తాయి.

## 3

ఉత్తరాలు చదివితే కొన్ని వివరాలు తెలిశాయి నాకు.

అతను హైదరాబాదులో వుంటున్నాడు. పేరు విశ్వం. అతను ఉత్తరంలో తన వ్యాపారంగురించికానీ, తన గురించి కానీ ఎక్కువ వివరాలు ఇవ్వలేదు. అతను అరుణకు ఇచ్చిన కేరాఫ్ అడ్రస్ అప్పటికప్పుడు కంఠతా పట్టేశాను.

ఉత్తరాల్లోని శృంగారాన్నికూడా మననం చేసు కున్నాను. ఆ మాత్రపు శృంగారం ఆమెకు అభ్యంతరం వుండదన్నమాట!

అరుణగురించీ, విశ్వంగురించీ కొంత అవగాహనకీ వుత్తరాలు నాకు ఉపకరించాయి. ఉత్తరాలు చదివి ఇచ్చేసి— "నువ్వు దగ్గర లేనప్పుడు నిన్నూహించుకోవడంవల్ల ఆ భావ అప్రయత్నంగా వచ్చేసిందనుకుంటాను. ఆ వుత్తరాలు చదువుతూంటే నేనే రాశానా అని ఆశ్చర్యంగా వుంది" అన్నాను.

"నువ్వుత్తరాలు బాగా రాస్తావు. కానీ మాట్లాడ్డం బొత్తిగా రాదు" అంది అరుణ.

నేను నవ్వి - "నువ్వు దగ్గర లేనప్పుడు ఎలాగో ఉత్తరాలు రాయగలిగాను. నువ్వు పక్కన వుంటే నాకు మాటలు రావడంలేదు" అన్నాను.

"ఏదో ఒకటి మాట్లాడకపోతే విలువైన సమయం వృధా అయిపోదూ?" అంది అరుణ.

"నీకు తెలుసో తెలియదో కానీ ప్రేమికులు దగ్గర లేనప్పుడు త్తరాలు రాసుకుంటారు. దగ్గరుంటే మాటలు కూడా వుండవు. అన్నీ చేతలే!" అన్నాడు.

"ఛీ_" అంది అరుణ ఏదో స్ఫురించి.

"అలా అన్నదంటే ఆడపిల్లకు ఇంకా ప్రాయం రాలేదని అర్థం" అన్నాను.

ఇద్దరిమధ్యా కాసేపు మాటలు నడిచేక "నేనంటే నీ కిష్టమేనా? నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అనడిగాను. కాస్త సిగ్గుపడినా తనకు ఇష్టమేనని చెప్పింది అరుణ.

నా మనసులో ఏదో పథకం మెరుస్తోంది. అరుణ అసలు బావ వచ్చేలోగా నేను అరుణను ఏదో విధంగా లోబరచుకుని ఆమెను పెళ్ళిచేసుకోవాలి. ఐతే ఈ లోగానే అతను వచ్చేస్తే!

అందుకు తిరుగులేని పథకం ఆలోచించాలి.

# 4

బాగా ఆలోచించి ఒకరోజు అరుణను నా గదికి ఆహ్వానించాను. అందుకోసం హోటల్లో ప్రత్యేకంగా ఒక గది తీసుకున్నాను. అరుణ నిస్సంకోచంగా హోటల్లో నా గదికి వచ్చింది.

నేను తలుపులు వేస్తూంటే ఆమె వారించలేదు సరి గదా అనుమానాన్ని కూడా ప్రకటించలేదు. అరుణ మంచితనాన్ని మనసులోనే అభినందించుకున్నాను.

కాసేపు మళ్ళీ ఇద్దరిమధ్యా కబుర్లు నడిచాయి. అలా పది నిముషాలు గడిచేసరికి నేను మా ఒంటరితనాన్ని గుర్తించి ఆవేశపడ్డాను. నెమ్మదిగా అరుణ చేయి తాకాను. మృదువుగా ఆ చేతిని తొలగించిందామె.

నేను ఒక్క అడుగు ముందుకువేసి ఆమెను కౌగలించుకొని ముద్దుపెట్టుకోబోయాను.

అరుణ నన్ను బలంగా వెనక్కు తోసేసింది. అందుకు నేను సిద్ధపడి లేనేమో వెల్లకిలా పడిపోయాను. అదృష్టవశాత్తూ మంచమడ్డుగా వుండి కాబట్టి దానిమీద పడ్డాను. సర్దుకొని లేచికూర్చుని "తోసేసావా?" అన్నాను.

"నువ్వు చేసిన పనేమిటి?" అంది అరుణ కాస్త కోపంగా.

"మనం ప్రేమికులం!" అన్నాను.

"కానీ భార్యాభర్తలం కాదు..."

"కాబోతున్నాం కదా" అన్నాను.

"ఇంకా కాలేదు కదా" అంది అరుణ నా గొంతును అనుకరిస్తూ.

"అరుణా నాకు అడ్డం చెప్పకద్దు. మనం త్వరగా పెళ్ళి చేసుకొందాం. కానీ ఇప్పుడు..."

అరుణ ముఖం గంభీరంగా అయిపోయింది. "నీకంత తొందరగావుంటే ఇంటికి వెడదాం పద. అమ్మా నాన్న మనకు వెంటనే పెళ్ళిచేస్తారు."

"నామీద నీకు నమ్మకం లేదా?" అన్నాను బాధగా.

"ఉంది. కానీ నామీద నీకు నమ్మకం పోవడం ఇష్టం లేదు" అంది అరుణ.

"నీతో నేనింక మాట్లాడను. నువ్వు నాకు మరదలివి. వరసయిన దానివి. కాబోయే భార్యవి. నీవద్ద అనుమతి కోసం ప్రాధేయపడవలసిన అవసరం నాకు లేదు. ఇప్పుడు నిన్ను బలవంతంగా అనుభవించే హక్కు నాకుంది—" అన్నాను. నా మనసునందుకు సిద్ధంచేస్తున్నాను.

"దానర్థం అరుణను హత్యచేస్తున్నానని!" అంది అరుణ.

"అంటే?"

"నువ్వన్నట్టుగా ప్రవర్తిస్తే ఈ రాత్రికే నేను ఆత్మ హత్య చేసుకుంటాను."

నేను కంగారుపడ్డాను. ఆమె ముఖంచూస్తే అన్నంత పనీ చేయగలదనిపించింది. అప్పటికప్పుడు ఆ ఆలోచన కట్టిపెట్టి "అరుణా! నన్ను నమ్మి నాతో హోటల్ గదికి వచ్చావు. నీకు భయం వేయలేదూ?" అనడిగాను.

"నామీద నాకు నమ్మకముంది. నాబావ నేను చెప్పి నట్లు వింటాడన్న నమ్మకంవుంది. ఈ రెండు నమ్మకాల వల్ల నాకేవిధమయిన అనుమానమూ, భయమూ కలగ లేదు" అంది అరుణ.

అరుణ తెలివయినదని గ్రహించాను. అయితే నా మోసాన్ని తెలుసుకునేటంత తెలివితేటలున్నాయా ఆమెకు.

నా పథకం కొంతవరకూ దెబ్బతింది. శీలాన్ని హరిస్తే సులువుగా ఆమె నా వశమవుతుందనుకున్నాను. అదంత సులభంగాలేదు. అందులోనూ ఆమె ముఖంచూస్తూంటే

ప్రేమతో లాలించ బుద్ధివేస్తుంది కానీ పశుబలంతో హింసించ బుద్ధి కాదు.

"పోనీ మనం వెంటనే పెళ్ళిచేసేసుకుందాం. అత్తయ్యాకూ, మామయ్యాకూ తెలియకుండా" అన్నాను.

"అమ్మా, నాన్నలకు తెలియకుండా పెళ్ళిజరగడానికి వీల్లేదు" అంది అరుణ.

"సరే, అందుకూ అంగీకారమే? ఎటొచ్చీ మీఅమ్మానాన్నలకు నేను ఎవరో తెలియకూడదు. ఇంకోపేరుతో వస్తాను. సరా?" అన్నాను. ఇదే నా ఆఖరు ఆశ.

"బావసంగతి తేలేవరకూ నాన్నగారు వేరేపెళ్ళి సంబంధాలు ఒప్పుకోరు" అంది అరుణ.

హతోస్మి! ఏం చెయ్యాలి?

అరుణని నా స్వంతం చేసుకోవాలంటే నేను విశ్వాన్నని చెప్పుకోవాలి. అదంత సులభమా? అరుణ కోసం అందుకయినాసరే తెగించమని మనసు చెబుతోంది.

# 5

నేను అరుణ యింటికి వెళ్ళకుండానే నన్ను నేను పరిచయం చేసుకోవాలనుకొన్నాను. అందుగురించి ఆమెవద్ద నుంచి రాబోయే నా మామగారు పనిచేసే ఆఫీసుఅడ్రసు తీసుకొన్నాను. అక్కడికివెళ్ళి ఆయనతో మాట్లాడినన్ను నేను విశ్వంగా పరిచయం చేసుకోవాలనిపించింది.

నమ్మకం లేకపోయినా మంచిరోజు చూసుకొని మరీ ఆయన దగ్గరకు వెళ్ళాను.

ఆ సమయానికి ఆఫీసులో ఆయన చాలా హడావుడిగా వున్నాడు. ముఖంచూస్తే హెడ్‌గుమస్తాలా వుందికానీ ఆయన ఆఫీసరయినా అయుండొచ్చు. ఇద్దరు ఉద్యోగ

స్తుల్ని చెడామడా తిట్టేసి అక్కణ్నించి పంపించి అదే ఊపులో నావైపు చూసాడు.

"ఎవరు మీరు, ఏంకావాలి?"

నాకు నోరు పెగలలేదు. ఆయన్ని చూస్తే నాకప్పుడు కాస్తభయం వేసింది. ఆయన ముఖం చూస్తూంటే నాకు అనుమానంకూడా వచ్చింది. బట్టతల ధుమధుమలాడే ముఖం, అరుణవంటి అందాలరాశికి తండ్రిస్థానంలో వున్నదంటే నాకు నమ్మబుద్ధికావడంలేదు.

"మీరు అరుణతండ్రి కదూ?" అన్నాను.

"అలాగంటే నాకు నచ్చదు. అరుణ నా కూతురు" అన్నాడాయన.

"నీవ్యక్తిత్వం మండిపోనూ" అనుకున్నాను మనసులో.

"ఊఁ అరుణ నా కూతురు. ఇంతకీ మీకు నాతో ఏంపని?" అన్నాడాయన.

హఠాత్తుగా నాలోని చిలిపిమనిషి మేల్కొన్నాడు. ఆఫీసరుస్థానంలో ఇద్దరు వుద్యోగుల్ని నానా మాటలూ అనేసి తనను చూడ్డానికివచ్చిన అతిధివంక అదేచూపు చూస్తున్న ఆయన్ను కాస్త ఏడిపించాలనిపించింది. ఆయన దగురుతనాన్నరికట్టి నాతో మాట్లాడేలా చేయాలనిపించింది. అందుకోసం మొదట్లో నేననుకున్న పథకాన్ని మార్చుకున్నాను.

"మీ అమ్మాయి నాకు ప్రేమలేఖ రాసిందండి—" అన్నాను నెమ్మదిగా.

"ఏమన్నారూ?" అన్నాడాయన కోపంగా.

"మీకు వినిపించిందనే అనుకొంటాను—" అన్నా నమాయకంగా.

"నా కూతురు నిప్పు..."

"అందుకే అరుణ అని పేరు పెట్టారనుకుంటాను. మనిషికూడా నిప్పులా ఎర్రగా వుంటుంది. నిప్పుకూ మీ అమ్మాయికీ తేడావుంది. నిప్పును ముట్టుకోవాలనిపించదు"

"అధిక ప్రసంగం చేస్తున్నారు" అన్నాడాయన విసుగ్గా. అది విసుగుకాదని కోపాన్ని అణచుకొందుకు ప్రయత్నిస్తే అలా బయటపడిందనీ నేను గ్రహించాను.

"మీ అమ్మాయి నాకు ప్రేమలేఖ రాసిందని చెప్పానండి."

"ఐతే ఏం చెయ్యమంటారు?"

"సమస్య ఏమీ లేదండీ. నేనూ ఆమెను ప్రేమిస్తున్నాను. మీరు ఒప్పుకొంటే ఆమెను నేను పెళ్ళిచేసుకొంటాను."

"చూడబ్బాయ్" అన్నాడాయన సంబోధన యేకవచన ప్రయోగంలోకి మారుస్తూ. "నువ్వు యెవరితో మాట్లాడుతున్నావో, ఏం మాట్లాడుతున్నావో తెలియదనుకొంటాను. మా అమ్మాయి తన బావకోసం యెదురు చూస్తోంది. అతన్ని ప్రేమించింది. అతన్నితప్ప యింకెవరినీ పెళ్ళిచేసుకోనంది. మాకూడా అమ్మాయినింకొకళ్ళకిచ్చి పెళ్ళిచేసే వుద్దేశ్యంలేదు. ప్రేమలేఖ రాసిందనీ, నీతో కలిసి తిరుగుతోందనీ నువ్వుచెప్పే అబద్ధాలు నేను నమ్మను."

"అన్నట్లు చెప్పడం మరిచానండి. ఆమెరోజూ సాయంత్రం నన్ను కలుసుకొందుకు పార్కుకి వస్తుందండి."

ఆయనముఖం ఎర్రబడింది. "మాటలు మితి మీరుతున్నాయి."

"మీకేదైనా అనుమానముంటే ఈరోజు సాయంత్రం పార్కుకు రావచ్చును."

"మిస్టర్ రఘునాథ్!" అన్నాడాయన తీవ్రంగా. "నీ గురించి నాకు బాగా తెలుసు. నేను చాలాచాలా నీగురించి విన్నాను. నాకు కోపం తెప్పించావంటే నీకు చాలా ప్రమాదం. నా క్లాస్‌మేట్స్ ఇద్దరున్నారు పోలీస్ డిపార్ట్‌మెంట్లో!"

తెల్లబోయాను. ఈయన నన్నెరుగునన్న మాట. ఐతే అదెలా సాధ్యం?

ఈయన్ని నేనెప్పుడూ చూడలేదు. ఈయనకు నేను యెలా తెలుసు? ఈ కారణంగా నా పథకం దెబ్బతిసేసింది. ఈయన్ని బాగా వుద్రేకపరచి వెళ్ళిపోదామనుకున్నాను. ఇంటికివెళ్ళి పార్కు వ్యవహారం గురించి కూతుర్ని గదమాయిస్తే ఆమె తను కలుసుకొంటున్నది బావనే అని చెబుతుంది. అప్పుడు ఓ మంచిరోజు చూసుకొని నేనే వాళ్ళయింటికి వెళదామనుకొన్నాను. ఐతే ఈయనకు నేనెవరో తెలుసు. అరుణతో నాకింక పెళ్ళి కాదు.

అరుణ లేకుండా నేను జీవించలేననిపించింది.

# 6

"ఈ రోజు ఒక చిన్న తమాషా జరిగింది" అంది అరుణ.

"ఏమిటది?"

"ఎవడో రఘునాథ్‌ట—నాన్న దగ్గరకు వెళ్ళి నేను తనకు ప్రేమలేఖ వ్రాశాననీ, వాడిని ప్రేమిస్తున్నాననీ, వాడితో పార్కుల్లో తిరుగుతున్నాననీ ఆయనకు చెప్పాడుట. ఆయన ఇంటికి వచ్చి నామీద ఎగిరిపడ్డారు..."

నేను ఆశ్చర్యపడ్డాను "ఆయన వాడి మాటలు నమ్మారా?"

"లేదు."

"మరి ఎగిరిపడడ మెందుకు?"

"ఆయన ఆ రఘునాథ్ గురించి చాలా విన్నారుట. వాడు బంధువర్గంలో తప్పపుట్టాడుట. అటువంటి వాడి దృష్టి నామీద పడ్డానికి కారణమేమిటి? ఏ ధైర్యంతో వాడు నాన్నకు నా గురించి అబద్ధాలు చెప్పాడు?—అంటే నా ప్రవర్తనలో ఎక్కడో సవరించుకోవలసిన లోపముందన్నమాట! ఆ విషయం హెచ్చరించే ముందు నాటకంగా నాన్న నామీద మండిపడ్డారు. నిజంగా నాలో తప్పు వుంటే ఆయన కోపానికి భయపడతాను కదా—ఆ విధంగా దొరికిపోతానన్నమాట!" అంది అరుణ.

"ముసలాడు అసాధ్యుడే" అని మనసులో అనుకున్నాను. పైకిమాత్రం-"సరే-నువ్వు దొరికిపోయావా?" అన్నాను.

"నేను నా బావను కలుసుకుంటున్నాను తప్పితే, ఆ రఘునాథ్‌ను కలుసుకోవడం లేదుగదా - అందువల్ల నేను తప్పుచేయడం లేదు. దొరికిపోయే ప్రసక్తిలేదు."

"మన విషయం మీ నాన్నకు చెప్పావా?"

"లేదు. కన్న తల్లిదండ్రులకంటె నిన్నే ఎక్కువ నమ్ముతున్నాను. నీ మాట వినడం నా విద్యుక్తధర్మంగా భావిస్తున్నాను" అంది అరుణ.

నా మనసుకు ఎక్కడో ఏదోలా తగిలింది. ఈమె నన్ను మరీ ఎక్కువగా నమ్ముతోంది. ఏదో ఉపాయంపన్ని నేను ఈమె బావస్థానంలో ప్రవేశించాలి. అయితే అరుణ తండ్రికి నా గురించి బాగా తెలుసు. ఆయన నా మాటలు

నమ్మడు-పోతే మారువేషం వెయ్యాలి. అప్పుడు అరుణ నన్ను నమ్మదు. వీళ్ళిద్దరినీ నమ్మించేలా చేయడానికి నేనింకేమైనా చేయాలి.

"ఏమిటీ ఆలోచనలో పడ్డావ్!" అంది అరుణ.

"నీ ప్రేమ నా ఆలోచనల్లో చాలా మార్పులు తీసుకొస్తోంది" అన్నాను.

# 7

"బాగా మారిపోయావు మామయ్యా!" అన్నాడు విశ్వం.

చక్రపాణిగారు అతడివంక ఆశ్చర్యంగా చూసి "ఈ అవతారం ఏమిట్రా?" అన్నాడు. విశ్వం గురించి ఆయన చాలా గొప్పగా ఊహించినట్లున్నాడు. ఇతగాడు చూస్తే చాలా అందవికారంగా వున్నాడు.

"డబ్బయితే సంపాదిస్తున్నాను గానీ పోగొట్టుకున్న రూపాన్ని తిరిగి పొందలేకపోతున్నాను మావయ్యా— రోగాలు, ప్రమాదాలు తరుముకువచ్చి నన్నిలా తయారు చేశాయి. నాకున్న కోరికల్లా ఒక్కసారి నిన్నూ, అత్తయ్యనూ, అరుణనూ చూసిపోదామని..." అన్నాడు విశ్వం.

"అంతేనా?" అన్నాడు చక్రపాణి.

"అరుణను పెళ్ళిచేసుకోవాలని మొదట్లో అనుకున్నాను మావయ్యా—కానీ దాని ఫోటో చూశాక నా మనసు మారిపోయింది. ఆ అందాల బొమ్మకు నేను తగనని గ్రహించాను. అయితే నా కురూపితనం మీ ముందు ప్రదర్శించడానికి భయంవేసింది. అందుకే నేను మీ దగ్గరకు రావడం వాయిదా వేస్తూ వచ్చాను. ఈ కారణంగా దాని పెళ్ళికి ఆలస్యమైపోతోందన్న విషయాన్ని చాలా ఆల

స్యంగా గ్రహించి ఇప్పుడు వచ్చాను" అన్నాడు విశ్వం.

"చిన్నప్పుడు దొరబాబులాగుండే వాడివి" అన్నాడు చక్రపాణి నిట్టూరుస్తూ.

"ఆ రూపమే మీ మనసులో ఎల్లకాలమూ వుండిపోవాలనుకున్నాను. కానీ పరిస్థితులు నన్ను మీ ముందుకు నడిపించాయి. నేను అరుణకోసం అయిదువేల రూపాయలు తీసుకువచ్చాను. ఆ డబ్బు దాని పెళ్ళికి వినియోగిస్తే అది నాకు చాలా తృప్తినిస్తుంది" అన్నాడు విశ్వం.

"సినిమాలో హీరోల్లా ఆ మాటలేమిటిరా? నీ ముఖం బాగుండక పోవచ్చు కానీ నీ మనసు బంగారం. అరుణ మనసు దాని బావ మనసుతో ముడిపడింది కానీ రూపంతో కాదు. నువ్వు పిచ్చికబుర్లు చెప్పకు. పద—ఇంటికి పోదాం" అన్నాడు చక్రపాణి.

"ఇంటికి వస్తాను కానీ పెళ్ళివిషయం నువ్వికమరిచి పోవాలి. నన్నూ అరుణనూ కలిపి పక్క—పక్కన ఊహించుకుంటూంటే నా గుండె చెరువై పోతోంది. సామాన్యంగా కనబడే ఆడపిల్లలే నేనంటే ఇష్టపడడం లేదు. ఏదో సెంటిమెంటు తాత్కాలికంగా ఔననిపించినా అది శాశ్వతం కాదు. కాలేదు. పెళ్ళంటే క్షణికావేశంకాదు మావయ్యా—నూరేళ్ళ జీవితపు పంట!" అన్నాడు విశ్వం.

"చాలా పెద్దమాటలు నేర్చావులే" అన్నాడు చక్రపాణి.

ఇద్దరూ ఆక్రమించి కదిలారు. ఈ దృశ్యాన్ని కాస్త దూరాన్నుంచి గమనిస్తున్న నేను పార్కు—వు బయల్దేరాను.

## 8

"ఇంక నీతో, అబద్ధం చెప్పలేను అరుణా! నా పేరు విశ్వం కాదు. రఘునాథ్!" అన్నాను దీనంగా ముఖం పెట్టి.

అరుణ నమ్మలేనట్లు నా వంక చూసి—"ఏమన్నావ్-మళ్ళీ అను" అంది.

ఈ పర్యాయం ఆమెకు అంతా నిజమే చెప్పాను. ఆమెను నేను ఏ ఉద్దేశ్యంతో పలకరించిందీ, ఆమె బావ అనగానే నా ఊహాలెలా మారిందీ వగైరా చాలా నిజాలు చెప్పాను.

అరుణ కళ్ళలో నీళ్ళు తిరిగాయి "ఇది నిజంకాకపోతే ఎంత బాగుండును?" అందామె. నిరుత్సాహం ఆమె ముఖంలో గూడు కట్టుకుంది.

బావ చుట్టూ ఎన్నో ఆశలు పేర్చుకున్న అరుణకు నేను బావను కానని తెలిసేసరికి ఎక్కడలేని బాధ కలిగినట్లుంది.

"నీ బావగా పుట్టివుంటే బాగుండునని నాకూ వుంది. నీ బావను కానన్న ఒక్క కారణం ఆధారంగా నన్ను పెళ్ళిచేసుకోవడం మానేస్తావా, అరుణా!" అన్నాను.

అరుణ కోపంగా నా వంక చూసి—"నన్ను పేరుపెట్టి పిలవద్దు. నువ్వొట్టి మోసగాడివి" అంది. అంటూనే ఆమె లేచి నిలబడింది. నేనూ లేచాను.

"వెళ్ళిపోతావా అరుణా!"

"నీ నోటివెంట నా పేరు రావడం సహించలేను" అంటూ అరుణ అక్కణ్ణించి కదిలింది. ఆమె విసిరికొట్టినా సరే నేనామెను అనుసరించడం మానలేదు. ఆమెతో కలిసి ఇంటికి బయల్దేరాను. అయితే ఆమె నా పక్కన పక్కన వుండడంలేదు. నేను పక్కగా వచ్చినపుడల్లా ఆమె విసురుగా ముందడుగు వేస్తున్నది. ఆ విసురు, ఆ కోపం, ఆ చలాకీ నడక ఆమె అందానికి సొగసునిచ్చాయి. నిజంగా అరుణ నా భార్య అయినట్లయితే ఈ జీవితానికి అంతకుమించిన వరం అవసరంలేదు!

అరుణ ఇల్లు చేరేసరికి ఇంటి అరుగుమీద చక్రపాణి, విశ్వం కూర్చుని వున్నారు.

"ఇతనెవరో చెప్పుకో!" అన్నాడు చక్రపాణి అరుణకు విశ్వాన్ని చూపించి.

"ఏమో–నాకు తెలియదు" అంది అరుణ.

"పోనీ–ఊహించు."

"ఊహించలేను."

"నీ బావ విశ్వం అమ్మా" అన్నాడు.

"ఆఁ" అంది అరుణ అప్రయత్నంగా..."అయితే వాడు నిజంగా రఘునాథే నన్నమాట" అంది ఆఖరి ఆశ కూడా నశించిపోయినట్లు. తనకు బావగా పరిచయమైన కొత్త వ్యక్తివంక ఆమె చాలా నిరుత్సాహంగా చూసింది.

అందుకు కారణం అతను అందవికారంగా వుండడం మాత్రమే కాదనీ, ఆమె తనకు తెలియకుండానే నన్ను ప్రేమిస్తున్నదనీ వూహించగలిగాను. ఆ వూహ నాకు చాలా ఆనందాన్ని కలిగించింది. ఆ ఆనంద సమయంలో చక్రపాణిగారు నన్ను చూసిన విచారకరమైన విషయం జరిగింది.

"నువ్విక్కడి కెందుకొచ్చావ్?" అన్నాడాయన కోపంగా.

"నాన్నా ఇతడేనా రఘునాథ్ అంటే?" అనడిగింది అరుణ. ఆమెలో ఇంకా ఏమైనా ఆశ మిగిలివుంటే అది చక్రపాణి జవాబు తుడిచి పెట్టేసింది.

"ఇతడు నన్ను మోసం చేశాడు" అంది అరుణ.

చక్రపాణి కంగారుగా–"మోసం అంటే?"అన్నాడు.

అరుణ చలికిలబడిపోయింది.

"అంతా వివరంగా చెబుతానుండండి" అంటూ నేను అరుణ నన్నెలా ఆకర్షించిందీ, మా పరిచయం ఎలా వృద్ధి

పొందిందీ వివరంగా చెప్పాను. నేనా వివరాలు చెబుతూంటే చక్రపాణి శాస్త్ర కంగారుగానే విన్నాడు. మోసం అన్న పదానికి ఆయన ఊహించిన లాంటి అర్థం నేను చెప్పిన వివరాల్లో లేకపోవడంలో ఆయన మనసు శాస్త కుదుట పడిందనుకుంటాను. మళ్ళీ నార్మల్ కు వచ్చాడు. అంటే నా మాటలు భరించే ఓర్పు పోయిందన్న మాట.

"నువ్వు తక్షణం ఇక్కణ్ణించి వెళ్ళిపో!" అన్నాడు చక్రపాణి.

"మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే నా జీవితానికొక అర్థం ఏర్పడుతుందనుకుంటున్నాను. నా ఆశలు అడియాసలు చేయకండి. నన్ను నిరుత్సాహపరచకండి. నాకు బోలెడు డబ్బుంది" అన్నాను.

"నీ జీవితాని కర్థం ఏర్పరచడంకోసం నేను నా కూతుర్ని కనలేదు. అలాంటి దౌర్భాగ్యుడీ భూమ్మీద వుంటాడనుకోను. నువ్వు ఇక్కణ్ణించి వెళ్ళు!" అన్నాడు చక్రపాణి.

నేను దీనంగా ఆయన కళ్ళలోకి చూసి అక్కణ్ణించి కదిలాను.

# 9

"నన్ను క్షమించరా రఘూ!" అన్నాడు వాడు.

"ఎందుకు?"

"అరుణ నన్నే పెళ్ళి చేసుకుంటా నంటోంది."

"అయితే నిన్ను క్షమించండ మెందుకు? ఆమెకు తన బావమీద ప్రేమ అంతగా వుంది."

"అవుననుకో – నేనెంత చెప్పినా ఆమె నిన్ను పెళ్ళి చేసుకోనంటోంది. బావను తప్ప ఊహలోకూడా ఇంకో

కర్నీ తనకు భర్తను చేసుకోలేనంటోంది. ఇంతకాలం నీతో సరదాగా గడిపినందుకు ఆమె ఎంతో సిగ్గుపడుతోంది."

"అవును. నెమ్మదిగా ఆమెను మార్చాలి" అన్నాను.

"మారదురా. ఆమె మారదు."

"అయితే ఏమంటావ్?" అన్నాను విసుగ్గా.

"నువ్వు నన్ను క్షమించాలిరా."

"ఎందుకు?"

"నేను అరుణను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను."

పక్కలో బాంబు పడ్డట్టు ఉలిక్కిపడ్డాను — "ఏమన్నావ్?"

"ఈ జీవితంలో అరుణలాంటి బంగారు బొమ్మ నాలాంటివాణ్ణి ప్రేమించడం జరుగదు. నీ దయవల్ల ఎలాగో జరిగింది. ఈ అదృష్టాన్ని వదులుకోలేను."

"బాగుందిరా—స్నేహితుడివికదా అని నిన్ను రంగంలోకి దింపితే నాకే ఎసరు పెడతావా?"

"ఇందులో ఎసరు ప్రసక్తి ఏముంది? అరుణ నిన్ను అసహ్యించుకుంటోంది. నన్ను కోరి వరించింది!"

"అరుణ నీ రూపాన్ని చూసి వరించలేదు. నువ్వు నిజంగా విశ్వానివేనని నమ్మింది. ఆమె ప్రేమ భావకు అంకితమైపోయింది. ఆ భావ స్థానంలో నేనున్నంతకాలం నన్ను ప్రేమించింది. ఇప్పుడు నువ్వు రాగానే నిన్ను ప్రేమిస్తోంది. నిజం ఏదో ఒక రోజున బయటపడకపోదు. ఆ రోజుతో మీ బంధం తెగిపోతుంది. అశాశ్వతమైన ఆ బంధంకోసం శాశ్వతమైన మన స్నేహబంధాన్ని దెబ్బ తీయకు" అన్నాను.

"అరుణతో బంధం శాశ్వతం కాదని నాకూ తెలుసు. కానీ డబ్బిచ్చినా నన్ను ప్రేమగా భావించలేకపోతు

న్నారు ఆడవాళ్ళు. అలాంటప్పుడు తాత్కాలికంగానే అయితేనేం—అరుణలాంటి అమ్మాయి ప్రేమ నాకు లభించడం చాలా అదృష్టం. ఆమెతో ఒక్కరోజు గడిపినా ఈ జన్మకు సరిపోతుంది."

నాకు గుండెలు మండిపోయాయి— "బాగుందిరా—. నిన్ను విశ్వం స్థానంలో ప్రవేశపెట్టినది నేనేనని చెప్పమంటావా?" అన్నాను.

"చెబితే అరుణ నన్నసహ్యించుకోవచ్చు. కానీ అప్పుడు ఆమె నిన్నింకా ఎక్కువగా అసహ్యించుకుంటుంది. అరుణను నాక్కాకుండా చెయ్యగలవేమో కానీ— అలా చేయడంవల్ల నువ్వు బావుకునేదేముంది— మన స్నేహబంధాన్ని దెబ్బతీయడం మినహాయించి" అన్నాడు వాడు.

ఏం చేయాలో నాకు పాలుపోలేదు. నా పథకాలు ఒకదాని తర్వాత ఒకటి దెబ్బ తింటూ అరుణను నాకు రోజురోజుకీ మరింత దూరం చేస్తున్నాయని గ్రహించాను.

# 10

"విశ్వం కావాలి" అన్నాను.

"ఎందుకు?" అందామె.

"అతనితో అర్జంటుగా మాట్లాడాలి."

"విశ్వం ఇంట్లో లేడు."

"ఎక్కడికి వెళ్ళాడు?"

"చెప్పలేదు."

ఆమె సమాధానం నాకు ఆశ్చర్యంగా తోచింది "ఎప్పుడు వస్తాడు?"

"తెలియదు."

"సరేలెండి. అతన్ని కలుసుకోవడం నాకు తప్పని సరి. అతను వచ్చేదాకా ఇక్కడే కూర్చుంటాను" అన్నాను.

"ఎంతకాలమని ఇలా కూర్చుంటారు? అతనొక వేళ నెలల తరబడి రాకపోతే..."

"అతను ఎప్పుడు వచ్చేదీ మీకు తెలియదుగా. కాసే పట్లో వచ్చినా రావచ్చు. నాకు చాలా ఓపిక వుంది" అన్నాను.

ఆమె అసహనంగా నావంక చూసి "విషయమేమిటో నాతో చెప్పు. విశ్వానికి చేరవేస్తాను" అంది.

"నేను విశ్వంతో స్వయంగా మాట్లాడాలి" అన్నాను

"ఐతే నీకర్మ!" అన్నదామె.

"కర్మ నాదికాదు. విశ్వానిది. అతని ప్రియురాలికి అనగా స్వయానా మరదలికి త్వరలో వివాహంకానున్నది" అన్నాను.

"ఎవరితో?" అన్నదామె కంగారుగా.

"విశ్వంతో—"

"విశ్వానికి తెలియకుండానా?"

"తెలియకుండానే మరి..." అనినవ్వి, "అక్కడ విశ్వం వుంటున్నట్లు మాత్రం విశ్వానికి తెలుసా మరి?" అన్నాను.

"అంటే?"

"ఒకడు విశ్వం పేరుతో అక్కడ చేరాడు. వాణ్ని వాళ్ళునమ్మి ఆదరించి పెళ్ళికి ముహూర్తం పెట్టారు."

"సరే— ఈసంగతి వాడికి చెబుతాన్లే. వాడు వెంటనే వుత్తరం రాసిపారేస్తాడు."

నేను నవ్వి, "అదంత సులభంకాదు. అరుణ ఇంటికి వెళ్ళే ఉత్తరాలన్నీ ముందుగానే తనకు చేరే యేర్పాటు

చేసుకున్నాడు నకిలీ విశ్వం. వాటిని చదివి విశేషాలు తెలుసుకొని ప్రమాదకరమయినవి వుంటే నొక్కిపెట్టేసున్నాడు వాడు" అన్నాను. ఐతే పోస్టుమాన్‌కు లంచం ఇచ్చి ఈ పని చేస్తున్నది నేనేకానీ నకిలీవిశ్వం కాదు.

"మరి ఏం చెయ్యాలంటావ్?"

"నేను విశ్వంతో స్వయంగా మాట్లాడితే తప్ప ఉపాయం లేదు" అన్నాను.

ఆమె ఆలోచించి "విశ్వం ఎక్కడుంటాడో చెబుతాను. నువ్వు వాణ్ని గుర్తుపట్టగలవా?" అంది.

"ఇంతవరకూ అతన్ని చూడలేదు. ఫోటో చూపిస్తే గుర్తుపట్టగలను" అన్నాను.

"ఇంట్లో ఫోటో లేదు కానీ-సాయంత్రంరా. విశ్వాన్ని చూపిస్తాను" అందామె.

అక్కణ్నించి కదిలాను. ఈ వ్యవహారమంతా ఏదో మిస్టరీగా తోచింది నాకు.

విశ్వం సంగతి తెలుసుకోవడం నాకు చాలా కష్టమయింది. అరుణను నకిలీ విశ్వంబారినుండి రక్షించుకోవడానికసలు విశ్వాన్ని కలుసుకోవడం చాలా అవసరమనిపించింది. ఎందుకంటే అరుణను నేను నిజంగానే ప్రేమిస్తున్నాను. ఆమె నాకు దక్కకపోతే పోయింది. కనీసం అప్పుడయినా ఆమె కోరిక తీరాలి. నమ్మకద్రోహి, మిత్రఘాతుకుడయిన నకిలీ విశ్వంచేతిలో ఆమె పడకూడదు.

విశ్వాన్ని కలుసుకుందుకు చక్రపాణిగారిదివరలో ప్రయత్నించాడట. అతనిచ్చిన అడ్రసునుబట్టి ఏవిధమైన సమాచారమూ లభించలేదుట. అందుకే నేనో ఉపాయమాలోచించాను.

విశ్వంపేరున నేనే ఓ ఉత్తరంరాసి దాంతోపాటే నేనూ హైదరాబాదు బయల్దేరాను. తిన్నగా ఆ పోస్టా

ఫీసుకు వెళ్ళాను. పోస్టుదగ్గర కాశాను. నేను చేరిన మరు నాడు నా వుత్తరం ఆ పోస్టాఫీసు చేరింది. పోస్టుమన్ కూడా దానిగురించి అడగలేదు. ఏదో తోచినపేరు చెప్పి పోస్టుచూసి ఆ ఉత్తరాన్ని గమనించాను. అది గుర్తు కోసం ఎర్రకవర్లో రాశాను. ఆ తర్వాత పోస్టుమన్ని అనుసరించసాగాను.

ఆ ఎర్రకవరు పోస్టుమన్ ఒకగదిలో ఇచ్చాడు. ఉత్తరంమీద చిరునామాకూ ఆ గదికీ యే విధమయిన సంబంధమూలేదు. బహుశా పోస్టుమన్కూ అతనికీ యీ విషయంలో అండర్స్టాండింగ్ వుండివుంటుంది.

తన చిరునామా విషయం ఇంత రహస్యంగా వుంచా డంటే విశ్వంలో నిజంగా ఏదో పెద్ద రహస్యం ఉన్న దనే అనుకోవాలి. నాకు కుతూహలం పెరిగింది. ఆ గదిలో ఉత్తర మందుకున్నతన్ని పలకరించాను.

ముందతను తనకేమీ తెలియదని బుకాయించాడు. నేను నిజంగానే విశ్వం శ్రేయోభిలాషినని అతన్ని నమ్మించే సరికి నా తలప్రాణం తోకకు వచ్చింది. అప్పుడతను చెప్పిందాన్నిబట్టి ఈ ఇంటికి వచ్చాను.

ఈ ఇంట్లో ఒక నడివయస్కురాలుంది. విశ్వాన్ని చనువుగా వాడు అని అంటోంది. కానీ అతని గురించి ఏమీ చెప్పడంలేదు. కానీ విశ్వంస్థానంలో ఒక నకిలీ విశ్వం తయారయ్యాడంటే ఆమె కంగారు పడింది. విశ్వం, అరుణల ప్రేమగురించి ఈమెకు బాగా తెలిసి వుండాలి.

అసలీ విశ్వం ఎవరు? నిజంగా అరుణకు బావయేనా? తన వునికిని అంత రహస్యంగా వుంచుతూ అతను అరుణను ఎందుకోరిస్తున్నాడు? తన ఉనికినంత రహస్యంగా వుంచ వలసి నవసరం విశ్వానికి యెందుకు కలిగింది?

జవాబులు నాకు స్ఫురించడంలేదు. ముందుగా విశ్వం ఎప్పుడొస్తాడో తెలియదని చెప్పిన ఆమె తర్వాత అతన్ని సాయంత్రం చూపిస్తానంది. విశ్వాన్ని చూపించడ మేమిటి? విశ్వం వస్తాడనవచ్చు. ఇంకోలాగ నవచ్చు. చూపిస్తాననడ మేమిటి? కదలలేని స్థితిలో వున్న వాళ్ళను, బందీలుగా వున్న వాళ్ళను మాత్రమే చూపించడం జరుగుతుంది.

ఆవిడ చెప్పిన చూపిస్తానన్న పదం పొరపాటున వాడ బడిందా? లేక విశ్వం నిజంగానే ఎక్కడయినా బందీగా వున్నాడా?

సాయంత్రం ఆవిడ చెప్పిన ప్రకారం ఇంటికి వెళ్లాను. ఇంట్లో ఒక మగమనిషి ఉన్నాడు. సుమారుగా నా వయసే వుంటుంది. ఎటొచ్చీ నాకంటే అందంగానే వున్నాడు.

"ఇదే విశ్వం!" అందావిడ.

అతనికి నన్ను నేను పరిచయం చేసుకొన్నాను.

"నాకు ఒక్కటే ఉపాయం కనబడుతోందండీ— ఈ ఉత్తరం ఎలాగోలా మీరు అరుణకు చేరేలా చేయాలి" అన్నాడు విశ్వం.

ఉత్తరం చదివాను.

"ప్రియమైన మరదలికి—

చాలాకాలంగా ఉత్తరం రాయనందుకు మన్నించ గలవు. నాకు వచ్చిన ఇబ్బందులేమిటో స్వయంగా వచ్చి మనవి చేసుకుంటాను. మనం కలుసుకు నేందుకు ఇంక ఎంతో కాలం పట్టదు. రాగానే నన్నెలా గుర్తు పట్టాలనుకుంటున్నావా? నాదస్తూరీ వుందిగా!

నీ విశ్వం"

ఆ ఉత్తరం చదవగానే ఒక విషయం గుర్తుకు వచ్చింది. విశ్వం దస్తూరిలో ఒక ప్రత్యేకత వుంది. ఇది

విశ్వం దస్తూరీయే! ఆ విషయం నిరూపించడానికి దస్తూరీ నిపుణులే అవసరంలేదు!

ఉత్తరం జేబులో పెట్టుకుని "మీ ఇబ్బందులేమిటో తెలుసుకోవాలనుంది నాకు. నేను అరుణ శ్రేయోభిలాషిని—" అన్నాను.

"ప్రస్తుతానికి ఉత్తరం ఆమెకు చేర్చడమే మీరు నాకు చేయగల ఉపకారం" అన్నాడు విశ్వం.

"అయితే ఉత్తరంలో మరి రెండు మాటలు రాయాలి. మీరు కారణాంతరాలవల్ల కొద్ది మాసాలుగా హైదరాబాదు వదిలిపెట్టి పోయినట్లు స్పష్టంగా అరుణకు తెలియజేయడం అవసరం" అన్నాను.

అతని ముఖంలో కంగారు కనపడింది "ఆ అవసరం లేదనుకుంటాను" అన్నాడు.

"పరిస్థితి మీకు బాగా అర్థంకాలేదు—" అన్నాను.

ఆ నడివయసు ఆవిడ కల్పగజేసుకుని "రాయడం మంచిదని నాకూ అనిపిస్తోంది. ఉత్తరం మరీ ఇంత చిన్నగా ఉండడం బాగోలేదు. బాగా ఆలోచించి రాత్రికి ఇంకో ఉత్తరం రాయి. ఉదయం ఇతను వచ్చి పట్టుకువెడతాడు" అంది.

"ఉత్తరంకోసం నేను మళ్ళీ రావాలా? ఇప్పటికిప్పుడు రాసిచ్చేస్తే సరిపోదూ?" అన్నాను.

"జాగ్రత్తగా ఆలోచించి రాయాలికదా. ప్రొద్దున్నే వచ్చేయ్" అంది.

మర్నాడు ఉత్తరం రెడీగా వుంది. ఈసారి ఉత్తరం చాలా పకడ్బందీగా వుంది. దాన్ని కవర్లో పెట్టి అరుణకు పోస్టు చేశాను.

# 11

ఆ ఉత్తరం బాగా పనిచేసింది. నకిలీ విశ్వంగాడి రంగు బయటపడింది.

వాడెంత ప్రయత్నించినా విశ్వం దస్తూరీని అనుకరించలేకపోయాడు. చక్రపాణి పోలీసులదాకా వెడతానసేసరికి వాడు ఇల్లు వదిలి పారిపోయాడు.

అదృష్టమేమంటే వాడు అరుణకు నాగురించి చెప్పలేదు. తనే ఆమెను పెళ్ళిచేసుకునేందుకు సిద్ధపడ్డాడు కాబట్టి, నాగురించి చెప్పినా నమ్మదనుకున్నాడో ఏమో వాడు నన్ను రక్షించాడు. నేను రక్షించబడినప్పటికీ అరుణకు నాపైన కరుణ కలగలేదు.

ప్రస్తుతం ఆ ఇంట్లో ఏమి జరుగుతూవుంటుందో ఊహించగలుగుతున్నాను. అరుణ మానసికంగా బాగా దెబ్బతిని వుంటుంది. తన బావకు ఉత్తరం రాసి వుంటుంది. ఈసారి బావ అంటూ ఎవరు వచ్చినా నమ్మననీ దస్తూరీ పరీక్ష పెడతాననీ రాసివుంటుంది. అంద వికారంగా వున్న నకిలీ విశ్వం తన మేనల్లుడు కానందుకు చక్రపాణి కూడా తేలిగ్గా ఊపిరి పీల్చుకుని వుంటాడు. అయితే విశ్వం పేరు చెప్పి తన కూతుర్ని మోసంచేయడానికి ప్రయత్నాలెందుకు జరుగుతున్నాయీ అని ఆయన మధనపడడం కూడా జరుగుతూంటుంది.

అరుణ నన్ను చూసినా మాట్లాడదు. నాకెంతో బాధగా వుంటుంది. నన్ను వాళ్ళింటికి రానివ్వరు. నా అసహాయతకు దుఃఖం వస్తోంది. అయినా నేనామెకు హాని తలపెట్టలేదు. నేనామెను ప్రేమిస్తున్నాను.

అరుణ బావ వచ్చి తను అరుణను ప్రేమించడంలేదని చెప్పి నేనామెకు చేసిన ఉపకారం గురించి ఆమెకు

చెబితే అప్పుడైనా ఆమె నన్ను మన్నించగలుగుతుందేమో!

మానవుడు ఆశాజీవి. ఆ ఆశతోనే నేను బ్రతుకుతున్నాను. అరుణను జీవిత భాగస్వామిగా చేసుకోవాలన్న కోరికతప్ప మరేమీ నాకిప్పుడు మిగలలేదు.

నేను ఎదురుచూస్తూండగానే ఒకరోజు బజార్లో నాకెదురైనప్పుడు - ఎప్పట్లా ముఖం తిప్పేసుకోకుండా నావైపు చూసి నవ్వింది అరుణ. అప్పుడు నాకెంత సంతోషం కలిగిందో మాటల్లో వర్ణించి చెప్పలేదు

"ఎన్నాళ్ళకు నన్ను చూసి నవ్వావు?" అన్నాను.

"నాకు చాలాసంతోషంగా వుంది. ఇప్పుడు నాకెవరిపైనా ద్వేషంలేదు..." అంది అరుణ.

"ఏమిటి కారణం?"

"బావ వచ్చాడు" అంది అరుణ. ఆమె సంతోషం మాటల్లో తెలిసిపోతోంది.

నా ఉలికిపాటును పైకి కనపడనీయకుండా "ఇది మూడోసారికదూ?" అన్నాను.

"అవును. ఇదే ఆఖరుసారికూడా!" అంది అరుణ.

"ఎందుకని?"

"బావను గుర్తుపట్టడానికి మార్గం తెలిసింది" అంది అరుణ.

ఏమిటా మార్గమని అడగలేదు. విశ్వం వచ్చాడన్న మాట!

"మా ఇంటికివస్తే బావను నీకు పరిచయం చేస్తాను" అంది అరుణ.

"అక్కర్లేదు!" అన్నాను.

"ఎందుకని?" అంది అరుణ.

"నీ బావ విశ్వాన్ని నేనిదివరకే హైదరాబాదులో చూశాను..."

అరుణ ఆశ్చర్యపడినా – "నేను నమ్మను." అంది.

"నేను ఒక్కసారి నీతో అబద్ధమాడాను. కానీ అది నా వృత్తి కాదు."

"బావను ఏ సందర్భంలో చూశావు? చూస్తే ఎలా గుర్తుపట్టావు?" అంది అరుణ.

"అదంతా పెద్ద కథ. అంతావిని నువ్వు నమ్మనని ప్రమాదముంది కాబట్టి చెప్పాలని నాకు కోరిక లేదు" అన్నాను.

అయితే అరుణలో కుతూహలం పెరిగింది. ఆమె మరీ నొక్కించడంలో నేను పక్కనున్న పార్కులోకి నడిచాను. ఆమె నన్ను అనుసరించింది.

నేను అరుణను ప్రేమిస్తున్న కారణంగా నకిలీ విశ్వం బారినుండి ఆమెను రక్షించగోరి హైదరాబాదు వెళ్ళి అతని ఉనికిని తెలుసుకునేందుకు చేసిన ప్రయత్నాలు, ఫలితాలు అరుణకు వివరించాను.

అంతా విని "చాలా ఆశ్చర్యంగా వుంది" అంది అరుణ. నమ్మలేనని చెప్పడానికి మొహమాటపడివుంటుందనుకున్నాను.

"ఎందుకని?"

"నా బావపై నాకు అనుమానాలు రేకెత్తించడం కోసం నువ్వు కల్పించిన కట్టుకథలాగుంది ఇది" అంది అరుణ అట్టే సంకోచించకుండా.

"నేను చెప్పింది నిజమని ఋజువు చేసుకోడానికి నా దగ్గరే ఆధారముంది. అది విశ్వం రాసిన మొదటి ఉత్తరం" అన్నాను. విశ్వం విషయంలో దస్తూరీకిచాలా

ప్రాముఖ్యత వుండడంవల్ల నేనది దాచివుంచాను ఎప్పు డైనా మం చిదని.

అరుణకు ఆ ఉత్తరం చూడాలనివుంది. కానయితే దానికోసం ఇంటికి రావడానికి భయపడింది. నేను తన బావనని తెలిసినప్పుడు ధైర్యంగా హోటల్ గదికి రాగలిగింది కానీ ఇప్పుడు నామీద ఆమెకు నమ్మకంలేదు నా మనసులో కించిత్తు బాధ కలుగకపోలేదు.

"నువ్వు బయట నిలబడు. లోపలకు రావద్దు. నేను లోపలకు వెళ్ళి ఉత్తరంకూడా తీసుకువస్తాను..." అన్నాను.

ఏమనుకుందో అరుణ ఒప్పుకుంది. ఇద్దరం మా ఇంటికి వెళ్ళాం. ఆమె బయట నిలబడలేదు. తనూ నాతోపాటు లోపలకు వచ్చింది ఆమె నాకిచ్చిన గౌరవానికి నా మనసు చాలా సంతోషించింది. ఆ గౌరవాన్ని నేను నిలుపుకోగలిగాను.

అరుణ ఉత్తరం చూసి "సందేహంలేదు. ఇది బావ దస్తూరీయే" అంది.

"నా దురదృష్టం. నేను నిన్ను ప్రేమించిన తప్పుకి నన్ను మరీ దారుణంగా అనుమానిస్తున్నావు..." అన్నాను.

"ప్రేమకోసం ఏమైనా చేస్తారుగదా ప్రేమికులు? అలా చేసినందుకు నిన్ను నేను తప్పుపట్టను. నా అనుమా నానికి నువ్వు నన్ను తప్పుపట్టకూడదు. ఎందుకంటే నేను నిన్ను ప్రేమించలేకపోవడం నా తప్పుకాదు" అంది అరుణ.

నేనేమీ మాట్లాడలేదు.

"బావను పరిచయం చేస్తాను నాతో వస్తే!" అంది అరుణ.

"చెప్పానుగా చూశానని!"

"మరోసారి చూడకూడదు కాబోలు!" అంది అరుణ.

"నీవు కాబోయే భర్త కాబట్టి ఎన్నిసార్లు చూసినా నీవు తనివి తీరకపోవచ్చు. కానీ నా సంగతి వేరు. అతను నీకాబోయే భర్త కాబట్టి అతన్ని చూడాలన్న ఊహకూడా నాకు బాగుండదు" అన్నాను.

"మమ్మల్నిద్దర్నీ పక్కపక్కన చూసి జంట ఎలా గుందో చెప్పాలదువుగాని ఒక్కసారి ఇంటికివచ్చి చూసి వెళ్ళు" అంది అరుణ.

అరుణకు నన్నేడిపించాలని వున్నట్లు గ్రహించాను. ఒకప్పుడు నేను ఆమెతో నాటకమాడి బావనని చెప్పాను. ఆ కసి ఆమెలో ఇంకా బాగా వున్నట్లుంది.

"ప్లీజ్!" అంది అరుణ.

కాదనలేకపోయాను. తొలిసారిగా ఆమె ఆహ్వానం పై ఆమె ఇంటికి వెళ్ళాను.

ఇంటికి వెళ్ళిన రెండునిమిషాల్లో అరుణ ఒక మనిషిని వెంటబెట్టుకుని వచ్చింది.

"ఇతనే మా బావ విశ్వం!" అంది.

నేనతన్ను చూసి ఉలిక్కిపడ్డాను. మైగాడ్! అతను నేను చూసిన విశ్వంకాదు.

# 12

"ఇదీ సంగతి!" అంటూ వివరించాను చక్రపాణికి. నేను చెప్పినదంతా విని ఆయన చాలా కంగారుపడ్డట్లు కనపడ్డారు. నా మాటల్లో ఆయనకు నమ్మకం కలిగినట్లే వుంది. అందుకు కారణాలున్నాయి.

విశ్వం అత్తయ్యకోసం, మామయ్యకోసం పట్టుబట్టలు తెచ్చాడు. మరదలికి గాజీ సిల్కు చీర తెచ్చాడు. పది వేలరూపాయల క్యాష్ తెచ్చి మామయ్యను దాచమన్నాడు. అతని దస్తూరీ సరిపోయింది. చిన్ననాటి పుట్టుమచ్చలు కూడా సరిపోయాయి. అంతవరకూ బాగానే వుంది.

విశ్వం తన ఉనికిని రహస్యంగా వుంచగోరమన్నాడు. అతను వచ్చినట్లు ఎవరికీ చెప్పవద్దన్నాడు. బయట తిరగడానికి ఇష్టపడడంలేదు. వివాహం కూడా రిజిస్టరు మ్యారేజి అంటున్నాడు. పెళ్ళికాగానే భార్యను తీసుకుపోతానంటున్నాడు.

అతను చిన్నవాడు ఇల్లువదిలిన మేనల్లుడేననడంలో సందేహంలేదు. కానీ అతడి ప్రవర్తన అనుమానాస్పదంగానే వుంది. హైదరాబాదులో అతనేం చేస్తున్నాడు?

నేను చెప్పిన వివరాలు విన్నాక చక్రపాణి కంగారు అధికం కావడంలో ఆశ్చర్యంలేదు. "మేనల్లుడుగదా అని చూస్తూ చూస్తూ నా కూతురికి అన్యాయం చేయలేను. వాడిగురించి మరికొన్ని వివరాలు తెలుసుకోవాలి. నువ్వు చెప్పినవన్నీ వింటూంటే నాకు భయంగా ఉంది" అన్నాడాయన.

"అరుణ తెలివిగా వ్యవహరించాలి—" అన్నాను నేను.

"వాణ్ణి చూడగానే దానికి మతిపోయింది. దస్తూరీ, పుట్టుమచ్చలలో వాడు విశ్వం అని రూఢి అయింది. వాడేమో మనిషి ఎర్రగా బుర్రగా బాగున్నాడు. దీనికింక వళ్ళు తెలియడంలేదు. బావ అంత అందగాడైనందుకు అది మురిసిపోతోంది" అన్నాడు చక్రపాణి.

నాకు బాధకలిగినప్పటికీ నిజం ఒప్పుకోక తప్పదు. నేను హైదరాబాదులో చూసిన మనిషికంటె చాలా బాగున్నాడు విశ్వం. హిందీ సినిమా హీరో అంత బాగున్నాడు. అరుణ పక్కన నుంచుంటే మేడ్ ఫర్ ఈచ్ అదర్ లాగున్నారు-వాళ్ళిద్దరూ. కానీ అతగాడిలో ఏదో పెద్ద మోసముందని నాకు అనుమానంగా వుంది.

"అల్లుడికి చెప్పకుండా మీరు నాతో బయల్దేరివస్తే ఇద్దరం హైదరాబాదు వెడదాం" అన్నాను. "వచ్చేటప్పుడు విశ్వం ఫోటోలుకూడా ఒకటిరెండు తీసుకు రండి."

చక్రపాణి అంగీకరించాడు.

ఇద్దరం హైదరాబాదు వెళ్ళి ఆ ఫోటోలను కొన్ని పోలీస్ స్టేషన్సులో చూపించాం. విశ్వం నేరాలు చేస్తూండి వుంటాడనీ, అతడు పోలీసుల జాబితాలో మనిషి అనీ నాకు అనిపించింది. నా ఊహ అబద్దం కాలేదు. ఒక పోలీస్ ఇన్స్పెక్టర్ విశ్వం ఫోటో గురించి "ఇతను రెండువారాల క్రితంవరకూ జైల్లో వున్నాడు" అన్నాడు.

"నేరం?" అనడిగాను.

"మైనారిటీ తీరని పిల్లను లేవదీసుకుపోడానికి ప్రయత్నించాడు..."

చక్రపాణి ముఖం మాడిపోయింది. ఒకప్పుడు నన్ను దుర్మార్గుడిగా భావించి నానామాటలూ అన్న ఆయన మేనల్లుడు నేరస్థుడనట్లు నాకారణంగా ఋజువు కావడం ఆయనకు చాలా బాధగా వుంది.

"ఇప్పుడేమిటి చెయ్యడం?" అన్నాడాయన.

"విషయం అర్థమవుతోంది నాకు. విశ్వం మీదగ్గరకు చాలాకాలం క్రితమే వచ్చామనుకుని జైలుపాలైన కార

ణంగా రాలేకపోయాడు. నేను అతనిగురించి వాకబు చేయడానికి వస్తే చాలాకాలంగా అతణ్ణి సాకుతూ వస్తున్నామె అతను జైల్లో వున్న విషయాన్ని అంగీకరించడానికి ఇష్టపడలేదు. నేనెప్పుడూ విశ్వాన్ని చూడలేదు కాబట్టి ఇంకో మనిషిని విశ్వంగా నాకు పరిచయం చేసి తన మనిషిని జైలుకు పంపించి ఉత్తరం రాయించి తెప్పించింది. అయితే విశ్వం చేసిన నేరం ఇది ఒక్కటేనా? అతనిక్కడ ఎలాంటి జీవితం గడుపుతున్నాడు? అన్న విషయాలు మీరింకా తెలుసుకోవలసి వుంది. అది అతని నోటమ్మట చెప్పిస్తేనే బాగుంటుంది'' అన్నాను చక్రపాణితో.

''నువ్వెలా చెబితే అలా వింటాను'' అన్నాడు చక్రపాణి.

ఆ మాటలు నాలో కొత్త ఆశలు చిగిర్చాయి. అరుణ విషయంలో నా అదృష్టం మళ్ళీ తిరగబడుతోందని గ్రహించాను.

హైదరాబాదులో మేము విశ్వం ఇంటికి వెళ్ళడానికి ప్రయత్నించలేదు. పోలీస్ స్టేషన్లో పనిజరక్కపోతే అప్పుడతని ఇంటికి వెళ్ళవచ్చునని అనుకున్నాము. కానీ అనుకున్నకంటె లాభసాటి సమాచారమే మాకు లభించింది.

## 13

''నువ్వు నేరస్థుడివి'' అన్నాను.

''కాదు'' అన్నాడు విశ్వం తడబడుతూ.

''ఎందుకురా దబాయిస్తావ్'' అంటూ అవసరమయిన కథంతా చక్రపాణి మేనల్లుడికి వివరించాడు.

విశ్వం ముఖంలో జీవంలేదు. ''నన్ను క్షమించు మావయ్యా!'' అన్నాడతను.

"ఎందుకు క్షమించాలో చెప్పు ఏడు—అప్పుడావిషయం చూద్దాం" అన్నాడు చక్రపాణి.

చక్రపాణికి విశ్వం తనకథ వివరిస్తూంటే అక్కడున్న అందరూ వింటున్నారు. వింటున్న అందరి ముఖాల్లోనూ కుతూహలం వుంటే ఒక్క అరుణముఖంలో మాత్రం అంతులేనిబాధ వుంది.

"నేను చిన్నప్పుడు ఇల్లు వదిలిపెట్టగానే చేతులుమారి ఆఖరికి అనసూయమ్మ యింటపడ్డాను. అనసూయమ్మనన్ను చాలా బాగా చూసుకొంది. పియ్యూసీదాకా చదివించింది కూడా. అయితే అనసూయమ్మ నిజస్వరూపం నాకు చాలా ఆలస్యంగా తెలిసింది. అందరికీ తెలిసిన ప్రకారం ఆమె అందరిలాంటిదే! డబ్బున్న ఆడది. ఐతే ఆమెకు డబ్బు ఎక్కణ్నించి వస్తోంది?

"నాకులాంటి అనాథబాలుర్ని ఆమె చాలామందిని చేరదీసింది. మమ్మల్ని ఆకర్షణీయంగా తయారు చేస్తుంది. అడిగినంత డబ్బు ఇస్తుంది. జల్సాగా గడపమని ప్రోత్సహిస్తుంది. తనే స్వయంగా తాగుడుకూడా అలవాటు చేసింది. మా అందరికీ స్కూటర్లు కొనిపెట్టింది. మేము చేయవలసిన పనల్లా అందమైన ఆడవాళ్ళని వలలో వేసుకోవడం. అలా మా వలలోపడిన పతితులయిన ఆడవాళ్ళ జీవితాలతో ఆటలాడుకోవడం ఆవిడ జీవనాధారం. కొంతమందిని వేశ్యావృత్తిలోకి దింపుతుంది. కొంతమందిని స్మగ్లింగ్ వ్యవహారాల కుపయోగించుకుంటుంది. బాగా డబ్బున్న వాళ్ళనయితే బ్లాక్ మెయిల్ చేస్తుంది.

ఈ జీవితం నాకు నచ్చలేదు. సుమారు సంవత్సరం క్రితం నేను నా అసంతృప్తిని వ్యక్తపరచి ఆమెబారినుండి బయటపడదామనుకున్నాను. మొదట్లో వయసుపొంగులో తాగడమూ, వ్యభిచరించడమూ సరదాగానే అనిపించి

వప్పటికీ—నామూలంగా ఎందరో ఆడపిల్లల కన్నీళ్ళు కాలవలై ప్రవహిస్తున్నాయని గ్రహించాక అనసూయమ్మను వదిలిపెట్టి పోవాలనుకున్నాను. నేను నా నిర్ణయం చెప్పగానే ఆమె కంగారుపడి కారణం అడిగింది. వెళ్ళిపోయి ఏం చేస్తావంది?

నేను మామయ్యగురించి చెప్పాను. ఆడపిల్లల శీలాలతో ఆడుకోవడం ఇష్టంలేదనీ నా మరదల్ని పెళ్ళిచేసుకొని పవిత్రజీవితం గడపాలనుకొంటున్నాననీ చెప్పాను. ఆమె నా ఆలోచనను మెచ్చుకొని పవిత్రజీవితం తనవద్ద వుంటూకూడా గడపవచ్చునని చెప్పింది. "నువ్విలాగా నేరస్తుడివే. ఇప్పటికి ఒకటి రెండుసార్లు చిల్లర దొంగతనాల్లో జైలుకు వెళ్ళావు. అందువల్ల నీ కెక్కడా ఉద్యోగం దొరకదు. స్మగ్లింగ్ వ్యవహారాల్లో నాకు చేదోడు వాదోడుగావుండు చాలు" అంది.

అనసూయమ్మకు ఒక ముఠావుంది. ఆ ముఠాలో నేనూ ఒకణ్ని. అయిదారు పర్యాయాలు నేను దొంగతనాలకు వెళ్ళాను. రెండుసార్లు దొరికిపోయి కొద్దినెలలు జైల్లో వుండివచ్చాను. అందువల్ల అనసూయమ్మ మాటవిని స్మగ్లింగ్ వ్యవహారాలకు నా కార్యకలాపాలు పరిమితము చేసుకోవాలనుకొన్నాను.

ఐతే అనసూయమ్మ నా మరదలిఫోటో చూసింది. కన్ను చెదిరిపోయింది. అలాంటి పిల్లుంటే లక్షలకులక్షలు సంపాదించవచ్చుననుకుంది. పెళ్ళిపేరు చెప్పి మాయమాటలు చెప్పి ఆడుగును తీసుకువచ్చి తనకు అప్పగించమంది. అందుకు నేను ఇష్టపడకపోతే తాత్కాలికంగా నవ్వి ఊరుకుంది.

"ఆ తర్వాత వారంరోజుల్లో అనసూయమ్మ ముఠాతోపాటు నేనూ ఒక వ్యవహారంలో పాల్గొన్నాను. అప్పుడు

ఒక హత్యజరిగింది. ముతాలోనిమనిషి అక్కడిదృశ్యాన్ని ఫోటో తీశాడు. తనదగ్గర నేనున్న ఫోటో ఒకటిబాగా ఎన్లార్జి చేయించి అనసూయమ్మ తర్వాత నాకు చూపించింది.

ఆ హత్యకేసు పరిశోధనలో వున్నదని నాకు తెలుసు. ఈవిధంగా హత్యకేసులో ఇరికించబడతానని మాత్రం నాకు తెలియదు. నన్ను హంతకుణ్ని చేస్తానని బెదిరించి అనసూయమ్మ అరుణ విషయంలో నన్ను ఒప్పించింది. ఐతే ఆ ఆలోచనే నాకు భయంకరంగా తోచింది. ఐనా తప్పదు. లేకపోతే నేను ఉరికంబం ఎక్కాల్సి వస్తుంది.

బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను. నాకు జైలు కొత్తకాదు. తాత్కాలికంగా అరుణను రక్షించడం కోసం పోలీసులకు దొరికిపోయే విధంగా నేరం చేయాలనుకొన్నాను. ఫలితంగా ఒక మైనారిటీ తీరని అమ్మాయిని ఎత్తుకుపోయే ప్రయత్నంచేసి పోలీసులకు దొరికిపోయాను. ఆరువారాలు జైలుశిక్ష విధించారు. ఇంకా ఎక్కువ పడాల్సిందేకానీ అనసూయమ్మ చాలా సాక్ష్యాలను సమయానికి దొరక్కుండా చేసింది. పోలీస్ సర్కిల్స్ లోకూడా ఆమెకు చెప్పుకోదగ్గ పలుకుబడివుంది.

జైల్లోంచి బయటపడ్డాక నాకింక తప్పలేదు. అనసూయమ్మ తొందరపెట్టి నన్ను పంపించింది. మనసు ఎంతో ఎదురు తిరుగుతున్నప్పటికీ, స్వార్థంకోసం మరదల్ని బలిపెట్టక తప్పదని ఇలావచ్చేసాను. నా నేరం బయట పడినందుకు నాకు బాధగాలేదు. ఏదో ఒకరోజు నేను హంతకుడిగా న్యాయస్థానంముందు నిలబడకతప్పదు. అది ఈరోజు కా సమముందుగా జరుగుతోంది. ఇదీనాకథ. మీరు నన్ను మన్నించినా సరే, మన్నించక పోయినా సరే జరగవలసిన అపరాధం జరక్కుండా ఆగింది.''

విశ్వంకథ విని చక్రపాణి పళ్ళు పటపటా కొరికాడు.

"ఒరేయ్ ఏడో ఏట పారిపోయి మళ్ళీ యిప్పుడు తిరిగి వచ్చిందిందు కట్రా. అల్లారుముద్దుగా పెంచుకుంటూ వస్తున్న నా బంగారు తల్లిని, నా ఇంటిదీపాన్ని బోగం కొంపలకి అప్పగించడానికి పనిగట్టుకొని వస్తావుట్రా— నేను క్షమించినా నిన్ను దేవుడు క్షమిస్తాడుట్రా—"

చక్రపాణి భార్యకూడా విశ్వాన్ని నానా మాటలు అంది.

"అమ్మా! ఎందుకే బావను ఆడిపోసుకుంటారు. దారి తెలియని వయసులో దారితప్పాడు. ఇది దారికివచ్చే వయసుకాదు. అయినా తనతప్పు తెలుసుకొన్నాడు. నా కోసం తను పనిగట్టుకుని జైలుకు వెళ్ళాడు. ఇప్పుడు తను చెబితే తప్ప తెలియని రహస్యాలు మనకు చెప్పి మనచేత నిందా వాక్యాలు విని సహిస్తున్నాడు. అంతటితో అయిందా, అందుగురించి ఇప్పుడు జైలుకు వెడతాడు. ఏంచేయాలో ఆలోచించకుండా వూరికే బావను తిడతారేం?" అంది అరుణ.

నేను ఆశ్చర్యపడ్డాను. నేనొక్కడినేకాదు. ఆమె మాటలకు అక్కడున్న అందరూ విశ్వంతోసహా ఆశ్చర్య పడ్డటున్నారు.

"క్షమించు అరుణా! నీ సానుభూతికి నేను తగను. నిన్ను మోసం చేద్దామనే ఇక్కడకు వచ్చాను. కానీ నిండుమనసుతో నువ్వు నన్ను ప్రేమిస్తూంటే దానిలో కరిగిపోయాను నేను. నాకు నేనుగా యింక మిగలలేదు. నీకు అన్యాయం చేయలేను. అది నా గొప్పతనం కాదు. నీ ప్రేమ గొప్పతనం" అన్నాడు విశ్వం.

"అతను చెబుతున్నది నిజమే. అరుణ ప్రేమ నన్ను కూడా మార్చింది" అన్నాను నేను.

అరుణ ప్రేమ నాకు ఆశ్చర్యంగా కూడా వుంది. రూపంతో నిమిత్తం లేకుండా ఆమె బావ అనే వ్యక్తిని ప్రేమించింది. ఆ బావను నేననుకొని నాతో ప్రేమగా మసిలి నన్ను మార్చింది. ఆ తర్వాత నకిలీవిశ్వం వస్తే వాణ్ని ప్రేమించింది. వాడు అందవికారంగా వున్నాడని బాధ పడలేదు. ఇప్పుడు విశ్వాన్ని ప్రేమిస్తోంది. అతడు హంతకుడనీ, తనను మోసంచేయడానికి వచ్చినాడనీ తెలిసి కూడా అతను చేసిన తప్పులన్నీ క్షమించ గలుగుతోంది. ఇది చాలా చిత్రమయిన ప్రేమ! నేను ఆమెకు బావగా పుట్టివుండినా ఎంతో బాగుండేది!

తర్వాత పెద్దవిశేషాలేమీ లేవు. విశ్వం పోలీసులకు లొంగిపోయి తన కథంతా చెప్పుకొన్నాడు. అతని కథంతా విన్నాక పోలీసులుఅనసూయమ్మపై దాడిచేశారు.

ఆవిడ ముఠాలు మొత్తం మూడున్నాయి. అన్నీ పట్టుబడ్డాయి. ఆమె ఆధ్వర్యంలోవున్న అయిదువందల యువతులకు మోక్షం లభించింది. ఆ ఐదువందల యువతుల కన్నీటిగాథలు పేపర్లలో ప్రత్యేక విశేషాలుగా వచ్చాయి. చరిత్ర కనీవినీ ఎరుగని స్త్రీ దోషిగా అనసూయమ్మను చాలా పత్రికలు అభివర్ణించాయి.

తను ఏ కారణంగా జైలుకు వెళ్ళాల్సి వచ్చిందో గుర్తించిన అనసూయమ్మ వూరుకోలేదు. ఆవిడ విశ్వం మీద బాగనే పగతీర్చుకుంది. ఆవిడతోపాటు విశ్వంపై కూడా తలమోయలేనన్ని నేరాలు మోపబడ్డాయి. ఆ నేరాల్లో చాలావాటికి ఋజువులున్నాయి. ఎందరో కన్నెపిల్లలకు విశ్వం అన్యాయంచేసిన మాట నిజం. అనసూయమ్మ ప్రోత్సాహంవల్ల జరిగినప్పటికీ నేరాలు చేసిన విశ్వానికి పూర్తిబాధ్యత లేకుండాపోదు.

పత్రికల్లో అనసూయమ్మ మృతి గురించిన వివరాలు ప్రచురించబడ్డప్పుడు విశ్వం ఫోటోలు కూడా పడ్డాయి. ఆడపిల్లలపాలిటి శాపంగా అతడు అభివర్ణించబడ్డాడు.

విశ్వానికి ఇరవై ఏళ్ళు కారాగారవాసం విధించబడింది. అరుణ కన్నీళ్ళతో అతనికి వీడ్కోలు చెబితే—"నాకోసం నీకన్నీళ్ళు వృథా చేయకు..." అన్నాడతను.

నేను చక్రపాణిని వివాహం విషయం అడిగాను' ఆయన సుముఖంగానే ఉన్నాడు కానీ అరుణ ఒప్పుకో లేదు.

"అదేమిటి? ఆజన్మాంతరం కన్యగా వుండిపోతావా?" అన్నాను.

"బావను పెళ్ళిచేసుకోవాలనుకుంటే బోలెడుమంది బావలు అయ్యారు. అందుకని బావకానివాణ్ణి పెళ్ళిచేసుకుందామనుకుంటున్నాను. బావలు నాకు అచ్చిరాలేదు" అంది అరుణ.

"నీకోసం నేనెంతో కష్టపడి నిన్ను దుర్మార్గుడి బారినుండీ, ఘోరావమానాలబారినుండీ రక్షించాను నా ప్రేమకు ఇంతకంటె ఋజువేంకావాలి?" అన్నాను..

"నీ ప్రేమకు ఋజువు అక్కర్లేదు. కానీ నా ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తున్న బావ-దుర్మార్గుడే కావచ్చు. కానీ అతడి దుర్మార్గాన్ని బయటపెట్టి ప్రపంచమంతా అతన్ని అసహ్యించుకునేలా చేశావు. అతన్ని జైలు పాలు చేశావు. బావకు నీవల్ల కలిగిన అపఖ్యాతికీ, కారాగారవాసానికీ ఈ జన్మకు నిన్ను క్షమించలేను" అంది అరుణ.

# 48

ఏమనాలో నాకు తెలియలేదు. ఆమెను రక్షించాను. ఓ దుర్మార్గుడికి శిక్షపడేలా చేశాను. అందుకే అరుణ నన్ను అసహ్యించుకుంటే ఏమనాలి?

నా మనసులోని ఆలోచన అరుణ పసిగట్టినట్లుంది "నీకూ బావకూ చాలా తేడావుంది. నామీద అభిమానంతో నువ్వు మరో వ్యక్తికి అన్యాయం చేశావు. నామీద అభిమానంలో బావ తనకు తనే అన్యాయం చేసుకున్నాడు..." అంది.

ఆమె తర్కంలో లోపమున్నదని నాకు తెలుసు. చక్రపాణిగారిని లోబరచుకుని ఎప్పటికైనా అరుణను నాదాన్ని చేసుకోవాలి. ఎటొచ్చీ ఇన్ని ప్రయత్నాల తర్వాతకూడా నేనింకా ఆరంభంలోనే వుండడం నాకు బాధగా వుంది.

—:ఐపోయింది:—

# ప్రాణానికి ప్రాణం!

టెంపోరావ్

స్పెషల్ బ్రాంచి డైరక్టర్ విశ్వనాథ్ ఎదురుగా కూర్చున్న మనిషివైపు చూశాడు.

"మిస్టర్ బులెట్, ఇది చదవండి!" అన్నాడు విశ్వనాథ్.

అతడిచ్చిన పత్రాన్ని బులెట్ సీరియస్‌గా చదివాడు.

ఇద్దరు ఇండియన్ గూఢచారులు రగడాలో హత్య చేయబడ్డారు. పత్రాన్ని విశ్వనాథ్ వైపు తోసి బులెట్ అతనివంక వినయంగా చూశాడు.

"మిస్టర్ బులెట్! రగడా పెద్దదేశం కాదు. దాని ముఖ్యపట్నం రినోసిటీ. అన్నిదేశాల గూఢచారులూ ఆ పట్నంలో తిరుగుతూవుంటారు. అనేక రహస్య విషయాలు కనుక్కొని కోడ్‌లో వాళ్ళదేశాలకు అందజేస్తూ వుంటారు. మా గూఢచారులు మరో యిద్దరుమాత్రం అక్కడున్నారు. వాళ్ళనికూడా చంపుతారని నాకు భయంగా వుంది!"

విశ్వనాథ్ ఆగాడు. కేసులోంచి సిగరెట్ తీసి, బులెట్ కో సిగరెట్ యిచ్చి అతడు లైటర్ వెలిగించాడు. ఇద్దరూ సిగరెట్లు వెలిగించుకున్నారు.

"మిస్టర్ బులెట్, మీరు రినో పట్నానికి వెళ్ళాలి. అక్కడున్న మా గూఢచారుల్ని కల్సుకుని, వాళ్ళకు సహాయపడాలి."

"ఆల్ రైట్, వెళ్తాను," అన్నాడు బులెట్.

"మా తరఫున పనిచేసినంతకాలం మీరు BE 15 అనే కోడ్ నేమ్‌ను వాడండి. మీగురించి అక్కడున్న మా గూఢచారులకు మేం సందేశం పంపిస్తాం," అన్నాడు విశ్వనాథ్.

"గుడ్," అన్నాడు బులెట్.

విశ్వనాథ్, డ్రాయర్ సొరుగు లాగి రెండు ఫోటోలను తీసి అతడికిచ్చాడు.

"వాళ్ళ పేర్లు వెనక రాయబడ్డాయి. వాళ్ళుండే అడ్రసులు ఫోటో వెనక యిచ్చాం. ప్రస్తుత పరిస్థితుల్లో వాళ్ళు అక్కడ వుండకపోవచ్చు!"

"రినోసిటీలో ఎక్కడో అక్కడ వాళ్ళు నాకు కనిపిస్తారు. డోంట్ బాదర్," అన్నాడు బులెట్.

విశ్వనాథ్, అతడివంక సూటిగా చూశాడు.

"మిస్టర్ బులెట్, మీకు ప్లేన్ టికెట్ మరో రెండు గంటల్లో పంపుతాము. రినోలో హోటల్ హిమాలయాలో దిగండి. దాని ప్రొప్రయిటర్ రషీద్. మీకు ఎంత డబ్బు కావల్సినా అతడు యిస్తాడు. అతడికి నేను మీగురించి వార్త పంపుతాను," అన్నాడతను.

విశ్వనాథ్, బులెట్ కుర్చీల్లోంచి లేచి నిలబడ్డారు. బులెట్‌తో, నవ్వుతూ, అతడు కరచాలనం చేశాడు.

"మిస్టర్ బులెట్, ఐ విష్ యు గుడ్ లక్!" అన్నాడు విశ్వనాథ్.

బులెట్ వుషారుగా బయటకు వెళ్ళిపోయాడు. విశ్వనాథ్ కుర్చీలో కూర్చొని బజ్జరు నొక్కాడు.

"సెక్రటరీని వెంటనే రమ్మను," అన్నాడతను గదిలోకొచ్చిన నౌఖరుతో.

## 2

రినోలో హోటల్ హిమాలయాకు చాలా మంచి పేరుంది. విదేశీయులు ఆ హోటల్లో బసచేస్తూ వుంటారు.

రిసెప్షన్ యువతితో మాట్లాడి బులెట్ మొదటి అంతస్తులోవున్న గది తీసుకున్నాడు. ఆమె తెరిచి ముందుకు తోసిన పుస్తకంలో 'వి. రాజ్ మోహన్' అని రాసి, వ్యాపారంమీద తను రగడా దేశానికి వచ్చినట్లు చిత్రించాడతను.

ఆమె యిచ్చిన తాళంచెవి తీసుకుని అతడు ఏర్ బాగ్‌తో లిఫ్ట్‌వైపు వెళ్ళాడు. లిఫ్ట్ పైకి వెళ్తూండగా ఒక వ్యక్తి అతడివైపే చూడ్డం బులెట్ గమనించాడు.

ఆ వ్యక్తి, నల్ల పాంట్, స్లాక్‌లో వున్నాడు.

బులెట్ తన గదిలోకెళ్ళి తలుపు మూశాడు. కిటికీ కర్టెనను పక్కకు జరిపి కిందకు చూశాడు. హోటల్ ముందుభాగం, ఎదురుగావున్న తారురోడ్డు అతడికి కనిపిస్తున్నాయి.

గదిలోకి బాగా వెలుగొస్తోంది. అతడు గది నలువైపులా చూశాడు-పక్కనే యటాచ్‌డ్ బాత్‌రూమ్ వుంది. గదిలో ఒకవైపున బెడ్, మరోవైపున మూడు సోఫాలున్నాయి. సోఫాలమధ్యన గుండ్రటి టీపాయి వుంది. గోడవారగా స్టీల్ బీరువా వుంది.

బులెట్ బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. గోడకు చిన్న అద్దం, దాని ముందు వాషింగ్ బేసిన్, షవర్, కమోడ్ వగైరా వున్నాయి. అతడు ముందు గదిలోకి తిరి గొచ్చాడు. సోఫాలో కూర్చుని కింగ్ సైజ్ స్టేట్ ఎక్స్‌ప్రెస్ సిగరెట్ వెలిగించాడు.

ఏదో చప్పుడైంది. అతడు గుమ్మంవైపు చూశాడు. ఎవరో తలుపును మెల్లిగా తట్టారు.

బులెట్ వెళ్ళి తలుపు తెరిచి ఎదురుగా నిలబడిన వ్యక్తివైపు చూశాడు. లిఫ్ట్‌లో పైకి వస్తూంటే తనవైపు చూసిన వ్యక్తి అతడే!

ఎదురుగా వున్నతని పెదిమః మీద చిరునవ్వు నృత్యం చేస్తోంది. అతడు కళ్ళజోడు ధరించాడు. జుత్తు తెల్ల బడింది కాని అతడు బలంగానే అగుపిస్తున్నాడు.

"నా పేరు రషీద్. నేను హోటల్ ప్రొప్రయిటర్ని. మీతో పరిచయం చేసుకోడానికి వచ్చాను" అన్నా డతను.

"కమిన్!" అన్నాడు బులెట్.

తలుపు దగ్గరగా మూసివుంది. రషీద్ అతడి ఎదురుగా కూర్చున్నాడు. క్షణకాలం అతడు మాట్లాడకుండా బులెట్ వైపు చూశాడు.

"మిస్టర్ బులెట్, విశ్వనాథ్ మీగురించి నాతో మాట్లాడారు. మీకేం కావలసినా నేను సప్లయిచేస్తాను" అన్నాడతను.

బులెట్ నవ్వుతూ అతనివంక చూశాడు.

"ఒక అరడజన్ స్కాచ్ విస్కీ షీవాస్ రీగల్ బాటిల్సు పంపండి. కూల్ బాక్స్‌లో కొన్ని సోడా బుడ్లు" అన్నాడు బులెట్.

"వెంటనే పంపిస్తాను."

"నాకు ఐదువేల డయాల్స్ కాష్ కావాలి."

"ఇస్తాను."

"నాకొక కారు కావాలి."

"కొత్త ప్లిమత్ కారు మీకు సప్లయి చేస్తాను."

బులెట్ అతడివైపు సూటిగా చూశాడు.

"మన గూఢచారులు BN 21, BN 51 మీకు కనిపించారా?"

"మీ కోడ్ నేమ్ ప్లీజ్?" అన్నాడతను.

"BE 15" అన్నాడు బులెట్ గన్ పాట్టులా.

"వాళ్ళు నన్ను కల్సుకుని వారం దాటింది. ఇద్దరికీ చాలా డబ్బు ఇచ్చాను. అది ఖర్చయిపోతేగాని వాళ్ళు యిక్కడకు రారు!"

"వాళ్ళు ఎక్కడున్నారో మీకు తెలియదా!"

"తెలియదు"

"BN 10 హరిసింగ్, BN 40 దత్తూరామ్ గూఢచారులు ఎలా హత్యచేయబడ్డారు?"

"BN 10 శవం పోలీసులకు సీమ్ నది ఒడ్డున దొరికింది. అప్పటికే అతడు మరణించి మూడు రోజులు అయివుండాలని పేపర్లలో చదివాను. BN 40 శవం రోడ్డువారగా పోలీసులకు దొరికింది. రాత్రి ఎప్పుడో అతడిని కత్తితో పొడిచి చంపారు" అన్నాడు రషీద్.

"వాళ్ళని ఎవరు చంపివుంటారు?"

"పిండారిస్తాన్ గూఢచారులై వుండాలి. భారతదేశానికి వాళ్ళు గర్భశత్రువులు!" అన్నాడు రషీద్.

"ఇక్కడ పిండారిస్తాన్ గూఢచారాలు ఎక్కువగా వున్నారా?"

"కొన్ని వందలమంది వున్నారు. ఈ దేశం సరిహద్దు దాటితే వాళ్ళ దేశం వస్తుంది. అనేక వస్తువులకు యీ

దేశం పిండారిస్తాన్ మీద ఆధరపడాలి. అందువలన యీ దేశ ప్రభుత్వం పిండారిస్తాన్‌తో ఎప్పుడూ పోట్లాటకు దిగదు. పిండారిస్తాన్ వాళ్ళకు యిక్కడ పలుకుబడి ఎక్కువ'' అన్నాడతను.

బులెట్ నవ్వుతూ రషీద్ వైపు చూశాడు.

"మిస్టర్ రషీద్, మీరిక్కడ ఎంతకాలం నుంచి వుంటున్నారు?''

"నేను భారత దేశస్తుడిని. నేనిక్కడి కొచ్చి ఇరవై ఏళ్ళు దాటింది. రగడా సిటిజన్ అయ్యాను. నేనిక్కడున్నా నా మాతృభూమి భారతదేశమే!''

అతడి మాటలు విని బులెట్ లోలోపల చాలా సంతోషించాడు. అతడికి బైబై చెప్పి రషీద్ బయటకు వెళ్ళిపోయాడు.

కాస్సేపట్లో విస్కీ బాటిల్సు, గ్లాసులు, కూల్ బాక్స్‌లో సోడాబుడ్లు వచ్చాయి. యూనిఫామ్‌లో వున్న హోటల్ బాయ్ వాటిని ఒక టేబుల్ మీద పెట్టాడు.

"ఒక బాటిల్, రెండు సోడాబుడ్లు, ఒక గ్లాసు యిక్కడ పెట్టు'' అన్నాడు బులెట్.

అతడు చెప్పినట్లు చేసి హోటల్ బాయ్ వెళ్ళి పోయాడు.

విస్కీ బాటిల్ తెరిచి కొంచెం గ్లాసులో పోసి అతడు సోడా కలిపాడు. విస్కీ తాగుతూ విశ్వనాథ్ యిచ్చిన ఫోటోలను చూసి, వెనకనున్న అడ్రసులను అతను గుర్తుంచుకున్నాడు.

ఎవరో తలుపును తట్టారు.

"కమిన్!'' అన్నాడతను.

సన్నగా, పొడుగ్గా వున్న ఒకతను గదిలోకొచ్చి ఓ కవర్ను అతడికిచ్చాడు. కారు ఇగ్నిషన్ కీ ఇచ్చాడు.

"మిస్టర్ రషీద్ మీ కిమ్మన్నారు" అన్నాడతను.

"ఆయనకు నా థాంక్స్ చెప్పు" అన్నాడు బులెట్.

అతడు వెళ్ళాక బులెట్ మరో మూడు పెగ్గులు విస్కీ సేవించి టైమ్ చూశాడు. ఐదు కావస్తోంది!

ఏర్‌పోర్ట్‌లో దిగ్గానే బులెట్ తన వాచ్‌ని దిద్ది, సరిగ్గా టైమ్ పెట్టుకున్నాడు.

అతడు బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. తిరిగొచ్చి దుస్తులు మార్చుకున్నాడు. గదిలోంచి బయటకు నడిచి, తలుపు మూసి తాళంవేశాడు. లిఫ్ట్‌లో కిందకు చేరుకున్నాడు.

ముందు హాల్లో రషీద్ అతడికి అగుపించాడు.

"మిస్టర్ రాజ్ మోహన్, మీకిక్కడ సౌకర్యంగా వుందిగా?" అనడిగాడతను.

"ఫైన్" అన్నాడు బులెట్ నవ్వుతూ.

## 3

హోటల్ ముందు నల్లటి ప్లిమత్ కారుంది. తాళంతీసి అతడు స్టీరింగ్ వెనక కూర్చున్నాడు. తలుపు మూశాడు. క్షణకాలం కారును పరీక్షించాడు. టాంక్ నిండా పెట్రోలుంది.

తన కోటు జేబులో వున్న రినో పట్నం మాప్‌ను తెరిచి చూస్తూ కూర్చున్నాడు. BN 21 వుండే యిల్లు ఏ రోడ్డు మీదుందో కనుక్కున్నాడతను. మాస్కాట్ రోడ్డు నంబరు 10, రూమ్ నంబరు 50.

బులెట్ కారును పోనిచ్చాడు. సూర్యుడు పడమర దిక్కున దిగుతున్నాడు. ఇంకా బాగా వెలుతురు వుంది. అనేక రోడ్లు తిరిగి అతడు మాస్కాట్ రోడ్డుకు చేరుకున్నాడు.

నంబర్ 10 ఎనిమిది అంతస్తుల భవనం. BN 21 ఆరో అంతస్తులో వుండాలి! రోడ్డువారగా కారును ఆపి

అతను దిగాడు.

ముందుగదిలోకి వెళ్ళాడు. వాచ్‌మన్ అతడివంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"రూమ్ నంబర్ 50," అన్నాడతను.

"ఆయన గదిలో లేరు. ఎక్కడికో వెళ్ళి చాలా రోజు లయింది," అన్నాడు వాచ్‌మన్.

"ఒకసారి అతడి గదికెళ్ళి చూస్తాను!"

"మీ యిష్టం" అని వాచ్‌మన్ భుజాలను యెగ రేశాడు.

లిఫ్ట్‌లో బుల్లెట్ ఆరో అంతస్థుకు చేరుకొన్నాడు. నడవమ్మట నడిచి 50 నంబరు గదిముందు నిలబడ్డాడు. 50 నెంబర్‌కి యిటూ అటూ చాలా గదులున్నాయి, కాని నడవలో ఎవ్వరూ లేరు.

చటుక్కున 51 నంబరుగది తలుపు తెరవబడింది. ఒక యువతి బయటకొచ్చి అతడివంక చూసింది.

"శ్యామ్ వచ్చాడేమో ననుకున్నాను!" అందామె.

నిరుత్సాహంగా ఆమె వెనక్కు తిరిగింది.

"శ్యామ్ నీకు బాగా తెలుసా?" ప్రశ్నించాడు బులెట్.

"మేం స్నేహితులం" అందామె.

బులెట్ నవ్వుతూ ఆమెకేసి చూశాడు.

"అతడిని చూడ్డానికి ఇండియానుంచి వచ్చాను. అతను ఎక్కడికెళ్ళాడో తెలుసా?"

"అతడు గదికొచ్చి పదిరోజులు దాటింది. ఎక్కడెక్కడో తిరుగుతున్నాడు!" అందామె.

"నువ్వు ఏం చేస్తున్నావు?"

"ఒక కంపెనీలో టెలిఫోన్ ఆపరేటర్‌గా వుంటున్నాను," అందామె.

"నిన్ను కలుసుకున్నందుకు చాలా సంతోషం. ఇవాళ రాత్రి నాతో డిన్నర్‌కి వస్తే ఆనందిస్తాను."

"ఎక్కడ?"

"నీకు నచ్చిన హోటల్లో!"

"ఆల్ రైట్ వస్తాను," అందామె.

బులెట్ సిగరెట్టు పాకెట్టు తెరిచి ఆమెకు సిగరెట్టు ఇవ్వబోయాడు.

"నేను కాల్చను," అందామె.

అతడు సిగరెట్టు వెలిగించాడు. పొగవదుల్తూ ఆమె వైపు చూశాడు.

"సరిగ్గా ఎనిమిదింటికి యిక్కడికొస్తాను. ఇద్దరం కలిసి వెళ్దాం," అన్నాడతను.

"అలాగే."

"నీ పేరు?"

"మిస్ లూసీ."

"నా పేరు రాజ్ మోహన్," అన్నాడతను.

అతడు లిఫ్ట్‌లో కిందికి దిగాడు. వాచ్‌మన్ యెవరితోనో మాట్లాడుతున్నాడు. బులెట్ తన ప్లిమత్ కార్లో కూర్చుని తలుపు మూశాడు.

వాచ్‌మన్‌తో మాట్లాడుతున్నతను తనని గమనించడం బులెట్ గుర్తించలేదు. ప్లిమత్ కారు కదిలింది.

వాచ్‌మన్‌తో వున్నతను సమీపంలోవున్న ఫోన్ దగ్గరకు వెళ్ళి రిసీవర్ని ఎత్తి ఒకనంబర్ తిప్పాడు.

"హాలో బాస్, అతడెవరో శ్యామ్‌కోసం వచ్చాడు. పొడుగ్గా బలంగావున్నాడు. R 2001 ప్లిమత్ కారులో వెళుతున్నాడు," అన్నాడతను.

"ఆల్ రైట్! అతడి విషయం మేం దర్యాప్తు చేస్తాం" అందొక అధికార కంఠం అటువైపునుంచి.

"ఎస్ బాస్," అని అతను రిసీవర్ని పెట్టేశాడు.

## 4

BN 51 పేయింగ్ గెస్టుగా ఒక కుటుంబంలో వుంటున్నాడు. అక్కడికి ప్లిమత్ కారును పోనిచ్చాడు బులెట్. పాతకాలపు యింటిముందు కారు ఆగింది. ఎడంవైపునున్న ఫ్లాట్ 12వ గుమ్మంముందు నిలబడి బులెట్ ఎలక్ట్రిక్ బెల్ నొక్కాడు.

గౌను ధరించిన ఒక ముసలామె తలుపు తెరిచి అతనివేపు చూసింది.

"మిస్టర్ రాజన్!" అన్నాడతను.

"రాజన్ మా యింట్లో వుండడంలేదు. ఖాళీచేసి వెళ్ళిపోయాడు." అందామె చిరాగ్గా.

"ఎందువలన?"

"అతడికోసం ఎవరెవరో వస్తూంటారు. మాకది నచ్చలేదు. మేమే ఖాళీ చెయ్యమన్నాం."

"రాజన్ ఎక్కడికెళ్ళాడు?"

"అదంతా నాకు తెలియదు. అతడు నాతో చెప్పలేదు!" అందామె.

"మమ్మీ!" అని పిలుస్తూ ఒక యువతి అక్కడికి కొచ్చింది.

ఆమెకేసి బులెట్ చూశాడు. పదెనిమిదేళ్ళ పిల్ల. చాలా అందంగావుంది. పాంటు, స్పోర్ట్సు బనియన్ ధరించింది.

ముసలామె తలుపు మూసేసింది. బులెట్ వెనుదిరిగి కారులో కూర్చుని సిగరెట్టు వెలిగించాడు. పొగవదుల్తూ ఆలోచించసాగాడు.

రాజన్ అతడికి బాగా తెలుసు. ఆడపిల్లలంటే రాజన్‌కి పిచ్చి! ఆ యింట్లో పేయింగ్ గెస్టుగావుంటూ

ఆ యువతితో సంబంధం లేకుండా రాజన్ వుండడం వూహాతీతం. ఆ యిల్లు వదిలేసినా రాజన్ ఆ యువతిని కలుసుకొంటూనే వుండొచ్చు.

తలుపుమూసి అతడు కారును పోనిచ్చాడు. చటుక్కున అతడికాలు బ్రేక్ మీద పడింది. ఆ యువతి వెనకనే రోడ్డమ్మట నడచివస్తోంది.

రోడ్డువారగా అతడు కారును ఆపి, కూర్చున్నాడు. పక్కనుంచి ఆమె వెళ్తోంది.

"మిస్!" అన్నాడతను.

కారు కిటికీలోంచి ఆమె లోపలకు చూసింది.

"హలో!" అందామె.

"యూ లవ్లీ!" అన్నాడతను.

సిగ్గుపడ్తూ ఆమె నిలబడింది.

"ఎక్కడికెళ్ళాలి?"

"సినిమాకి! బ్రాడ్వే థియేటర్ కి" అందామె.

"నేను అటే వెళ్తున్నాను. అక్కడ దింపేస్తాను," అన్నాడు బులెట్.

"థాంక్స్," అని ఆమె ముందుసీటుమీద కూర్చుని తలుపు మూసింది.

బులెట్ కారును పోనిచ్చాడు. పక్కనకూర్చున్నామె కేసి ఓరగా చూశాడు.

"నా పేరు రాజ్ మోహన్," అన్నాడతను.

"నా పేరు మిస్ రీటా," అందామె.

సిగరెట్టు పొగపీల్చి అతడు వదుల్తున్నాడు. చీకటి పడింది. రోడ్డుదీపాలు వెల్గుతున్నాయి.

"మిస్టర్ రాజ్ మోహన్! నేను సినిమాకు వెళ్ళాలనే వుద్దేశంతో బయటకు రాలేదు. రాజన్ని గురించి మమ్మల్ని మీరు అడగడం నేను విన్నాను. తనకోసం మీలాంటి

వ్యక్తి రావచ్చని రాజన్ నాతో చెప్పాడు. మీతో మాట్లాడ్డానికి వచ్చాను,'' అందామె.

''రాజన్ ఎక్కడున్నాడో తెలుసా?''

ఆమె వెంటనే జవాబివ్వలేదు. అతడివైపు చూసింది. ''రాజన్ కోడ్ నేమ్ ఏమిటో మీకు తెలుసా?''

''BN 51,'' అన్నాడతను.

''యూ ఆర్ రైట్. రాజన్ దగ్గరకు మిమ్మల్ని తీసుకెళ్తాను'' అందామె.

''ఐయామ్ లక్కీ!'' అన్నాడతను.

వెనకనే నల్లటి ఆస్టిన్ కారు వస్తోంది. రియర్ వ్యూ అద్దంలో ఆ కారు స్పష్టంగా కన్పిస్తోంది. కారులో డ్రయివర్ మాత్రం వున్నాడు. ఆ కారులోని మనిషి తనని వెంటాడుతున్నాడా?

తన కారును కుడివైపుకు తిప్పాడు బులెట్. వెనుక కారు తిన్నగా వెళ్ళిపోయింది. బులెట్ తనలో తను నవ్వుకొన్నాడు. ఆ రోడ్డమ్మట వెళ్ళి ప్లిమత్ కారు మెయిన్ రోడ్డుకు చేరుకొంది.

''రాజన్ మీ ఇంట్లోంచి ఎందుకు వెళ్ళిపోయాడు?'' అడిగాడతను.

''అమ్మకి అనుమానం ఎక్కువ. రాజన్ నాతో ఎక్కువగా మాట్లాడుతూ కూర్చునేవాడు. అందువలన అతడిని వెళ్ళిపొమ్మంది.''

''మనం ఎక్కడికి వెళ్ళాలి?''

''హోటల్ లియోకి వెళ్ళాలి.''

ఐదు నిమిషాల్లో హోటల్ లియో కాంపౌండులో అతడు కారుని ఆపి, దిగాడు. కొంచెం దూరంలో ఆస్టిన్ కారు ఆగివుంది! స్టీరింగ్ వెనక కూర్చున్న డ్రయివర్ వంక బులెట్ సూటిగా చూశాడు.

"కమాన్," అంది మిస్ రీటా.

ఆమెతో అతడు ముందుహాల్లోకి వెళ్ళాడు. ఆమె ఫోన్ బూత్‌లోకి దూరి కాస్సేపయ్యాక తిరిగి వచ్చింది. రిసెప్షన్ కౌంటరు ముందుకు వెళ్ళి ఒక తాళం చెవిని తెచ్చింది. బులెట్ ఆమెతో కింద భాగంలోవున్న 30 నంబరు గదిలోకి వెళ్ళాడు. ఆమె తలుపుమూసి తాళం చెవిని తిప్పింది.

గదిలో ఫ్లోర సెంటు లైటు వెలుగుతోంది.

"మీరు కూర్చోండి. రాజన్ యిక్కడికి వస్తాడు," అందామె.

బులెట్ ఆమెకేసి నవ్వుతూ చూశాడు. సోఫాలో కూర్చున్నాడు. ఎదురుగా ఆమె కూర్చుంది.

గదిబయట బూట్ల చప్పుడయింది. బులెట్ గుమ్మం వైపు పరిగెత్తుకెళ్ళి, తాళంతీసి, తలుపు తెరిచి బయటకు చూశాడు.

ఆసిస్టెంట్ రులో తను చూసినతను గది ముందునుంచి వేగంగా వెళ్ళిపోయాడు! నడవచివర మలుపు తిరిగి అతడు మాయమయ్యాడు.

మళ్ళీ సోఫాలో కూర్చున్నాడు బులెట్. ఆమెకేసి నవ్వుతూ చూశాడు.

"అతను రావడానికి ఎంత టైమ్ పడుతుంది?"

"కాస్సేపట్లో వస్తాడు," అందామె.

నిజంగా రాజన్ వస్తాడా? లేక ఆమె నాటకమాడుతోందా? బులెట్ ఆలోచిస్తున్నాడు.

## 5

ఎవరో తలుపును మూడుసార్లు తట్టారు.

ఆమె వెళ్ళి తలుపును తెరిచింది. పొడుగ్గా, సన్నగా

వున్న ఒకతను వుషారుగా లోపలకొచ్చాడు. ఆమె తలువు మూసింది.

బులెట్ లేచి నిలబడి అతనితో కరచాలనం చేశాడు.

"రాజన్, ఎలావున్నావ్?" అన్నాడు బులెట్.

"ఇక్కడకు నువ్వొచ్చినందుకు సంతోషం," అని రాజన్ గదిలోవున్న ఆమెకేసి చూశాడు.

"రీటా, మేం కొన్ని ముఖ్యవిషయాలు మాట్లాడాలి. నువ్వు హోటల్ ముందుహాల్లో కూర్చో!" అన్నాడు రాజన్.

"నే విన్నా ఎవ్వరికీ చెప్పను" అందామె.

"వినకుండా వుండడం నీకు శ్రేయస్కరం" అన్నాడు రాజన్.

ఆమె బయటకు వెళ్ళింది. రాజన్ తలుపుమూసి తాళం వేసాడు. క్షణకాలం గది నలువైపులా చూశాడు. ఎక్కడా మైక్స్ లేవని నిర్ధారణ చేసుకొన్నాడు.

బులెట్ ప్రక్కన కూర్చున్నాడు. బులెట్ వంక సీరియస్‌గా చూశాడు.

"మిస్టర్ బులెట్, శ్యామ్ వాళ్ళ చేతుల్లో వున్నాడని నా అనుమానం. ఎప్పుడో అతని శవం పోలీసులకు దొరుకుతుంది" అన్నాడు రాజన్.

"గుడ్ గాడ్!" అన్నాడు బులెట్.

"ఇండియన్ గూఢచారులు రగడాదేశంలో లేకుండా చూడ్డానికి పిండారిస్తాన్ గూఢచార్లు కంకణం కట్టుకొన్నారు. ఇద్దరు హత్యచేయబడ్డారు. మూడోవాడు శ్యామ్. పోతే నేను ఒక్కడినే యిక్కడ మిగుల్తాను. నన్నూ ఎప్పుడో రుదముట్టిస్తారు. వాళ్ళకు దొరకకుండా ఎంతో రహస్యంగా వుండవలసి వస్తోంది," అన్నాడు రాజన్.

"పిండారిస్తాన్ గూఢచారులకు మనం బుద్ధి చెప్పాలి" అన్నాడు బులెట్.

"ప్రస్తుత పరిస్థితుల్లో వాళ్ళను మనం జాడించలేము. వీలయినంత తొందరగా నేను మనదేశానికి పోవాలని చూస్తున్నాను" అన్నాడు రాజన్.

బులెట్ అతడివంక సూటిగా చూశాడు.

"మిస్టర్ రాజన్! తోకలు ముడుచుకొని మనం పారి పోడం మంచిదికాదు. మనం ధైర్యంగా నిలబడాలి. ప్రాణానికి ప్రాణంతీసి వాళ్ళను భయపెట్టాలి. అప్పుడు వాళ్ళు మనజోలికి రారు!" అన్నాడు బులెట్.

"అదంతా ఎలా సాధించాలో నువ్వే ఆలోచించాలి"

బులెట్ సోఫాలోంచి లేచాడు. అతడివైపు చూసేడు. "ఈదేశంలో పిండారిస్తాన్ గూఢచారులు యెంతమంది వున్నారు?"

"రెండు వందలమంది వుంటారు."

"మన వాళ్ళిద్దరు మరణించారు. వాళ్ళల్లో ఎవర్నైనా మీరు చంపగలరా?"

"లేదు!"

"అందుకే వాళ్ళు విర్రవీగుతున్నారు. వాళ్ళకి కొమ్ము లొచ్చాయి. కొమ్ముల్ని మనం విరగ్గొట్టాలి!" అన్నాడు బులెట్.

"అందుకు మనబలం చాలదు!"

"ధైర్యంగా వ్యవహరిస్తే ఒక్కడు వందమందిని చిత్తు చేయొచ్చు," అరిచాడు బులెట్.

రాజన్ మౌనంగా విన్నాడు. బులెట్ మాటలు వింటే అతడికి ధైర్యమొస్తోంది.

"శ్యామ్‌ని వాళ్లు ఎక్కడ దాచివుంటారు?"

"ఈ పట్నంలో వాళ్ళ స్థావరం వుంది. అక్కడ దాచివుంటారు."

"అక్కడకు మనం వెళ్దాం" అన్నాడు బులెట్.

రాజన్ ఆశ్చర్యంగా చూశాడు అతనివైపు.

"మృత్యు కుహరంలోకి అడుగు పెట్టినట్లవుతుంది! అక్కడనుండి మనం ప్రాణాల్తో బయట పడలేం," అన్నాడు రాజన్.

బులెట్ ఫక్కున నవ్వాడు.

"వాళ్లెంత ధైర్యవంతులో పరీక్షిద్దాం" అన్నాడు బులెట్.

"ధైర్యం వివేకంతో కూడినదై వుండాలి!"

"వివేకం మనిషిని వెనక్కు లాగుతుంది. మొండి ధైర్యంతో మనం యీపని చెయ్యాలి"అన్నాడు బులెట్.

ఓ నిముషంపాటు గదిలో నిశ్శబ్దంగావుంది. బులెట్ అతడివంక చూశాడు.

"మిస్టర్ రాజన్, మనిద్దరం ఆ స్థావరంలోకివెళ్లొద్దు! నేను ఒంటరిగా లోపలకు వెళతాను. నేను ఓ గంటలో తిరిగి రాకపోతే నువ్వు పోలీసులతో ఆ స్థావరంమీద దాడి చెయ్యాలి!"

"ఇక్కడి పోలీసులంతగా కల్పించుకోరు" అన్నాడు రాజన్.

"రగడా మనదేశానికి శత్రువుకాదు. మన దేశంనుంచి ఎన్నో వస్తువులు యిక్కడకు ఎక్స్‌పోర్టు అవుతున్నాయి. ఇండియన్ ఇంజనీర్లు యిక్కడ యెన్నో ప్రాజెక్టులలో సహకరిస్తున్నారు. ఇండియన్ కాన్సలేటు ద్వారా నేను పోలీసు అధికారులను కల్సుకొంటాను. వాళ్ళు మనకు సహాయపడ్తారు" అన్నాడు బులెట్.

"ఆ విధంగానైతే పనులు జరుగుతాయి," రాజన్ ఒప్పుకొన్నాడు.

"మళ్ళీ నిన్ను ఎక్కడ కలుసుకోవాలి?"

"3877 నంబర్‌కి ఫోన్ చేసి సీమా కావాలని అడుగు. సీమావచ్చాక నీపేరు బులెట్ అనిచెప్పి నేను కావాలను ఆమె నన్ను పిలుస్తుంది."

"సీమా ఎవరు?"

"ఆమె యింట్లో నేను వుంటున్నాను. ఆమెభర్త పెద్ద వుద్యోగంచేసి చచ్చిపోయాడు. ఆమెకు బాగా డబ్బుంది. నేనంటే ఆమెకెంతో ఇష్టం. ఆమె ఇంట్లో వుంటున్నాను. ఆమెకు తల్లితప్ప మరెవ్వరూ లేరు."

"ఆమె నీకు ద్రోహం చెయ్యదుగా."

"ఇంపాసిబుల్. రెండు మూడుసార్లు ప్రమాదాల నుంచి ఆమె నన్ను కాపాడింది."

"రీటా ఎటువంటిది?" అడిగాడు బులెట్.

"అమాయకురాలు. ఎక్కువగా వాగుతుందని నా భయం. నా ఫోన్ నెంబర్ ఆమెకు తెలుసు. నేనెక్కడున్నదీ ఆమెకు తెలియదు. ఆమెను నేనీ గదిలో కలుసుకొంటూంటాను."

"మిస్టర్ రాజన్, ఎక్కువగా ఆడవాళ్ళతో తిరగడం ప్రమాదకరం. ఒకోసారి డిటెలాలు సంభవిస్తారు," అన్నాడు బులెట్ నవ్వుతూ.

బయట మళ్ళీ బూట్ల చప్పుడయింది. బులెట్ తలుపు తెరిచి చూశాడు, ఆస్టిన్ కారులోని వ్యక్తి గుమ్మంముందు నుంచి కదులుతున్నాడు.

అతనివైపు చూశాడు బులెట్. ఎడిచేత్తో అతని మెడను పట్టుకొని గదిలోకి లాక్కొచ్చి తలుపుమూసేడు.

అతడు గింజుకొంటున్నాడు. బులెట్ అతడిని మోకాల్తో పొడిచాడు. అతడు కిందపడ్డాడు.

"వీడొక పిండారిస్తాన్ గూఢచారి!" అన్నాడు రాజన్.

నేలమీద పడున్న అతనివంక బులెట్ కోపంగా చూశాడు.

"అతని జేబులు వెతుకు!" అర్చాడు బులెట్.

రాజన్ అతని జేబులు వెతికాడు. ఒకపిస్టల్, చిన్న కత్తి, పర్స వున్నాయి. వాటిని సోఫాలో పడేశాడు రాజన్.

"ఏమిటీ దౌర్జన్యం?" అర్చాడతను.

అతడివైపు సూటిగా చూశాడు బులెట్.

"ఎందుకు నన్ను వెంటాడుతున్నావ్."

"నిన్ను నేను వెంటాడ్డంలేదు. రూంనెంబర్ 40 లో నా మిత్రుడున్నాడు. అతనితో మాట్లాడి నేను పోతూ వుంటే గదిలోకి లాక్కొచ్చావు" అర్చాడతను.

"నీకారు నాకారు వెనకనే వచ్చింది!"

"హోటల్ లియోకి వచ్చేవాళ్ళకి రెండే రోడ్లు వున్నాయి. నా పనిమీద నేనొచ్చాను. నువ్వెవరో నాకు తెలీదు" అన్నాడతను.

"వాడు పిండారిస్తాన్ గూఢచారి. ఇంతకు ముందు వాడిని ఎన్నిసార్లో చూశాను" అన్నాడు రాజన్.

బులెట్ అతడిని మళ్ళా బూటుతో తన్నాడు. అతడు నేలమీద దొర్లుతూ దూరంగా వెళ్ళాక లేవబోయాడు. బులెట్ అతడివైపు మూడు కాళ్ళి పొట్టలో పొడిచాడు. అతడు అరుస్తూ వెనక్కి తిడ్డాడు.

బూటుని అతడి ఛాతీమీద ఆనించాడు బులెట్. రాస్కెల్, నిజంచెప్పు!" గర్జించాడు.

"నేను ఒంటరిగా లేను. నేను బయటకు వెళ్ళకపోతే నన్ను వెతుక్కొంటూ యిద్దరు యిక్కడికొస్తారు!" అన్నాడతను.

"నువ్వీ గదిలో వున్నావని వాళ్ళకేం తెలుసు?"

"ఈ గదిలో వుంటానని వాళ్ళు వూహిస్తారు. వాళ్ళకీ గది నంబరు తెలుసు," అన్నాడతను.

"నువ్వు చెప్పింది నువ్వొక గూఢచారివని ఋజువు చేస్తోంది. నా గదిలోకొచ్చిన వాళ్ళు తిరిగి వెళ్ళరు," అన్నాడు బులెట్.

జేబిలోంచి కత్తిని బయటకు తీశాడు బులెట్. అతడి కంఠంమీద కత్తికొనను వుంచాడు.

"నా ప్రశ్నలకు జవాబియ్యి, లేకపోతే యిది నీ గొంతులోకి దిగుతుంది" అర్చాడు బులెట్.

"నేను ఏమీ చెప్పలేను" అన్నాడతను.

"నీ పేరు?"

"కరీమ్."

"నువ్వు నన్ను వెంటాడుతున్నావా?"

"నువ్వు ఎక్కడికెళతావో బాస్ చూడమన్నారు."

"మీ బాస్ ఎవరు?"

"నాకు పేరు తెలియదు."

కత్తికొన చర్మాన్ని పీకింది. అతడు బాధతో అర్చాడు. కొద్దిగా రక్తం చిమ్ముతోంది.

"స్టార్ట్ టాకింగ్" అర్చాడు బులెట్.

"బాస్ పేరు నాగిన్."

"ఇండియన్ గూఢచారుల్ని మీరు ఎందుకు చంపారు?"

"నే చంపలేదు!"

"మీవాళ్ళు ఎందుకు చంపారని అడుగుతున్నాను."

"మావాళ్ళు చంపలేదు!"

క త్తికొన అతని గడ్డానికి గుచ్చుకొంది. అతడుమూలు గుతూ బులెట్ వంక చూశాడు.

"నన్నుపోనీ! నీకంతా చెప్పాను!"

"నిన్ను చంపి నీ శవాన్ని నీవాళ్ళకు పంపుతాను. ఇండియన్ గూఢచార్లను ముట్టుకొంటే మాతులు మాడు తాయని వాళ్లు నేర్చుకుంటారు!"

అతడి శరీరం వణుకుతోంది.

"ప్లీజ్! నన్ను చంపొద్దు!"

"ప్రాణానికి ప్రాణం!" అర్చాడు బులెట్.

"వాళ్ళను చంపినవాళ్ళని నువ్వు చంపాలి. నన్ను చంపడం న్యాయంకాదు!"

"వాళ్ళను ఎవరు చంపారు?"

"బాస్ చంపమని ఉత్తరువిచ్చాడు. అతడి కుడిభుజ మయిన చెంగీజ్ వాళ్ళను చంపాడు."

"చెంగీజ్ ఎక్కడుంటాడు?"

"రాత్రి పది తర్వాత అతడు తను వుంచుకొన్న ముండ యింట్లో వుంటాడు. ఆమె పేరు నజ్మా. ఆమె టోల్ గేటు రోడ్డుమీదున్న నంబర్ 37 ఇంట్లోవుంటుంది" అన్నాడతను.

బులెట్ అతనిని లేవదీశాడు. అతడిని సోఫాలో కూర్చొబెట్టి మంచినీళ్ళు యిచ్చాడు.

"మిస్టర్ కరీమ్, నిన్ను వదిలేస్తున్నాను. నేనుచాలా చెడ్డవాడిని. ఇటుపైన నాజోలికి రాకు! ప్రాణంతో బయట పడుతున్నందుకు సంతోషించు. నీ పర్స్ పట్టుకు పో. తతిమ్మావి మా దగ్గరుంటాయి" అన్నాడు బులెట్.

కరీమ్ తన పర్స్‌ని జేబులో పడేసుకొని గుమ్మంవైపు నడిచాడు. తలుపు తెరిచేముందు బులెట్ అతడివంక సూటిగాచూశాడు.

"మళ్ళా నా చేతుల్లో పడకుండా జాగ్రత్తపడు!" అన్నాడు బులెట్.

కరీమ్ మౌనంగా బయటకు వెళ్ళిపోయాడు.

"మిస్టర్ రాజన్, పిండారిస్తాన్ గూఢచారి యెంత ధైర్యం గలవాడో చూశావుగా!" అన్నాడు బులెట్ వ్యంగ్యంగా.

"వాళ్ళను మనం నమ్మలేం! అతడు నీమీద పగ సాధించడానికి ప్రయత్నిస్తాడు" అన్నాడు రాజన్.

"డోంట్ బాదర్! నేను నీకు ఫోన్ చేస్తాను. ఆ స్థావరాన్ని నాకు చూపించు. గుడ్ నైట్" అని బులెట్ గదిలోంచి బయటకు కదిలాడు.

అతను వెళ్ళిన ఓ నిముషం తర్వాత రాజన్ బయటకు నడిచి, గదికి తాళం వేసి, హోటల్ ముందుహాలు వైపు అడుగులేశాడు.

# 6

టైమ్ ఎనిమిది దాటింది. బులెట్ కారును వేగంగా పోనిస్తున్నాడు. సిమెంటురోడ్డు లైట్ల కాంతిలో మెరుస్తోంది. పక్కకూర్చున్న లూసీవంక చూసాడతను.

ఇరవైయేళ్ళ యువతి. పచ్చగా అందంగావుందామె. సిల్కుగౌను ధరించింది. చెవులకు పెద్దరింగులున్నాయి. మెళ్ళో బంగారం గొలుసుంది.

"ఎక్కడికెళదాం?" అడిగాడతను.

"మీ యిష్టం," అందామె.

"నీకే హోటల్లో తినాలనివుంది?"

"హోటల్ టాంగో బాగుంటుందని విన్నాను. నేను ఎప్పుడూ వెళ్ళలేదు. అక్కడికెళ్ళాలంటే ఎక్కువగా డబ్బు ఖర్చవుతుంది" అందామె.

"అక్కడికే వెళదాం," అన్నాడు బులెట్.

హోటల్ టాంగో కాంపౌండ్‌లో అతడు కారాపి దిగాడు. ఇద్దరూ లోపలకు వెళ్ళారు. ఏర్ కండిషండ్ డైనింగ్ హాలు చాలా విశాలంగా వుంది. ఎన్నో ఫ్లోరో సెంటు లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. తగ్గు స్వరంలో వెస్టర్న్ మ్యూజిక్ వినపడ్తోంది.

ఎదురెదురుగా వాళ్ళు కూర్చున్నారు. ఎర్రటి యూని ఫామ్‌లో వున్న బేరర్ వచ్చి సలామ్ చేసి మెనూకార్డు టేబిల్ మీద పెట్టాడు.

"డిన్నర్ ముందు డ్రింక్స్ సార్?" అడిగాడతను.

"షివాస్ రీగల్ విస్కీ బాటిల్, సోడాలు" ఆర్డర్ ఇచ్చాడు బులెట్.

బేరర్ వెళ్ళిపోయాడు. డైనింగ్ హాలు నలువైపులా చూశాడతను. వందమందిపైగా డైనింగ్ హాల్లో వున్నారు. టేబిల్స్ దూరదూరంగా అమర్చబడి వున్నాయి. అందు వలన ఒకళ్ళమాటలు పక్క టేబిల్ దగ్గర కూర్చున్న వాళ్ళకు వినపడవు.

బేరర్ స్కాచ్ బాటిల్ తెచ్చి టేబిల్ మీదుంచాడు. సోడా బుడ్లనూ, రెండు గ్లాసులనూ పెట్టాడు.

రెండు గ్లాసుల్లో ఆమె విస్కీ పోసి సోడా కలిపింది'

ఇద్దరూ గ్లాసుల నందుకున్నారు. చియర్స్ చెప్పి గ్లాసును బులెట్ క్షణంలో ఖాళీచేశాడు.

"మీరు చాలా ఫాస్ట్!" అందామె.

"ఐయామె ఫాస్ట్ వర్కర్," అన్నాడతను.

లూసీ మెల్లిగా తాగుతోంది. అతడామె కేసినవ్వుతూ చూసాడు.

"నువ్వాగదిలో ఒంటరిగా వుంటున్నావా?"

"నా తలిదండ్రులు పల్లెటూళ్లో వున్నారు. ఉద్యోగం కోసం నేనిక్కడ ఒంటరిగా వుండవలసి వచ్చింది,"

అందామె.

"శ్యామ్ నీకెంత కాలంనుంచి తెలుసు?"

"గత ఆరుమాసాలనుంచి."

"అతడు ఏమయ్యాడో నీకు తెలుసా?"

"పిండారిస్తాన్ గూఢచారులు తనని విశేషంగా వెంటాడుతున్నారని శ్యామ్ నాతో చెప్పాడు. ఒకరోజు నేను ఆఫీసుకెళ్ళి వచ్చాను. ఆరాత్రి నన్ను డిన్నర్‌కి తీసుకువెళతానన్నాడు. కానీ అతడు రాలేదు. అప్పటి నుంచీ అతడు ఏమయ్యాడో తెలియదు."

విస్కీ తాగుతూ అతడామెకేసి చూశాడు.

"అతడికోసం ఎవరేనా గదికి వచ్చేవారా?"

"శ్యామ్ ఆ గదిలో వున్నాడని యెవ్వరికీ తెలియదు. అతడికోసం ఎవ్వరూ వచ్చేవారు కాదు!"

ఆరుపెగ్గుల తర్వాత డిన్నర్ వచ్చింది. ఇద్దరూ తృప్తికరంగా తిన్నారు. బులెట్ బిల్లు చెల్లించాడు. వాళ్ళు బయటకు నడిచి కార్లో కూర్చున్నారు.

అతడు కారుని పోనిస్తున్నాడు. ఆమె అతడి తొడమీద చెయ్యి వేసింది.

"శ్యామ్ నా మిత్రుడు. స్నేహితుల ప్రేయశిలను తస్కరించే అలవాటు నాకులేదు." అన్నాడతను.

ఆమె కిలకిల నవ్వింది.

"శ్యామ్ నన్ను పెళ్ళాడలేదు. అటువంటి వుద్దేశ్యం మా యిద్దరికీ లేదు. ఐయామ్ ఫ్రీ!" అందామె.

బులెట్ నవ్వాడు. ఆమె నడుంచుట్టూ చెయ్యిని పోనిచ్చాడు.

"నీ గదికి వెళదామా?"

"మరోచోటకి పోదాం. నాకొక మంచి ప్రదేశం తెలుసు?"

"ఎక్కడ?"

"లవర్స్ డెన్! అక్కడ సిమెంటు సోఫాలుంటాయి. చంద్రుణ్ని చూస్తూ, చల్లగాలిలో మనం హాయిగా ఆడుకోవచ్చు!" అందామె.

"ఫైన్!" అన్నాడతను.

పెద్దతోటలో అతడు కారును ఆపాడు. అక్కడక్కడ లైట్లు వెలుగుతున్నాయి. దూరదూరంగా కార్లు ఆగివున్నాయి. ఇద్దరూ కార్లోంచి దిగారు.

బులెట్ ఆమె నడుంచుట్టూ చెయ్యివేసి నడిపించాడు. మెల్లిగా నడిచి ఒక సోఫాదగ్గరకు చేరుకున్నారు. ఆమె సోఫాలో కూర్చుంది. అతడు పక్కనే కూర్చున్నాడు.

ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. నక్షత్రాలు తళతళ మెరుస్తున్నాయి. ఆమె వెల్లకిలా సోఫామీద పడుకొంది. అతడామెమీదకు వాలాడు. ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు. లూసీచేతులు అతనిని చుట్టేశాయి.

"మిస్టర్ రాజ్ మోహన్, ఐ లవ్ యూ!" అందామె.

"నాకు లవ్‌లో నమ్మకంలేదు. ఆడదానికి పురుషుడు, మొగాడికి స్త్రీ కావాలి, అంతే. ప్రేమనే పేరుతో బానిసలయి పోవడం ప్రకృతికి విరుద్ధం. జంతువులు లైంగిక వాంఛలను తీర్చుకొని విడిపోతాయి. మనంకూడ అలా వుండగలిగితే యీ లోకంలో సమస్యలుండవు!"

"ప్రేమించడం మానవ లక్షణం!" అందామె.

"నేను మనిషిని కానేమో!" అన్నాడు బులెట్.

చంద్రకాంతిలో ఆమె పెదిమల ఎరుపు కనిపిస్తోంది. పళ్లు ముత్యాల్లా మెరుస్తున్నాయి. ఎందుకో ఆమె అరిచింది.

"లూసీ, ఏమయింది?" అడిగాడతను.

వెనుకనుంచి ముగ్గురు మనుషులు అతడిని బలంగా పట్టుకున్నారు. మరో ఏడుగురు అతడ్ని చుట్టుముట్టారు. కరీమ్ మీసాలను వేలితో నిమురుతూ అతడికి ప్రత్యక్షమయ్యాడు.

"మిస్టర్ రాజ్ మోహన్, ఇప్పుడేమంటావ్?" అన్నాడు కరీమ్.

"నా జోలికి రావద్దని నిన్ను హెచ్చరించాను. నువ్వు నామాట వినలేదు. కష్టపడ్తావు!" అన్నాడు బులెట్.

"కిక్ హిమ్!" అరిచాడు కరీమ్.

నలుగురు మనుషులు అతడిని బాదారు. బులెట్ వూపిరి బిగబట్టాడు. ఓటాలున అతడు గింజుకొని పైకి గెంతాడు. బూట్లతో యిద్దర్ని తన్నాడు. వాళ్ళు వెనక్కిపడ్డారు.

జేబులోంచి పిస్టల్ని తీశాడు. మూడుసార్లు షూట్ చేశాడు. ముగ్గురు అరుస్తూ నేలకూలారు. కొందరు చెట్ల వెనక్కి తప్పుకున్నారు.

కరీమ్‌వైపు అతడు పిస్టల్ని తిప్పి షూట్ చేశాడు. అతడు నేలమీద పడ్డాడు. నలువైపులా చూసాడు బులెట్. ఎవ్వరూ లేరు. వాళ్ళు పారిపోయి వుండొచ్చు!

లూసీ నవ్వుతూవచ్చి అతడిని కౌగలించుకోబోయింది. ఆమె చెంప పగిలింది.

"ట్రెయిటర్!" అన్నాడతను.

"నేను ద్రోహినికాను. వాళ్ళు మన్ని వెంటాడి ఇక్కడకు వచ్చుంటారు" అందామె.

ఆమెవంక అతను సూటిగా చూశాడు.

"శ్యామ్‌నుకూడా యిలాగే వాళ్ళకు అప్పగించి వుంటావ్. శ్యామ్ ఎక్కడున్నాడు?" అరిచాడుబులెట్టు.

"నాకు తెలియదు," అందామె.

కాల్లో ఆమెను తన్నాడతను. ఆమె సోఫామీద పడింది. దగ్గరగా వెళ్ళాడతను. ఆమెముక్కును వేళ్లతో పట్టుకొని పిండాడు. ఆమె మూలిగింది.

"చెప్పు!"

"శ్యామ్, శ్యామ్‌ని వాళ్ళు చంపేశారు. శవాన్ని కాల్చేశారు," అందామె.

"ఎవరు చంపారు?"

"చెంగీజ్."

"నువ్వు వాళ్ళ తరఫున పనిచేస్తున్నావని ఒప్పుకుంటావా?"

ఆమె తలాడించింది.

బుల్లెట్టు జేబులోంచి కత్తి తీశాడు. ఆమె గాభరాగ అతడివైపు చూసింది.

"నన్ను చంపకు!" అర్చిందామె.

"చంపను. నిన్ను కుంటిదాన్ని చేసేస్తాను. ఇటుపైన కుంటుతూ శ్యామ్‌ని గురించి తల్చుకుంటూ జీవించు!" అన్నాడతను.

క్షణంలో ఆమె భయంకర అరుపు గాలిలో ధ్వనించింది. ఆమె కుడికాలు తెగి కిందపడింది. కత్తిని ఆమె గుడ్డలకు తుడిచి బుల్లెట్టు తనకారువైపు పరుగెత్తాడు. ప్లిమత్ కారు వేగంగా రోడ్డమ్మట దూసుకుపోయింది.

# 7

టైం పన్నెండు కావస్తోంది. టోల్ గేటు రోడ్డుమీద ప్లిమత్ కారునాపి బుల్లెట్టు కిందకి దిగాడు. టార్చి కాంతిలో 37వ నెంబర్ ఇల్లును గుర్తించాడు. మెల్లిగా యింటిముందు కెళ్ళాడు. క్షణకాలం నిలబడి నలువేపులా

చూశాడు. ఇరుగుపొరుగు ఇళ్ళలోని వాళ్ళు నిద్ర పోతు న్నారు.

చప్పుడు చెయ్యకుండా బులెట్టు గుమ్మం ముందుకు చేరు కున్నాడు. టార్చి కాంతిలో తలుపును చూశాడు. గోడ మీద ఎలక్ట్రిక్ బెల్ బటన్ కన్పించింది. దాన్నినొక్క అతడు ఆలోచిస్తూ నిలబడ్డాడు.

నజ్మా చెంగిజ్ వుంపుడుగత్తె. ఆమెకు యితరులతో కూడ సంబంధం వుండొచ్చు. అతను మరోసారి బటన్ నొక్కాడు. లోపల్నుంచి కదుల్తున్న కాళ్ళ చప్పుడు ఆతనికి వినిపించింది. తలుపు తెరవబడింది.

హాల్లోని ఫ్లోరసెంటు లైటు వెలుగుతోంది. ముప్ఫయి ఏళ్ళ వయస్సులోవున్న స్త్రీ పల్చటి మాక్సీలో అతని ముందు నిలబడింది.

నవ్వుతూ బులెట్టు ఆమెకేసి చూసాడు. ఆమె స్తనాలు కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. ఆమె అతడి వైపు కోపంగా చూసింది.

"మిస్టర్, ఇంత రాత్రివేళ రావడం?" అందామె.

"మిస్ నజ్మా, నీ గురించి విన్నాను. పొద్దుటే నా దేశానికి వెళ్ళిపోతున్నాను. నీ పరిచయం లేకుండా వెళ్ళ డానికి మనసొప్పలేదు. తెగించి యిలా వచ్చాను."

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"ఐయామ్ సారీ! లోపల నా మిత్రుడున్నాడు. ఎవ రేనా వస్తే నన్ను చంపుతాడు" అందామె.

"ఈపాటి కతడు నిద్రపోతూండాలి. నాకురాత్రంతా అక్కర్లేదు. అరగంట నీతోవుంటే అదేచాలు. నీకోసం షివాస్ రీగల్ స్కాచ్ విస్కీ తెచ్చాను. నీకు యెంత డబ్బయినా యివ్వడానికి సిద్ధంగా వున్నాను" అన్నా డతను.

"కమిన్!" అంది నజ్మా.

అతడు లోపలకు వెళ్ళాడు. ఆమె తలుపు మూసింది. హాల్లో సోఫాలున్నాయి.

"100 డయాల్స్ ఇవ్వాలి. ఆ విస్కీ బాటిల్ నాది" అందామె.

"సంతోషంగా," అన్నాడతను, బాటిల్ని టీపాయ్ మీద పెడ్తూ.

"చెంగీజ్ డేంజరస్ మేన్. నా పడగ్గదిలో అతడు నిద్రపోతున్నాడు. ఇతర్లను నేను ఇలా రానిస్తున్నానని తెలిస్తే నన్ను చిత్రవధ చేస్తాడు. నీ పని ముగించి అర గంటలో వెళ్ళిపోవాలి" అందామె.

నజ్మా సోఫాలో పడుకొంది. పక్కనే కూర్చున్నాడతను. ఆమెవైపు నవ్వుతూ చూసాడు. తటాలున ఆమె కణతమీద చేత్తో కొట్టాడు. ఆమె కళ్ళు మూసింది. అతడు లేచి నిలబడ్డాడు.

ఆమెకేసి చూస్తూ వుండిపోయాడు. గంటదాకా ఆమె లేవదు. జేబులోంచి పిస్టల్ తీసి దానికి సైలెన్సర్ని అమర్చాడు. మెల్లిగా అతడు లోపలకు వెళ్ళాడు.

ఒక గదిలో ఓ ముసలామె పడుకొనివుంది. బులెట్లు బయటకొచ్చి తలుపు దగ్గరగా మూసాడు. మరో గదిలోకి ప్రవేశించాడు.

జీరో వోల్టు బల్బు వెలుగుతోంది. అతడు స్విచ్ నొక్కాడు. గదిలోని లైటు వెలిగింది.

పెద్ద పరుపుమీద ఒకతను నగ్నంగా పడుకొని వున్నాడు. నల్లగా లావుగా వున్నాడు. పొట్టిగా కత్తిరించిన క్రాపు, పిల్లిగడ్డం, గుబురుగా పెరిగిన మీసాలు.

అతడు కళ్ళు తెరచి లైటువంక చూసాడు. "నజ్మా" పిల్చాడతను.

అతడి కంఠం బొంగురుగా వుంది.

అతడు లేచి కూర్చున్నాడు. గదిలోవున్న బులెట్టు వైపు అతడు ఆశ్చర్యంగా చూశాడు.

"ఎవరునువ్వు? ఇక్కడికెలా వచ్చావు?" అరిచా డతను.

"నువ్వు చంపిన ఇండియన్ గూఢచారులు నన్నిక్క డకు పంపారు. వాళ్ళ ఆత్మలకు శాంతిచేకూర్చమన్నారు" అన్నాడు బులెట్టు.

చెంగీజ్ పైజామాలోకి దూరాడు. బులెట్టు అతడి వంక పిస్టల్ని గురిపెట్టాడు.

"హరిసింగ్, దత్తూరామ్, శ్యామ్‌లను జ్ఞాపకం చేసుకో! వాళ్ళను చంపినందుకు నువ్వు శిక్ష అనుభవిం చాలి" అన్నాడు బులెట్.

చెంగీజ్ మాట్లాడలేదు. తనని కాపాడుకొనే అవ కాశం కోసం ఎదురుచూస్తున్నాడు.

"చేతులెత్తు!"

అమాంతంగా చెంగీజ్ చేతులెత్తాడు. బొందు ముడి పెట్టని పైజామా కిందకి జారిపోయింది.

"నిన్నుచంపి, యీ గదిలోనే నీశవాన్ని కాల్చేస్తా" అరిచాడు బులెట్టు.

"ప్లీజ్, యిటుపైన ఇండియన్ గూఢచారుల జోలికి నేనుపోను. వాళ్ళను గౌరవంగా చూస్తాను. నన్ను చంపకు! పిల్లలున్న వాడ్ని!"

"నువ్వు చంపినవాళ్ళకూ పిల్లలున్నారు!"

"నాగిన్ చంపమంటే నేను చంపాను. అసలు హంత కుడు నాగిన్, నేనుకాదు."

"నాగిన్ నీ వెనకనే పైలోకానికి వెళతాడు!"

చెంగీజ్ భయంకరమైన మనిషి. ఐనా అతని కళ్ళు నీళ్ళతో నిండాయి. అతడివైపు వ్యంగ్యంగా చూసాడు బులెట్టు.

"ముసలి ఏడిస్తే నాహృదయం కరిగిపోదు!" అన్నాడు బులెట్టు.

"నీకేం కావాల్సినా యిస్తాను. నన్ను చంపకు!" ప్రబతిమాలాడతను.

"రాస్కెల్ చెంగీజ్, కళ్ళు మూసుకొని దైవాన్ని ప్రార్థించుకో!"

చెంగీజ్ తలగడను అందుకున్నాడు. తనముందుదాన్ని షీల్డ్‌గా వుంచుకున్నాడు.

బులెట్టు ట్రిగర్ నొక్కాడు. తలగడ కిందపడింది. చెంగీజ్ వెనక్కి జరిగాడు. మంచంకిందకి దూరడానికి వంగుతున్నాడు.

బులెట్టు ట్రిగర్ని నొక్కాడు. అరుస్తూ చెంగీజ్ వెనక్కిపడ్డాడు. అతడి దగ్గరకు వెళ్ళాడు బులెట్టు. బొడ్డు ప్రాంతంనుంచి రక్తం కారుతోంది. బూటుతో అతని ముఖాన్ని తన్నేడు.

చెంగీజ్ బాధతో మూలుగుతున్నాడు. అతడివైపు మరోసారి షూట్ చేసాడు. చెంగీజ్ మొహం రక్తమయంగా అయింది. మరోక్షణంలో అతడిలో చలనం లేదు.

రక్తం మడుగులో పడున్న చెంగీజ్ వైపు బులెట్టు చూస్తూ నిలబడ్డాడు. సమీపంలోవున్న గుడ్డలను శవం మీద పడేశాడు. లైటర్‌తో గుడ్డల్ని అంటించి తన సిగరెట్టు వెలిగించుకొన్నాడు. పొగవదుల్తూ బులెట్టు గదిలోంచి కదిలాడు.

హాల్లో నక్షత్ర యింకా నిద్రపోతోంది. ఆమెపక్కనే టీపాయ్‌మీదున్న విస్కీబాటిల్ని జేబిలో పెట్టుకొని, అతను బయటకు పోయాడు. సమీపంలోవున్న కారుదగ్గరకు చేరుకున్నాడు.

# 8

ప్లిమత్ కారు రోడ్డమ్మట దూసుకుపోతోంది.

రోడ్డువారగావున్న టెలిఫోన్ బూత్‌నుచూసి అతడు కారాపి దిగాడు. బూత్‌లోకి వెళ్ళి తలుపు మూశాడు.

3877 నంబరుకి ఫోన్ చేసాడు బుల్లెట్టు. అటువైపు నుంచి స్త్రీ కంఠం వినబడింది.

"సీమా కావాలి" అన్నాడతను.

మరో స్త్రీ రిసీవర్ని అందుకొంది.

"సీమా స్పీకింగ్!" అందామె.

"బుల్లెట్టు హియర్. రాజన్ కావాలి," అన్నాడతను.

వెంటనే రాజన్ వచ్చాడు.

"హలో బాస్!" అన్నాడు రాజన్.

"కిలిక్‌సన్ రోడ్డు వారగావున్న టెలిఫోన్ బూత్ దగ్గర నేనుంటాను. వెంటనే రాగలవా?"

"ఎందుకు?"

"వాళ్ళ స్థావరం నాకు చూపించడానికి!"

"ఇంతరాత్రివేళా?"

"రాత్రివేళ అందరూ నిద్రపోతారు. ఇదే మంచి సమయం."

"వస్తాను," అన్నాడు రాజన్.

బూత్‌లోంచి బుల్లెట్టు బయటకొచ్చి సిగరెట్టుపీలుస్తూ కారుపక్కనే నిలబడ్డాడు. రోడ్డుమీద జనసంచారం లేదు.

మోరిస్ కారొచ్చి రోడ్డువారగా ఆగింది. కారు దగ్గరకు వెళ్ళాడు. కిటికీలోంచి కారులోపలకు చూసాడతను.

"మిస్టర్ బులెట్టు, నా కారువెనకనే నీ కారులోరా. వాళ్ళస్థావరం చూపిస్తాను," అన్నాడు రాజన్.

"ఆల్ రైట్" అన్నాడు బులెట్టు.

"చెంగీజ్ అక్కడ వుండకూడదని దేవుడిని ప్రార్థించాలి. వాడు పరమ దుర్మార్గుడు" అన్నాడు రాజన్.

"అతడక్కడలేడు!" అన్నాడు బులెట్టు.

"నీకెలా తెలుసు?" ప్రశ్నించాడు రాజన్.

"రేపటి పేపర్లలో నీకంతా తెలుస్తుంది."

"రేపటిదాకా సస్పెన్స్ ఎందుకు? ఏం జరిగిందో చెప్పు!" అడిగాడు రాజన్.

"మిస్టర్ రాజన్, దైవం మనిషికి రెండుచెవులు, ఒకే నోరు యిచ్చాడు. యెక్కువగా విను, తక్కువగా మాట్లాడు అని ప్రతివ్యక్తీ తెలుసుకోవాలి! ముందు పని కావాలి, పద!"

రాజన్ కారువెనకనే బులెట్టు తనకారుని పోనిచ్చాడు.

పెద్ద భవనాన్ని దాటి రోడ్డువారగా మోరిస్ కారు ఆగింది. వెనకనే బులెట్టు కారాపి దిగాడు. రాజన్ అతడి దగ్గరగా వచ్చాడు.

"ఆ భవనంవైపు చూడు, అదే వాళ్ళస్థావరం!" అన్నాడు రాజన్.

బులెట్టు గేటువైపు చూసాడు. ఒకడు రైఫిల్‌తో గేటుదగ్గర కాపలావున్నాడు. చుట్టూ ప్రహరీగోడవుంది. లోపలున్న మేడ రోడ్డుమీదున్న వాళ్ళకు కనిపిస్తోంది.

బులెట్టు వెనక్కితిరిగి రోడ్డమ్మట నడిచాడు. గేటు ముందునుంచి వెళ్తూ వాచ్‌మన్ వంక చూసాడు. లోపల ఎవ్వరూ మెలకువగా వున్నట్టులేదు. ఎక్కడా లైట్లు

లేవు. గేటుపైన మాత్రం లైటుంది. కొంతదూరం నడిచి అతడు వెనక్కు తిరిగి కారుదగ్గరకు చేరుకున్నాడు.

"సులువుగా లోపలకు వెళ్ళొచ్చు!" అన్నాడు బులెట్.

"లోపలకు వెళ్ళడం సులువే. బయట పడ్డం కష్టం!" అన్నాడు రాజన్.

"వాళ్ళ బాస్ నాగిన్ యిక్కడే వుంటాడా?"

"మేడమీద వుంటాడతను," అన్నాడు రాజన్.

"మిస్టర్ రాజన్, నేను లోపలకు వెళ్తాను. నాకు మరికొన్ని వివరాలు కావాలి. నాగిన్ ఎలా వుంటాడు?"

"నాగిన్ పొట్టిగా, సన్నగా వుంటాడు. గాలిలో ఎగిరిపోతాడేమో నన్నట్లు వుంటాడు. అతడు తల్చు కుంటే ఎవరయినా గాలిలో మాయమవ్వలసిందే! పైప్ నోట్లో వుంటుంది. పాంటు, స్లాక్‌లో వుంటాడు. బాగా డబ్బుంటుంది. అతను మంగలివాడిని దగ్గరకు రానివ్వ డనుకుంటాను. తనే కత్తిరించుకుంటూ వుంటాడేమో!" అన్నాడు రాజన్.

"నువ్వు చెప్పినదాన్ని బట్టి పోల్చగలను. నువ్విక్కడే తిరుగుతూ వుండు. గంటలోపల నేను తిరిగివచ్చేస్తాను," అన్నాడు బులెట్.

"రాకపోతే?"

"ఇండియన్ కాన్సలేటుకి వెళ్ళి నేను యీ భవ నంలో యిరుక్కు పోయానని చెప్పు. వాళ్ళు పోలీసురిపోర్ట్ యిస్తారు. పోలీసులతో నువ్వు భవనంలోకి రా! నువ్వు ఒంటరిగా రావద్దు!" అన్నాడతను.

"పోలీసులు యిక్కడికొచ్చేవరకూ నువ్వు బ్రతికి

వుండవు. చెంగీజ్ కాల్చి చంపేస్తాడు!"

"చెంగీజ్ ఇక్కడ లేడన్నాగా."

"ఎక్కడున్నా అతడిని రప్పిస్తారు, నిన్ను చంపడానికి!"

"డోంట్ బాదర్! నేను పోయినా ఫరవాలేదు. మీరందరూ ఈ దేశంలో యిటుపైన క్షేమంగావుంటారు. నాకదే కావాలి," అన్నాడు బులెట్.

"నీ ప్రాణాన్ని అలా బలివ్వడం నా కిష్టంలేదు," అన్నాడు రాజన్.

"ముగ్గురు బలైన విషయం నువ్వు మర్చిపోతున్నావ్! వాళ్ళకు జరిగింది నీకూ సంభవించవచ్చు!" అన్నాడు బులెట్.

రాజన్ అమాంతంగా బులెట్‌ని కౌగలించుకున్నాడు.

"నీతో నేనూ వస్తాను."

"గంటలో నేను రాకపోతే రా. నేను విజయాన్ని సాధించి రాగలననే నమ్మకం నాకుంది" అన్నాడు బులెట్.

బులెట్ అతడితో కరచాలనం చేశాడు.

"గాడ్ బ్లెస్ యూ విత్ సక్సెస్!" అన్నాడు రాజన్.

# 9

రోడ్డుదాటి ప్రహరీ గోడవైపు నడిచాడు బులెట్. ప్రహరీగోడ వారగా నిలబడి చేతులు పైన ఆనించి అతడు గోడమీదకు చేరుకొన్నాడు.

గోడమీద కూర్చుని లోపలకు చూశాడు. యెన్నో చెట్లు, పూలమొక్కలు అతడికి చంద్రకాంతిలో కనిపించాయి. మెయిన్ గేటు దూరంలోవుంది. తనని వాచ్‌మన్ చూడలేదు!

బులెట్ అటువైపున మెల్లిగా దిగాడు. ఆరడుగులు పొడుగున్న మనిషి అవడంవలన అవలీలగా అటు దిగ గలిగాడు.

బులెట్ వయిసు 25 వుంటుంది. కసరత్తులో కండలు తిరిగిన శరీరమతనిది. కరాటేలో అతడు ఆరితేరినవాడు. కరాటేలో రెడ్ బెల్టు పొందిన కొద్దిమందిలో ఇతను ఒకడు. షూటింగ్ లో అతడు సిద్ధహస్తుడు. ధైర్యానికి అతనిది మారు పేరు!

సిగరెట్టు పీలుస్తూ నిలబడ్డాడతను. తనచుట్టూవున్న చీకటికి కళ్ళు అలవాటుపడ్డాక అతడు భవనంవైపు కది లాడు.

పెద్ద వరండా ముందున వుంది. వరండా మీదనుంచి మెట్లు పైకి వెళ్ళాయి. అతడు మేడమెట్లు మెల్లిగా ఎక్కాడు. అతడిచేతిలో సైలెన్సరమర్చిన పిస్టల్ వుంది. అతడు పై వరండామీదకు చేరుకొన్నాడు.

ఒక గుమ్మం ముందుకు వెళ్ళాడు. తలుపును తోసేడు. కదల్లేదు. లోపలనుంచి తలుపునుమూసి వుండాలని అతను గ్రహించాడు.

వరండామీద మరికొంత దూరం నడిచి మలుపు తిరి గాడు. పైనున్న వెంటిలేటర్ వంక చూశాడతను. చెయ్యి చాచి వెంటిలేటర్ని తడిమి చూశాడు. రెండు యినప కడ్డీ లకు కర్రపలక అమర్చబడివుంది. అటుపక్కనున్నది యే బాత్ రూమో కావచ్చు. ఎటాచ్ డ్ బాత్ రూమ్ తలుపు లను చాలామంది లాక్ చేయరు.

అతడు వరండా నలువైపులా చూశాడు. ఒక ఖాళీ డబ్బా అతడికి కనిపించింది. డబ్బా ఎత్తుగావుంది.దాన్ని మోసుకొచ్చి అతడు నేలమీద వుంచాడు. డబ్బాపైకి ఎక్కాడు. వెంటిలేటర్ అతడికిప్పుడు బాగా అందింది.

జేబులోంచి స్పెషల్ మినీ రంపం తీసేడతను. బటన్ నొక్కాడు. అది బ్యాటరీ ఆధారంగా పనిచేస్తుంది. పది నిమిషాల్లో రెండు కడ్డీల కొనలనూ కోసేశాడతను.

కోసిన కడ్డీలను, క్రపలకను మెల్లిగా నేలమీద పెట్టి అతడు మళ్ళా డబ్బాపైకి ఎక్కాడు. చేతుల్తో పైకిలేచి వెంటిలేటర్ రంధ్రంలోకి తలను, భుజాలను దూర్చాడు. గదిలో చీకటిగావుంది.

ఒక చేతి పట్టుతో అలాగేవుంచి రెండో చేత్తో లోపల గోడను తడిమిచూశాడు. ఏదో పైప్ అతడివేళ్ళకు తగిలింది. అతడు వేళ్ళతో పైప్‌ని పట్టుకున్నాడు.

మెల్లిగా అతడి శరీరం మరికొంత పాకింది. రెండో చేత్తో పైప్‌ని పట్టుకొని అతడు వెల్లకిలా తిరిగాడు. రెండు చేతుల్లోనూ పైప్‌ని పట్టుకొని అతడు పూర్తిగా లోపలకు చేరుకున్నాడు. అతడు మెల్లిగా నేలమీద అడుగుపెట్టాడు.

గదిలో గాఢాంధకారంగా వుంది. అతను టార్చ్‌ని ఆన్ చేశాడు. ఎదురుగావుంది గుమ్మం!

అతడు గుమ్మంవైపు నడిచాడు. తలుపును కొద్దిగా తోశాడు. కదిలింది.

తలుపునుతోసి అతడు లోపలికెళ్ళాడు. గదిలో యే చప్పుడూలేదు. గది నలువైపులా చూశాడు. గదిలో రైఫిల్స్, పిస్టల్సు, గ్రెనేడ్లు, మిషన్‌గన్స్ వగయిరా వున్నాయి. అతడు గుమ్మం వైపు కదిలాడు. తలుపును లాగాడు. ఆ వైపునుంచి తలుపుకు తాళంవేసి వుంటారని అతడు గ్రహించాడు.

నిమిషాలు గడిచిపోతున్నాయి. ఎడంవైపున మరో తలుపు అతడికి కనిపించింది. తలుపు తెర్చుకుని చీకటిగా

వున్న ఆ గదిలోకి వెళ్ళాడతను. క్షణకాలం నిశ్శబ్దంగా నిలబడ్డాడు.

ఆ గదిలో కూడా మనుషులు లేరని అతడు గ్రహించి టార్చి బటన్ నొక్కాడు. గదిలో నాలుగు స్టీల్ రాక్స్ వున్నాయి. రాక్స్‌నిండా విస్కీ, బ్రాండీ, రమ్, బీర్ బాటిల్సు వున్నాయి.

గదిలో టేబుల్సు, చుట్టూ కుర్చీలు వున్నాయి. ఒక టేబుల్ మీద రెండు గ్లాసులున్నాయి. అది బార్ రూమ్ కావచ్చు!

అతడా ఎదుటిగుమ్మం వైపు వెళ్ళాడు.

తలుపును లాగాడు. అటు వైపు గదిలో జీరోవాట్ బల్బ వెల్తుతోంది. ఫోమ్ బెడ్ మీద ఎవరో పడుకుని గుర్రు పెడుతున్నాడు.

పిస్టల్ని చేతో పట్టుకుని అతను మంచందగ్గరకు వెళ్ళాడు. మంచం పక్కనున్న టీపాయి మీద షైవ్ వుంది. నిద్రపోతున్నతడివంక అతడు పరీక్షగా చూశాడు.

సందేహంలేదు! నాగిన్ అతడే!

# 10

బులెట్ తన వాచ్ వైపు చూశాడు. అప్పుడే 25 నిముషాలు దొర్లిపోయాయి, అతడు గోడమీదున్న స్విచ్‌ని నొక్కాడు. ఫ్లోరసెంట్ లైట్ వెలిగింది.

నాగిన్ యిటూ అటూ దొర్లి లేచి కూర్చున్నాడు. ఎదురుగావున్న బులెట్ వైపు చూసి అతడు కళ్ళు చిట్లించాడు.

"మిస్టర్ ఎవరు నువ్వు? పిస్టల్‌తో వచ్చావు, ఏం కావాలి? డబ్బా?" అడిగాడు నాగిన్.

"లేచి నిలబడి చేతులెత్తు!" అన్నాడు బులెట్.

"నీతో నేను యుద్ధం చేయను. నీకు కావలసింది ఇచ్చి పంపిస్తాను" అన్నాడు నాగిన్.

"నాకు కావలసింది నువ్వు యివ్వలేవు!"

"అడిగి చూడు తెలుస్తుంది!" అన్నాడు నాగిన్ నవ్వుతూ.

"నువ్వు చంపించిన ఇండియన్ గూఢచారులు ముగ్గురూ నాకు కావాలి!" అన్నాడు బులెట్.

నాగిన్ పకపక నవ్వాడు. పరుపు కిటూ, అటూ దేని కోసమో అతను వెతుకుతున్నాడు.

"నీ పైప్ యిటువైపుంది! కదిలితే షూట్ చేస్తాను! డోంట్ మూవ్!" అరిచాడు బులెట్.

నాగిన్ పైప్ అందుకున్నాడు. వెలిగించి, పొగ పీల్చి నడుస్తూ బులెట్ వంక చూశాడు.

"మిస్టర్ ఆ గూఢచారులను నేను చంపించలేదు. వాళ్ళు తప్పులుచేసి ప్రాణాలను బలిచ్చుకున్నారు. పిండారిస్తాన్ గురించి వాళ్ళు రహస్యాలను సేకరిస్తున్నారు. మాకు దొరికారు. గూఢచారులను చంపడం న్యాయమేగా?"

"ఈ క్షణంలో నువ్వు నాకు దొరికావు. నిన్ను నేను చంపడం న్యాయమేగా?" అడిగాడు బులెట్.

నాగిన్ కిందకు దిగి నిలబడ్డాడు. పైజామా, స్లాక్‌లో వున్నాడతను. నోట్లో పైప్ వుంది.

"మిస్టర్ నువ్వు ఇండియన్‌లా వున్నావు. పక్క గదిలో బార్ వుంది. డ్రింక్స్ సేవిస్తూ మాట్లాడుదాం. మీ దేశంమీద నాకు శత్రుభావం లేదు. మీ గాంధీజీని గురించి నేను తల్చుకుంటూవుంటాను, ప్రతిరోజూ! గ్రేట్ మాన్! ఆ దేశం నుంచి వచ్చిన నువ్వు వావైపు

పిస్టల్ గురిపెట్టడం విచిత్రంగా వుంది. కమాన్ మై ఫ్రెండ్, తాగుతూ మాట్లాడుదాం" అన్నాడు నాగిన్.

"మిస్టర్ నాగిన్, నేనిక్కడకు డ్రింక్స్ కోసం రాలేదు. నా కసి తీర్చుకోడానికి వచ్చాను."

"నన్ను చంపితే కసి తీరుతుందా?"

"కొంతవరకు!" అన్నాడు బులెట్.

నాగిన్ తీయగా నవ్వాడు.

బులెట్ వైపు అతడు కదులుతున్నాడు.

"కదలకు కదిలేచస్తావు!"

"నీకేం కావాలో చెప్పు!"

"ఇండియన్ గూఢచారులను ఎత్తుకుపోయి చంపడం మానాలి!"

"అంతేనా! ఇటుపైన ఇండియన్ గూఢచారులు యీ దేశంలో మామూలుగా చావరు. మరెవరేనా చంపితే బాధ్యత నాది కాదు. నేను నీకు హామీ యిస్తున్నాను."

"నిన్ను పైలోకానికి పంపేస్తే మా వాళ్ళకు యే ప్రమాదమూ యిటుపైన వుండదు!" అన్నాడు బులెట్.

"మిస్టర్, నేను హార్ట్ పేషెంటుని. రేపో, మాపో ఎలాగూ చస్తాను. నన్ను చంపడం నీకు లాభించదు. మరొకడు నా పదవిలోకి వస్తాడు. అతడు చాలా నీకు హామీ యియ్యకపోవచ్చు! నువ్వు యువకుడివి! నామాట మీద నేను నిలబడతాను," అన్నాడు నాగిన్.

"నిన్ను నమ్ముతున్నాను. బార్ రూంలోకి పద!" అన్నాడు బులెట్.

ముందుగా నాగిన్ బార్ రూంవేపు వెళ్ళాడు. లోపలకు ప్రవేశించాడు. లైటు వెలిగించి, లైటు పక్కనున్న మరో బటన్‌ని అతడు నొక్కాడు.

గదిలోకొచ్చిన బులెట్ అతడివైపు సూటిగా చూశాడు.
"ఆ బటన్ ఎందుకు నొక్కావు?" అడిగాడు బులెట్.
"లైట్ స్విచ్ పక్కనే వుంది. పొరబాటున నొక్కాను. లెటస్ సెలిబ్రేట్!" అన్నాడు నాగిన్.
రెండుగ్లాసుల్లో విస్కీపోసి, సోడా కలిపాడతను, తలుపులు తెరిచిన చప్పుడయింది. ఇరవయిమంది గుమ్మం లోంచి లోపలకు వస్తున్నారు.
బులెట్ మూడుసార్లు ట్రిగ్గర్ నొక్కాడు. ఇరవయి మంది వెనక్కి పరిగెత్తారు. నాగిన్ వేపు చూశాడు బులెట్. అతడిచేతుల్ని వెనక్కిలాగి బిగించి తన ఎడం చేత్తో పట్టుకున్నాడు.
"యూ డర్టీ స్కంక్!" అని అతడి తలమీద పిస్టల్ పిడిలో తట్టాడు.

"ప్లీజ్, నన్ను చంపకు!" అన్నాడు నాగిన్.
"నిన్ను చంపను! నే నిక్కడనుంచి బయటకెళ్ళాలి! నువ్వు నాముందు నడువు! నీవెనక నేనొస్తాను"అన్నాడు బులెట్.

నాగిన్ మెల్లగా బయటకు కదిలాడు. నడవలో ఇరవయిమంది వున్నారు.
"వాళ్ళను పొమ్మను!" అరిచాడు బులెట్.
"ఫ్రెండ్స్, మీరు దూరంగాపొండి! మీరు ఏదేనా చేస్తే నేను చస్తాను" అన్నాడు నాగిన్.

వాళ్ళు దూరంగా కదిలారు. నడవ మధ్యలో మెట్లు వున్నాయి. నాగిన్, వెనకనే బులెట్ మెట్లమ్మట కిందకు దిగాడు. అన్ని లైట్లూ వెలుగుతున్నాయి.
ముందు గుమ్మంలోంచి వాళ్ళు బయటకు చేరుకున్నారు.

దూరంగా గేటు కనిపిస్తోంది. వాచ్‌మన్ పచార్లు చేస్తున్నాడు.

నాగిన్ మెల్లిగా చెట్లమధ్యనుంచి ప్రహరీగోడ దగ్గరకు వెళ్ళాడు. వెనకనే వున్నాడు బులెట్. ఇరవయి మంది ఆయుధాలతో దూరంగా వున్నారు.

"వాళ్ళను భవనంలోకి పొమ్మను!" అన్నాడు బులెట్.

"భవనంలోకి పొండి," ఆర్డరిచ్చాడు నాగిన్.

ఇరవైమందీ వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు. బులెట్ పళ్ళు పటపట కొరికాడు.

"నువ్వు గాంధీజీ భక్తుడవుగా! ఆయన దగ్గరకు నిన్ను పంపిస్తున్నా" అన్నాడు బులెట్.

"నన్ను చంపకు, ప్లీజ్!" అన్నాడు నాగిన్.

"నిన్ను నమ్మలేను. నన్ను డ్రింక్స్‌కి రమ్మని బటన్ నొక్కి నీ అనుచరులను రప్పించావు! నీలాంటి పిశాచాలు జీవించివుండకూడదు!"

రెండుసార్లు ట్రిగర్ నొక్కాడు బులెట్. నాగిన్ అరుస్తూ నేలమీద కూలిపోయాడు. టార్చికాంతిలో అతనివైపు చూశాడు.

నాగిన్ రక్తంమడుగులో వున్నాడు. పైప్ పక్కనే పడుంది.

బులెట్ ప్రహరీగోడ ఎక్కి అటువైపుకు దూకాడు. గబగబా రోడ్డువైపు నడిచి తన కారుదగ్గరకు చేరుకున్నాడు.

రాజన్ పరుగెత్తుకొచ్చాడు.

"ఏమైంది?" అడిగాడు రాజన్.

"ఇక్కడ నుంచి వెంటనే పారిపోదాం, పద!" అన్నాడు బులెట్.

ప్లిమత్ కారు రోడ్డమ్మట దూసుకుపోయింది. వెనకనే రాజన్ మోరిస్ కారులో వెంబడించాడు.

హోటల్ హిమాలయా కాంపౌండులో రెండుకార్లూ ఆగాయి. లోపలకెళ్ళి బులెట్ తన ఏర్ బాగ్ తో తిరిగి వచ్చాడు. మోరిస్ కారులో కూర్చుని అతడు తలుపు మూశాడు.

"తొందరగా ఏర్ పోర్ట్ కి పద!" అన్నాడు బులెట్.

రాజన్ మోరిస్ కార్ని వేగంగా ఏర్ పోర్ట్ వైపు పోనిచ్చాడు.

దూరంలో ఏర్ పోర్ట్ లైట్లు కనిపిస్తున్నాయి. జరిగినదంతా బులెట్ తన మిత్రుడికి చెప్పాడు.

"మిస్టర్ రాజన్, ముసం పిరికిపందలంకామని వాళ్ళకు ప్రదర్శించాను. ఇటుపైన వాళ్ళు ఇండియన్స్ దగ్గరకు రాదు!" అన్నాడు బులెట్.

"నా మీద వాళ్ళు కసి తీర్చుకుంటారు!" అన్నాడు రాజన్.

"మీ మీద వాళ్ళకు కసి ఏర్పడదు! నాగిన్, చెంగీజ్ లాటి దుర్మార్గులు పోయినందుకు ఎవ్వరూ విచారించరు. వాళ్ళను గురించి లోకం మర్చిపోతుంది. నాగిన్ స్థానంలోకి వచ్చే కొత్తవ్యక్తి ఇండియన్సును భయంతో చూస్తాడు," అన్నాడు బులెట్.

ఏర్ పోర్ట్ లో కారాగింది.

"ఇప్పుడు ఇండియాకు వెళ్ళే విమానం లేదు," అన్నాడు రాజన్.

"ఇది రగడా దేశం. డబ్బిస్తే యిక్కడ ఏదైనా దొరుకుతుంది. స్పెషల్ చార్టర్డ్ ప్లేనులో ఇండియాకు పోతాను," అన్నాడు బులెట్.

"యూ ఆర్ రైట్! పోలీసులకు ఏదేనా తెలిసేలోగా నువ్వు యీ దేశం నుంచి పోవడం మంచిది," అన్నాడు రాజన్.

మరోగంటలో స్పెషల్ చార్టర్డ్ ప్లేన్ రన్ వే మీద పరుగెత్తుతూ పైకిలేచింది. వరండాలో నిలబడి రాజన్ ప్లేన్ లైట్లవైపు చూశాడు.

కొంతసేపయ్యాక లైట్లు దూరంలో మాయమయ్యాయి. రాజన్ ధైర్యంగా తన మోరిస్ కారువైపు అడుగులు వేశాడు.

—:ఐపోయింది:—

# పెయింటింగ్ కోసం పోరాటం!

**'సికిందర్'**

రమేష్‌కుమార్ కిటికీ అవతల తుప్పుపట్టిన వుమ్మి కిందకి తొంగి చూశాడు.

హోటల్ ఇరోస్ తొమ్మిదవ అంతస్తునుంచి కింద రోడ్డుమీద జనం చీమల్లా కన్పిస్తున్నారు, వాహనాలు ఆట బొమ్మల్లా కన్పిస్తున్నాయి...

నవ్వుకున్నాడు రమేష్‌కుమార్. ఆ వుమ్మి ఎవరిమీద పడిందో? అంతలోనే చిరాగ్గా వెనక్కి తిరిగి సిగరెట్టు వెలిగించాడు. ప్చ్, తానలా వుమ్మి వుండవలసిందికాదు!

రమేష్‌కుమార్‌కి 26 ఏళ్లు. ఎర్రగా, సన్నగా,పొడుగ్గా వుంటాడు. పొడవాటి వెంట్రుకలు. అతనిది ఫోటోజెనిక్ ముఖమయినా క్రూరత్వం కన్పిస్తుంది. కోపం ఇట్టే వస్తుంది. కోపం వచ్చినప్పుడు ఎదుట యెవరున్నా పిడికిలి బిగించి గుద్దేస్తాడు. అతని కళ్ళలో క్రూరత్వం, కసి చూస్తే ఎవరయినా వెనక్కి తిరిగి పరిగెడతారు, లేదా కాళ్ళమీద పడతారు.

అతని కసివెనక చాలాకథ దాగివుంది.

రమేష్‌కుమార్ హైదరాబాద్‌కి వచ్చి సంవత్సరంన్నర గడిచింది. ఎమర్జెన్సీ రోజుల్లో అతను బొంబాయిలో స్మగ్లింగ్ బిజినెస్‌లో వుండేవాడు. అతని చిన్నతనం లోనే తలిదండ్రులు వరంగల్ విడిచి బొంబాయిలో స్థిర పడ్డారు. తండ్రి ఒక ప్రయివేటు కంపెనీలో హోదాగల ఉద్యోగంలో వుండేవాడు — కుమార్‌కి ఇపుడు తలి దండ్రులు లేరు.

రెండేళ్ళక్రితం, గ్రాడ్యుయేషన్ చేస్తున్న రోజుల్లో అతను ఆ ఒక్క తప్పటడుగు వేసివుండకపోతే, అతని తలిదండ్రులు చావుకి గురయేవారు కాదు, తానిలా వంటరి వాడు అయ్యేవాడూ కాదు!

ఒక అమ్మాయి—వయసు పద్దెనిమిది, అందమయిన రూపం, అతని క్లాస్‌మేటు—తర్వాత తెలిసింది కాల్ గర్ల్ అని—అతన్ని ఆకర్షించి, ప్రేమించి, ఆ తర్వాత తెలివిగా మోసంచేసి; బ్లాక్ మెయిల్‌లో యిరికించి స్మగ్లర్లకి అప్పగించింది...

ఎమర్జెన్సీ రోజుల్లో స్మగ్లింగ్ వ్యవహారాల్ని అరి కట్టేందుకు పటిష్టమయిన కట్టుదిట్టాలు చేయడం వలన ఇద్దరు ఘరానా స్మగ్లర్స్ ఒకపథకం ఆలోచించి అందుకు కుమార్‌ని యెన్నుకున్నారు. అసభ్యకరమయిన ఫోటో లతో కుమార్‌ని బ్లాక్ మెయిల్‌లో ఇరికించి, బెదిరించి లొంగదీసుకున్నారు.

బాంబే-గోవా రోడ్డుమీద దొంగరవాణా సాగకుండా చెక్‌పోస్టులు కఠినపద్ధతులు అవలంబించాయి. కుమార్ తండ్రి పనిచేసే కంపెనీవాన్ ప్రతివారం సరకులతో గోవా వెళుతుంది.

ఆ వాన్‌లో స్మగ్లింగ్ చేయాలని నిశ్చయించారు స్మగ్లర్స్.

ఈరహస్యం కుమార్ తండ్రికి తెలియకుండా జాగ్రత్త పడ్డారు. వాన్ డ్రయివరు సరుకును గోవాలో డెలివరీ చేశాక ఖాళీ వానుతో వస్తాడు. ఆ వానులో కంపెనీకి సంబంధించిన అదేరకం అట్టపెట్టెల్లో స్మగ్లింగ్ చేయడానికి కుమార్‌చేత డ్రయివర్‌ని ఒప్పించారు.

వాన్ బొంబాయినుంచి బయలదేరడానికి ఒకరోజు ముందు కుమార్ కారులో తనే డ్రయివ్ చేసుకొంటూ గోవా వెళ్ళాలి. అతని దగ్గర కంపెనీకి చెందిన అధికార పత్రాలు వుంటాయి. అవి నకిలీపత్రాలు. వాటి సహాయంతో అతను గోవా డీలర్స్‌వద్ద కంపెనీకి చెందిన ఖాళీ అట్టపెట్టెల్ని సేకరించి మూల్యం చెల్లించాలి.

ఆ పెట్టెల్ని అక్కడి స్మగ్లర్‌కి అప్పగించి, వాను కోసం ఎదురు చూస్తూండాలి. ఈలోపు పెట్టెల్లో సరుకు ప్యాక్ చేస్తారు. వ్యానువచ్చి డెలివరీ ఇచ్చాక యీ పెట్టెల్ని ఎక్కించాలి—ఆ తర్వాత తిరిగి బొంబాయికి వచ్చేయాలి—ప్రతిఫలంగా వెయ్యిరూపాయలు తీసుకోవాలి.

చేసేపని చట్టవిరుద్ధ మయినా, చాలా సులువుగా వూహించని డబ్బువచ్చి చేతిలోపడుతోంటే, ఆ వృత్తికి చాలా త్వరగా అలవాటు పడ్డాడు కుమార్. కానీ, ఎవరినీ ఎల్లకాలం మోసగించలేము. ఆరునెలలు విచ్చల విడిగా సాగుతోన్న స్మగ్లింగ్ బిజినెసులో ఒకానొక రోజు దుర్దినమయింది.

కుమార్ తండ్రి రెండురోజులు విశ్రాంతిగా గడపాలని భార్యతోకలసి గోవా వెళ్ళాడు. ఇది యెవరూ వూహించలేదు!

అతనెప్పుడూ గోవా వెళ్ళలేదు. అంతకు క్రితంరోజా కుమార్ గోవాలో వున్నాడు! కుమార్ తండ్రి గోవా వెళ్ళినట్టు బొంబాయిలోవున్న స్మగ్లర్స్‌కి తెలియదు.

తండ్రిరాక కుమార్‌ని కలవర పరచింది. అతను కలవర పడకముందే రెడ్ హాండెడ్ గా పట్టుబడ్డాడు-డీలర్స్ వద్ద అట్టపెట్టెల్ని సేకరిస్తూ!

కుమార్ వ్యవహారం తండ్రికి అనుమానం కల్గించింది. అట్టపెట్టెల్ని సేకరించడంలోని మర్మం డీలర్స్‌కి తెలిసి పోయింది. ఇక విధిలేక కుమార్ అన్నిటికీ సిద్ధపడి యీ బిజినస్ గురించి తండ్రితో చెప్పేశాడు.

క్షణాలమీద యీ వ్యవహారం స్మగ్లర్స్‌కి తెలిసి పోయింది. నిమిషాల్లో గోవాలోవచ్చి వాలి కుమార్ మీదా, అతని తండ్రిమీదా, తల్లిమీదా గుళ్ళవర్షం కురి పించారు.

తల్లీ, తండ్రీ చూస్తూండగానే ప్రాణాలు కోల్పో యారు. బ్రతికి బయటపడిన కుమార్ నిశ్చేష్టుడయి పోయాడు. తలిదండ్రుల శవాల్ని అక్కడే వదిలేసి పోలీసుల నుండి తప్పించుకుని బొంబాయి చేరుకున్నాడు.

చట్టంతో అతనికిప్పుడు నిమిత్తంలేదు. తలిదండ్రుల్ని హతమార్చిన హంతకుల్ని హతమార్చాలి. వారిని యే చట్టమూ శిక్షించే హక్కులేదు. తన స్వహస్తాలతో కసి దీరా కాల్చిచంపి శిక్షించాలి!

అందుకు ఎక్కువకాలం పట్టలేదు. రెండేరెండు రోజులు! ఆ ఇద్దరు స్మగ్లర్స్ బీచీలో కూచోని సిగరెట్స్ తాగుతోండగా కుమార్ మాటామంతీ లేకుండా మెరుపు దాడి చేసి శవాల్ని సముద్రంలో కలిపేశాడు.

అంతటితో అతని జీవితంలో ఒక ఘట్టం ముగిసింది.

అప్పటివరకు అతనిలోవున్న చం. కీతనం, సభ్యత, సంస్కారం, గౌరవమర్యాదలన్నీ మాయమయ్యాయి. ముఖంలో కసి, కళ్ళలో క్రూరత్వం చోటు చేసుకున్నాయి.

బొంబాయిలోని దగాకోరు వాతావరణంలో వుండేందు కతనికి మనస్కరించలేదు. వెంటనే హైదరాభాదుకు మకాం మార్చాడు.

రమేష్‌కుమార్ టైం చూసుకున్నాడు.

సాయంత్రం నాలుగున్నరయింది.

కుమార్ సిగరెట్టు పూర్తిగా కాలేవరకు తాగి కిటికీ అవతల విసిరి బాత్‌రూంలో దూరాడు. పదినిముషాలు తర్వాత స్నానం ముగించి గదిలోకొచ్చాడు.

ఇప్పుడు సమయం 4 : 45 అయింది.

సరిగ్గా అయిదు గంటలకు...

సరిగ్గా అయిదు గంటలకి హోటల్ కాన్ఫరెన్స గదిలో జరగబోయే తతంగంలో తను హాజరవ బోతున్నాడు.

కుమార్ గదిబయటికి నడిచి తలుపు తాళం వేశాడు. ఆ తర్వాత పెద్దపెద్ద అంగలేస్తూ కారిడార్‌లో నడక సాగాడు.

## 2

యావత్ హోటల్‌లోని కుర్చీలన్నీ కాన్ఫరెన్స హాల్‌కి తరలించినట్టుంది...ఎక్కడా అంగుళం ఖాళీస్థలం లేదు. హాలుకెపాసిటీకి మించి జనం క్రిక్కిరిసివున్నారు...

వాళ్ళలో స్త్రీలూ వున్నారు, పురుషులూ వున్నారు.

హాల్‌లో అత్యంత శక్తివంతమైన దీపాలు పది కాంతిని వెదజల్లుతున్నాయి. సీలింగ్‌కి వేలాడుతున్న పన్నెండు ఫ్యాన్స గాలిని విసురుతున్నాయి. సుమారు

అయిదు వందలమంది ఒకేచోట చేరినా ఎవరి ప్రపంచం వారిదిలా వుంది...వాళ్ళ ప్రవర్తన. ఆడవాళ్ళ శరీర సువాసనలతో,మగవాళ్ళ సిగరెట్ల వాసనలతో వాతావరణం భరింపరానిదిగా తయారయినట్టు తోచింది కుమార్‌కి.

అతను లోనికి వెళ్ళలేదు. ప్రవేశద్వారం దగ్గర నిలబడి లోపలి తతంగం తిలకిస్తున్నాడు.

హాలుకి ఇరువేపులా అర్ధచంద్రాకారంలో కుర్చీలు వేయబడ్డాయి. హాలు ప్రవేశద్వారానికి అభిముఖంగా స్టేజివుంది. స్టేజిమీద సూటులోవున్న ఒక పొట్టిమనిషి మైక్ ముందు నిలబడివున్నాడు. అతని కుడిపక్కన ఎత్తైన స్టాండుకి ఒక కాన్వాస్ పెయింటింగ్ అమర్చివుంది. పెయింటింగ్ కొలతలు 3 × 2½.

మైక్ ముందు నిలబడ్డమనిషి మాటిమాటికి నెక్ టై సవరించుకుంటున్నట్టు కన్పిస్తున్నాడుగానీ, వాస్తవానికి అతను గొంతు సవరించుకుంటున్నాడు.

స్టేజికి నలువేపులా నలుగురు పోలీసు అధికారులు రివాల్వర్స్ సిద్ధంగా పట్టుకుని అప్రమత్తతతో వున్నారు. హాలులో అక్కడక్కడ మఫ్టీలోనూ, యూనిఫాంలోనూ మరికొందరు అధికారులున్నారు.

కుమార్ గడియారం చూసుకున్నాడు. 4:55.

"రోజురోజుకీ ధనికులు పెరిగిపోతున్నారు. పనికిరాని ప్రతి చెత్తవస్తువు విలువ పెరిగిపోతోంది!" గొణుక్కున్నాడతను. "అరికట్టాలి! ఎవర్ని? దేన్ని? ధనికులనా? చెత్తవస్తువులనా?"

"ఎక్స్‌క్యూజ్ మీ," విన్పించాయి మాటలు.

కుమార్ తిరిగి చూశాడు.

ముఖాఫైపోళ్ళ ఓ యువకుడు నవ్వుతూ చూస్తున్నాడు. తెల్లటి శరీరం, అక్కడక్కడ నెరిసిన వెంట్రుకలు.

"యస్ ప్లీజ్?" కుమార్ అడిగారు.

"ఎక్స్‌క్యూజ్ మీ," మళ్ళీ అని నవ్వాడా యువకుడు, "మీ రెవరిలో మాట్లాడుకున్నారు? ఇక్కడెవరూ లేరు."

"స్వాగతం, మిస్టర్" కుమార్ అన్నాడు. "అంత రాత్మతో మాట్లాడుతున్నాను."

మళ్ళీ నవ్వాడా యువకుడు.

"ఎందుకలా నవ్వుతావ్?" కుమార్ అన్నాడు చిరాగ్గా.

ఆ యువకుడి చిరునవ్వు అదృశ్యమై ముఖం ఎర్రబడింది. కొన్ని క్షణాల తర్వాత అతను తేరుకుని జేబులోంచి ఒక కార్డుతీసి అందించాడు. కుమార్ అతన్ని తీక్షణంగా చూసి కార్డు చదివాడు.

"గ్లాడ్‌టు మీట్యూ మిస్టర్ దివాకర్," కుమార్ అన్నాడు చెయ్యి ముందుకి చాచి. "నీ పార్ట్‌నర్స్ ఏరి?"

"లోపల వున్నారు..."

"నువ్విక్కడెందుకున్నావ్?"

దివాకర్ నోరు తెరిచి చెప్పేలోపున హాలులో స్టేజి మీదవున్న మనిషి గొంతు ఖంగుమంది.

"లేడీస్ అండ్ జంటిల్‌మెన్! ఇప్పుడు సమయం సరిగ్గా అయిదుగంటలు! ఇంకా ఆలస్యం చేయడంలో అర్థంలేదు! మీ అందర్నీ యిక్కడ ఆహ్వానించడం మాకెంత ఆనందంగా వుందంటే... చెప్పడానికి...మాటలు చాలవు!"

అతని మాటలు తడబడ్డాయి.

"మీ అందర్నీ సమావేశపర్చిన ఈ శుభసందర్భంలో ఒక గొప్ప కళాఖండాన్ని ప్రదర్శించడానికి మేం గర్వ పడుతున్నాం. ఈ అపూర్వ కళాఖండం గురించి మీరు పత్రికల్లో చదివివుంటారని మా విశ్వాసం! ఈ అపూర్వ మైన పెయింటింగ్‌ని మీ సమక్షంలో వేలంవేయడానికి నిశ్చయించామని తెలియజేయడానికి మిక్కిలి సంతోషిస్తున్నాం...

"ఆహ్వానితులందరూ ఈ కార్యక్రమంలో ఉత్సా హంగా పాల్గొని, ఒక అపురూపమైన, పురాతనమైన, అరుదైన ఈ పెయింటింగ్‌కి సరైన విలువ ఆపాదించ గలరని ఆశిస్తున్నాం. కార్యక్రమం ప్రారంభించేముందు ఈ పెయింటింగ్ గురించి కొన్ని మాటలు..."

ఆ పెయింటింగ్ పుట్టుపూర్వోత్తరాలు పూర్తిగా తెలిసినా కుమార్ ఆసక్తిగా వింటున్నాడు. అతని పక్కన నిలుచున్న వ్యక్తి దివాకర్ అందర్నీ జాగ్రత్తగా గమనిస్తూ, మధ్యమధ్యలో కుమార్‌ని అనుమానిస్తూ కాలక్షేపం చేస్తున్నాడు. అనుమానించడం అతని విధి నిర్వహణలో ఒక అంశం. తన ఇద్దరు సహ డిటెక్టివ్‌లతో అతను బెంగుళూరు నుంచి ఇక్కడికి వచ్చాడు.

స్టేజిమీది నుంచి వాళ్ళు పెయింటింగ్ గురించి చెప్తున్న వివరాలు అందరూ నిశ్శబ్దంగా వింటున్నారు...

ఆ పెయింటింగ్‌ని ఎవరో కట్టెలు కొట్టుకునే అనా మకుడు మైసూర్ అడవుల్లో ఒక పాడుబడ్డ ఇంట్లో కను గొన్నాడు. ఇది జరిగి పది సంవత్సరాలయింది. ఆ పెయిం టింగ్‌ని అతను ఓ షావుకారుకి పదిరూపాయలకమ్మి చేతులు దులుపుకున్నాడు. ఆ పెయింటింగ్ ఆ షావుకారు చేతిలోంచి తిరిగి ఒక కాంట్రాక్టరు చేతిలోకి మారింది— కాంట్రాక్టరు వందరూపాయలు చెల్లించాడు.

ఆ తర్వాత రెండేళ్ళకి అది కంట్రాక్టర్ చేతిలోంచి మహారాష్ట్రంలో ఒక మార్వాడీ సేఠ్ కి చేరింది—వెయ్యి రూపాయలకి...

అలా పదేళ్ళు-అదలా చేతులు మారుతో నేవుంది గానీ, ఆ పెయింటింగ్ విశిష్టత ఎవరికీ తెలియదు. వా స్తవానికి ఆ పెయింటింగ్ కర్ణాటక రాష్ట్రానికి చెందిన పంతొమ్మిదవ శతాబ్దపు ప్రఖ్యాత చిత్రకారుడు కాయినాథ్ వేశాడు. ఆ పెయింటింగ్ పేరు 'ఒందు బెళదింగళ కతల్ హొగతె' అంటే 'ఒక వెన్నెల రాత్రి.'

కాయినాథ్ చిత్రాలు ఆ కాలంలోనే గుర్తింపు పొందాయి. నేడు వాటికి చాలా గిరాకీవుంది. అదృష్ట వశాత్తున ఈ పెయింటింగ్ ని కళలమీద అభిరుచివున్న ఓ ఆసామీ మార్వాడీ సేఠ్ దగ్గర చూడ్డం జరిగింది. అతన్ని బ్రతిమాలి ఎలాగో దాన్ని అయిదువేలకి సంపాదించగలిగాడు. దానిమీద విశేషంగా డబ్బు గడించాలన్న ఆశతో ఈ రోజు వేలంలో ప్రవేశపెట్టాడు...

నూటువాలా ప్రసంగం ఇంకా సాగుతో నేవుంది.

కుమార్ దివాకర్ వేపు తిరిగాడు. దివాకర్ చటుక్కున కుమార్ మీంచి చూపులు తప్పించి దిక్కులు చూడసాగాడు.

"ఓ.కే, మిస్టర్" కుమార్ అన్నాడు, "నువ్వు నా ప్రశ్నకి సమాధానం యివ్వలేదు."

"నేనిక్కడెందుకున్నానని మీరడిగారు. ప్రొటెక్షన్ ఈజ్ మై బిజినెస్" అన్నాడు దివాకర్.

"దేన్ని ప్రొటెక్ట్ చేస్తావ్?"

"ఆ పెయింటింగ్ ని."

కుమార్ అతన్ని అదోలా చూశాడు, "నువ్వు పోలీసుల తరఫున వచ్చావా?"

"కాదు. మిస్టర్ జీవన్ రావ్ మమ్మల్ని నియమించారు. ఆ పెయింటింగ్ ని ఆయన ఆక్షన్ లో తప్పక కొంటారు. మేం సురక్షితంగా మద్రాసుకి చేరవేయాలి" దివాకర్ అన్నాడు.

"మిస్టర్ జీవన్ రావ్ ఎవరు?"

దివాకర్ చూపించాడు: "కుడివేపు ముందువరస, సేజిదగ్గర మూడవమనిషి—ఆయన పక్క నేవున్నది ఆయన భార్య గాయత్రీదేవి... కన్పించారా?"

కుమార్ ఆ ఇద్దర్నీ చూశాడు. జీవన్ రావ్ అనే ఆ మనిషికి యాభైఏళ్ళుంటాయి. తెల్లటి శరీరం. బట్టతల. సూటులో వున్నాడు. చేతిలో సిగార్ వుంది. అతని భార్య గాయత్రీదేవికి నలభయి ఏళ్ళుంటాయి. జీవన్ సైజుకి తగ్గట్టువుంది. ఆమె అలంకారం, ముఖంలో చిరునవ్వు, చలాకీతనం చూసి కుమార్ ఆమె గురించి దివాకర్ ని ఇంకా అడిగి తెలుసుకున్నాడు.

దివాకర్ గాయత్రీదేవి గురించి చెబుతూ సాయం కాలం సమయాల్లో ఆమెలో ముప్పైఏళ్ళు కన్పిస్తాయని చెప్పాడు.

కుమార్ ఆసక్తిగా విని, "ఓ.కే మిస్టర్ డిటెక్టివ్. నువ్వు నన్ను 'మీరు' అని పిలవనవసరంలేదు. గౌరవ మర్యాదలంటే నాకు చిరాకు" అన్నాడు.

దివాకర్ వెంటనే నవ్వి, "అయితే నీ పేరేమిటి?" అనడిగాడు.

"రమేష్ కుమార్—అందరూ నన్ను ఆర్కే అని పిలుస్తారు.

దివాకర్ తలూపాడు.

"ఓ.కే మిస్టర్. జీవన్ గురించి చెప్పు."

"ఎందుకు?"

"నాకో ఆలోచన వుంది. ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పు: ఆ పెయింటింగ్ ని అతను తప్పక కొంటాడా?"

"కొంటాడు. ఆయన ఏది తలచుకున్నా చేస్తాడు. అందులోనూ ఆయన గొప్ప కళాపోషకుడు! ఎటువంటి పరిస్థితిలోనూ ఆ పెయింటింగ్ ని జారవిడుచుకోడు— పందెం కడతాను!"

"అయితే ఆయనతో చెప్పు—ఆ పెయింటింగ్ ని సురక్షితంగా మద్రాసుకి చేరవేసే బాధ్యత నేను తీసుకుంటాను."

"నువ్వా!"

"ఆశ్చర్యపోకు. భయపడకు—మిస్టర్ ఆర్కే ఎవరో ఈ సిటీలో తెలియని వారున్నారంటే వాళ్ళకి చార్మినార్ కూడా తెలియనట్టే లెక్క! చార్మినార్ లేని హైద్రాబాదు నెలా వూహించలేరో, ఆర్కే లేని హైద్రాబాదూ అంతే! వాకబు చేసుకో."

"నేనీ సిటీకి కొత్తని—నీ గురించి తెలియదు."

తన గురించి వివరించి చెప్పాడు కుమార్.

"ఆ పెయింటింగ్ ని చేరవేసే బాధ్యత మాకప్పగించబడింది. మరి నీ అవసరం ఏముంది?" దివాకర్ అన్నాడు అంతా విని.

"ఆ పెయింటింగ్ ని మీరు రక్షించలేరు—కాబట్టి నా అవసరం వుంది."

"ఆశ్చర్యంగా వుంది! మా సామర్థ్యాన్ని ఎవరూ తక్కువ అంచనా వేయలేదు. ఎలర్ట్ డిటెక్టివ్ ఏజెన్సీకి బెంగుళూరు నుంచి మద్రాసువరకు చాలా పేరు ప్రఖ్యాతులున్నాయి--"

"ఉండవచ్చు. కానీ ఈ సిటీలో మీ పప్పులుడకవు!"

"ఎందుకని?"

"అలా చూడు!" కుమార్ చూపిస్తూ అన్నాడు, "సరిగ్గా జీవన్ ఎదురుగా కూర్చున్న టోపీవాలా ఎవరను కున్నావ్?"

"ఎవరు?"

"సేఠ్ ధరమ్‌చంద్" కుమార్ అన్నాడు. "సిటీలో పెద్ద బిజినెస్ మాగ్నెట్. ఈ హోటల్ అతనిదే. ఈ హోటల్‌లో ప్రపంచంలోని సమస్త అవినీతి కార్య కలాపాలన్నీ జరుగుతాయి. స్మగ్లింగ్, గాంబ్లింగ్, వ్యభి చారం, హత్యలు—"

కుమార్ అకస్మాత్తుగా మాటలాపేశాడు. అతని దృష్టి హాల్లో, స్టేజిమీదకి మళ్ళింది.

"...ఓకే! లేడీస్ అండ్ జంటిల్మన్!" స్టేజిమీది మనిషి అంటున్నాడు. "ఇక అసలు కార్యక్రమంలోకి దిగుదాం. ఈ పెయింటింగ్ ప్రాముఖ్యత ఏమిటో మీకు వివరించాను. ఇంతటి అపూర్వ కళాఖండాన్ని పొందే సదవకాశం మీ అందరికీవుంది. అదృష్టాన్ని పరీక్షించు కోండి. ఓపెనింగ్ ఆఫర్ ప్రకటించండి!"

ఒక్క నిమిషం సూదిపడితే విన్పించేంతటి నిశ్శబ్దం.

ఆ తర్వాత—

"లక్షరూపాయలు!" అరిచారెవరో.

ఎదురెదురుగా కూచున్న జీవన్, ధరమ్‌లు వులిక్కి పడ్డారు. ఆ తర్వాత వెంటనే—

"రెండులక్షలు!" అంది మరో గొంతుక.

"థాంక్యూ మిస్టర్ మిశ్రా!" అన్నాడు ఆక్షనర్.

"మూడు లక్షలు!" జీవన్ గొంతు ఖంగుమంది.

"థాంక్యూ వెరీమచ్ మిస్టర్ జీవన్!" ఆక్షనర్ అరిచాడు.

ధరమ్‌చంద్ ముఖం ఎర్రబడింది. "నాలుగు లక్షలు" శక్తికొద్దీ అరిచాడతను.

క్షణక్షణానికి పెరిగిపోతున్న విలువ అందర్నీ వూపిరి పీల్చుకోకుండా చేసింది.

కుమార్ దివాకర్‌ని చూశాడు. "ఏమంటావ్ మిస్టర్"

"తప్పకుండా అది జీవన్‌కి చెందుతుంది!" ఆందోళనగా అన్నాడు దివాకర్.

"నాలుగులక్షలు! నిజంగా వీరి కళారాధనకి మెచ్చుకోవాల్సిందే!"

హాల్లో మరోగొంతు ప్రతిధ్వనించింది: "నాలుగు లక్షల పాతిక వేలు!"

"నాలుగున్నర!" స్త్రీ కంఠం ఖంగుమంది వెంటనే.

ధరమ్‌చంద్ అరిచాడు, "నాలుగు ముప్పాతిక!"

జీవన్ ముందుకి వంగాడు. అతని ముఖంలో ఆందోళన వుంది.

అతనికళ్ళు పెయింటింగ్ మీద పడ్డాయి.

ఇంతలో ఆక్షనర్ అరిచాడు. "మిస్టర్ ధరమ్‌చంద్ ఆఫర్ — నాలుగులక్షల డెభ్భైఅయిదు వేలు!"

ఎవరూ పలకలేదు.

ఆక్షనర్ మళ్ళీ అన్నాడు, "నాలుగు ముప్పాతిక, మొదటిసారి!"

గాయత్రీదేవి జీవన్‌ని తట్టింది. జీవన్ వెంటనే అరిచాడు. "నాలుగులక్షల తొంభయి వేలు!"

"థాంక్యూ మిస్టర్ జీవన్! నాలుగులక్షల తొంభయి వేలు... నాలుగులక్షల తొంభయి వేలు మొదటిసారి!... నాలుగులక్షల తొంభయి వేలు రెండవసారి—"

"అయిదులక్షలు!" అర్చాడు ధరమ్‌చంద్.

జీవన్ విస్తుపోయాడు.

"అయిదులక్షలు మిస్టర్ ధరమ్‌చంద్!" ఆక్షనర్ అర్చాడు."అయిదులక్షలు!...అయిదులక్షలు మొదటిసారి అయిదులక్షలు రెండవసారి...అయిదులక్షలు రెండవసారి!"

ఎవరూ పలకలేదు. జీవన్ కళ్ళు ధరమ్‌పైన నిశ్చలంగా వున్నాయి.

"అయిదులక్షలు రెండవసారి! ... అయిదులక్షలు... మూడవ_"

"అయిదులక్షల పాతికవేలు!" ప్రతిధ్వనించింది గాయత్రీదేవి కంఠం.

హాఠాత్తుగా నిశ్శబ్దం.

ఆక్షనర్ తేరుకుని గొంతు సవరించుకున్నాడు.

"థాంక్యూ మిసెస్ జీవన్! అయిదులక్షల పాతిక వేలు!"

దివాకర్ గర్వంగా చూశాడు కుమార్‌ని. కుమార్ అతని భుజాన్నిపట్టి "ఎంతఫీజు తీసుకుంటున్నావు?" అని అడిగాడు.

"నేను తీసుకోడంలేదు, ఆయనే యిస్తున్నారు. పదివేలు."

"జీవన్ అంత డబ్బుగలవాడా?"

"ఆయన సినీ ప్రొడ్యూసర్!"

ఆక్షనర్ ఇంకా అరుస్తున్నాడు. "అయిదు లక్షల పాతికవేలు! మిస్టర్ జీవన్‌రావ్! రెండవసారి! రెండవ సారి!...అయిదులక్షల ఇరవై అయిదు వేలు! రెండవసారి"

ఎవరూ పలకడం లేదు! ధరమ్‌చంద్ నిశ్చింతగా చూచున్నాడు. "మూడవసారి!" అని ముగించాడు ఆక్షనర్.

# 3

"అయితే ధరమ్‌చంద్ వల్ల ప్రమాదం వుంటుందంటావా?" అనడిగాడు దివాకర్. అప్పటికి వేలం ముగిసింది. జీవన్‌రావ్ వేలం గెలుచుకున్నట్టు ప్రకటించబడిన మరుక్షణం దివాకర్, కుమార్ హోటల్ ఆవరణలోకొచ్చి నిలబడ్డారు.

కుమార్ చార్మినారు వెలిగించి, "నీకు నమ్మకం కుదరక పోతే వాకబు చేసుకోవచ్చు" అన్నాడు.

"నిన్ను చూస్తోంటే యెందుకో నమ్మాలనిపిస్తోంది మిస్టర్ ఆర్కే!"

"నన్ను నమ్మినవాడిని నేను మోసం చేయను," అన్నాడు కుమార్.

"వెరీగుడ్, అయితే ధరమ్‌చంద్ గురించి చెప్పు. అతని వల్ల ప్రమాదం ఏవిధంగా వుంటుందో వివరించు."

కుమార్ రెండుదమ్ములు లాగి చెప్పడం ప్రారంభించాడు: "నీ వృత్తిలో ఇంతవరకు పరిచయంకాని మోసాలెన్నో ధరమ్‌చంద్‌కి తెలుసు. అతనికి తెలియనిదంటూ ఏదేనావుంటే అది పుణ్యమే. తరగని ఆస్తివుంది; ఐనా నయాపైసా దానం చేయడం అతని పుట్టుకనుంచీ లేదు. బాస్టర్డ్‌కి భార్యవుంది. అయినా చీకటి పడితే బజారులో పడతాడు.

సరే, అసలు విషయానికొద్దాం. నలుగురిదృష్టి నాకర్షించిందేదయినా అతనికి దక్కి తీరవలసిందే! అందులో పొరపాటు జరగకూడదు! ఒకవేళ అతను అనుకున్నది దక్కకపోతే ప్రాణం గిలగిలలాడుతుంది.

"రాస్కెల్‌కి గుండెజబ్బు వుంది. ఈ విషయం డాక్టర్లు ఎంత చెప్పినా కాదు పొమ్మంటాడు ఇపుడా.

పెయింటింగ్ గురించి దేశంలో అందరికీ తెలుసు. దేశం నలుమూలలనుంచి 'కళాపోషకులు' వచ్చి వేలంలో పాల్గొన్నారు. పాల్గొన్నవారంతా కళాపోషకులు కారు! ఒక్కడు మాత్రం 'వాంగ' కళాపోషకుడు—ధరమ్‌చంద్.

నిజానికి ఆ పెయింటింగ్ గురించి అతనికేమీ తెలియదు. అసలు అతనికి ఏ కళలలోనూ ఆసక్తిలేదు. అతని సిద్ధాంతం ప్రకారం నలుగురిదృష్టి నాకర్షించింది తనకి దక్కాలి! అంతే! అర్థమయిందా మిస్టర్?"

దివాకర్ తలూపాడు.

"ఆ దక్కింది గొప్ప కళాఖండమయినా, పిడికెడు బూడిదయినా అతనికి నిమిత్తంలేదు. లోకం దృష్టి నాకర్షించింది ఏదయినా తనదగ్గర వుందన్న గౌరవం దక్కితేచాలు!

"కాబట్టి ఇప్పుడు నీకు పరిస్థితి అర్థమయిందనుకుంటా. ఆ పెయింటింగ్‌ని అతను స్వంతం చేసుకోవాలని ఆలోచించాడు. కాని బాసర్డ్‌కి యెందుకో బుద్ధిమారింది. అందుకే వేలం అయిదులక్షలకి విరమించుకున్నాడు. అంటే ఆ పెయింటింగ్‌ని అతను వదులుకున్నట్టు కాదు! మరో అయిడియా ఏదో మెదడులో జొరబడివుంటుంది.

"మిస్టర్ దివాకర్, ప్రస్తుతం ధరమ్‌చంద్ ఆ పెయింటింగ్‌ని దక్కించుకునే ప్రయత్నంలో వున్నాడు. ఎటువంటి పరిస్థితిలోనూ దాన్ని వదులుకోడం అన్నది అతని నైజానికి విరుద్ధం. అతను పెయింటింగ్‌ని దక్కించుకునే ప్రయత్నంలో వుంటే, నువ్వు వూహించవచ్చు; ఆ ప్రయత్నం ఎలాటిదయి వుంటుందో."

"అంటే దౌర్జన్యంగా దక్కించుకుంటాడా?"

"పొరపాటు లేదు. దౌర్జన్యం అతనికో లెక్క కాదు. ఆ పెయింటింగ్‌ని దక్కించుకునే ప్రయత్నంలో అతను రంగంలో దిగాడంటే మీలాంటి డిటెక్టివ్‌లు వందమంది అయినా ఏమీ చేయలేరు!"

"మిస్టర్ ఆర్కే, అతనికి ముఠావుందా?"

"వుంది, ముఠానాయకుడు గబ్బర్‌సింగ్. మీలాంటి డిటెక్టివ్‌లు అతనికి పిట్టలతో సమానం."

"ఆర్కే! నువ్వు చెప్పేదంతా నిజమేనా? లేక భయపెడుతున్నావా?"

"వాకబు చేసుకోవచ్చు బ్రదర్."

దివాకర్ ముఖంలో ఆందోళన చూసి నవ్వాడు కుమార్.

"భయం అంటే ఏమిటో మొదటిసారిగా తెలిసిందను కుంటాను? మిస్టర్ దివాకర్, నా సహాయం లేకుండా నీకా పదివేలు దక్కకపోగా, ప్రాణాలుకూడా దక్కవు! గబ్బర్‌సింగ్‌కి పిట్టల్ని కాల్చడం చాలా ఇష్టం!"

"మిస్టర్ ఆర్కే! నీవన్నీ అబద్దాలు!"

"ఓకే! నేను చెప్పిందంతా నిజమని తోచినప్పుడు నాదగ్గరకు రా! ఇదే హోటల్‌లో వుంటాను. రూమ్ వన్-టూ-ఫోర్. సాయంత్రం ఏడుగంటలకి."

# 4

సాయంత్రం ఏడుగంటలకి కుమార్ కారులో ప్రయాణిస్తున్నాడు.

కార్లో అతను, దివాకర్ కాక మరో ఇద్దరున్నారు— దివాకర్ పార్టనర్సు: జుగల్ కిషోర్‌రామ్సే, మొహిందర్ సింగ్‌లు.

కారు చాలాదూరం ప్రయాణించే వరకు యెవరూ

మాట్లాడుకోలేదు. జీవన్ రావ్ ఉస్మాన్‌సాగరులో బ్లూసీ కాటేజిలో బసచేసినట్టు దివాకర్ చెప్పాడు. దివాకర్ క్లయింట్ తనమీద విశ్వాసం ప్రకటించినందుకు సంతోషంగా వుందంటూ కుమార్ చెప్పాడు.

కారు సిటీదాటాక చార్మినారు వెల్గించి బయట చీకటి లోకి చూస్తూ అన్నాడు, "మిస్టర్ దివాకర్, నీ క్లైంటు ధరమ్‌చంద్ గురించి పూర్తిగా తెలుసుకున్నాడా?"

"తెలుసుకున్నాడు. నువ్వు చెప్పిందంతా ఆయనకి చెప్పాను. ఆయన అంతావిని నిన్ను పిలుచుకు రమ్మన్నాడు. ధరమ్‌చంద్ గురించీ, నీగురించీ ఫోనుద్వారా స్వయంగా దర్యాప్తు చేసి తెలుసుకున్నాడు."

"వెరీగుడ్! పెయింటింగ్ అతనిదగ్గరే వుందా?"

"అవును."

కుమార్ నవ్వాడు, "అయితే గబ్బర్‌సింగ్ యింకా రంగంలోకి దిగలేదన్నమాట. గుడ్ లక్. డియర్ డిటెక్టివ్ నీ తల్లో అసలు తెలివి లేదంటాను."

"ఎందుకు?"

"పెయింటింగ్‌ని జీవన్‌దగ్గర వదలి మీరు ముగ్గురూ కట్టకట్టుకుని ఎందుకు వచ్చారు? గబ్బర్‌సింగ్ దాడిచేస్తే"

దివాకర్ ఒక్కక్షణం మాట్లాడలేదు.

"గబ్బర్‌సింగ్ దాడి చెయ్యడు మిస్టర్ ఆర్కే" రామ్మోగొంతు ఖంగుమంది. "జీవన్ ఎక్కడ బసచేశాడో ఎవరికీ తెలియదు. అయినా అసలు ధరమ్ ఆ పెయింటింగ్ కోసం ప్రయత్నిస్తున్నాడని ఎందుకనుకోవాలి?"

"అనుకోవాలి. తప్పదు! ధరమ్ చెప్పింది చెయ్యడు, తోచింది చేస్తాడు. కాబట్టి అతనికి ఎప్పుడేం తోస్తుందో ఎవరికీ తెలియదు!" అన్నాడు కుమార్.

కారు ఉస్మాన్ సాగరు చేరుకుంది.

వదహారవ నెంబరు కాటేజిముందు ఆగాక అందరూ దిగి లోనికి నడిచారు. లోపల జీవన్, అతని భార్య ఎదురెదురుగా కూర్చొని మద్యం సేవిస్తున్నారు. అతిథుల్ని చూసి ఉలిక్కిపడి గాయత్రీదేవి గ్లాసు దాచేసింది.

కుమార్ నవ్వుతూ చూసి, "ది సేమ్ ఈజ్ ఆర్కే" అన్నాడు, "మిస్టర్ జీవన్, నాగురించి నువ్వు తెలుసుకున్నావు. నన్ను నమ్మి పిలిపించావు. అయామ్ వెరీ గ్లాడ్!"

జీవన్ అసహనంగా అన్నాడు, "ప్లీజ్ సిడవున్. ఒకమాట: నేను సినీ ప్రొడ్యూసర్ని. నన్ను మర్యాదగా సంబోధించడం నేర్చుకుంటావా?"

"నేనెవరికీ మర్యాద ఇవ్వను మిస్టర్! నానుంచి నువ్వు కోరుకునేది మర్యాద అయితే వెంటనే బయటకు నడుస్తాను."

"అపని చెయ్యకు!" అన్నాడు జీవన్. ఆ తర్వాత భార్యని వుద్దేశించి, "దేవీ! నువ్వు బెడ్ రూం కెళ్ళు. పావుగంటలో బిజినెస్ సెటిల్ చేసి వచ్చేస్తాను," అన్నాడు.

గాయత్రి తలవూపి లేచింది. తడబడుతున్న అడుగులతో బెడ్ రూంలోకి నడిచింది.

"ఎనీ డ్రింక్?" జీవన్ అడిగాడు కుమార్ ని.

"వై నాట్? దట్ వుడ్ బి ఎ ప్లెజర్!" అన్నాడు కుమార్. జీవన్ డిటెక్టివ్ లని కూచోమన్నట్టు సైగ చేసి, అందరికీ గ్లాసుల్లో విస్కీ పోసి, సోడా కలిపాడు. అందరూ గ్లాసులందుకుని ఛీర్స్ చెప్పుకున్నారు. ఆ తరువాత నేరుగా బిజినెస్ లోకి దిగారు.

"ధరమ్‌చంద్ గురించి నేను విన్నది నిజమయితే నువ్వతనికి బుద్ధి చెప్పాలి!" అన్నాడు జీవన్ రావ్.

"ఎవరికయినా బుద్ధి చెప్పాలంటే నాకు డబ్బు కావాలి" అన్నాడు కుమార్.

"ఎంత కావాలి?"

"గబ్బర్‌సింగ్ టక్కరి నక్క. అతని బారినుంచి పెయింటింగ్‌ని రక్షించేందుకు పది వేలవుతుంది."

"మంచిది" జీవన్ అన్నాడు తలూపుతూ. "మీరు ఈ రాత్రి బయలుదేరాలి. నేను రెండురోజుల తర్వాత వస్తాను. ఆ విధంగా చేస్తే ఒకవేళ నా వెంట ఎవరైనా పడినా వాళ్ళకి పెయింటింగ్ దక్కదు!"

"మంచిది. మద్రాసులో నీకోసం ఎక్కడ ఎదురు చూడాలి?"

"అంతా డిటెక్టివ్‌లకి వివరించాను. మీరంతా సవేరాలో బసచెయ్యాలి. నేను మద్రాసు వచ్చాక ఫోన్ చేస్తాను — ఆ పెయింటింగ్ నాకందించాలి. నేను మీ డబ్బు ఇస్తాను"

"ఓ. కే! పెయింటింగ్ నీ చేతికొచ్చాక ఎవరైనా కాజేస్తే ఏంచేస్తావ్?

"నేను కళాపోషకుణ్ని. నా దగ్గర చాలా పెయింటింగ్స్‌ని ఇన్సూర్ చేయించాను. మద్రాసు వెళ్ళాక దీన్ని కూడా చేయిస్తాను."

"వెరీగుడ్. ఇక ఆ పెయింటింగ్ నాకివ్వు. అలాగే మూడువేల అడ్వాన్సు."

జీవన్ లేచి సిగార్ వెల్గించాడు. "మిస్టర్ ఆర్కే నిన్ను పూర్తిగా నమ్మి అయిదులక్షల పెయింటింగ్ చేతిలో పెడుతున్నాను. దానికేం సంభవించినా సహిం

చను! ఆ పెయింటింగ్ సంపాదించాలని ఎన్ని కలలు కన్నానో నాకు తెలుసు. అయిదులక్షలు పోయినందుకు బాధపడను గానీ, పెయింటింగ్ పోతే పిచ్చి వాడ్నవుతాను..."

"నాకు తెలుసు మిస్టర్, కళారాధకుల సైకాలజీ. పెయింటింగ్ తీయ్" అన్నాడు కుమార్ చార్మినార్ వెలిగించి.

డిటెక్టివ్‌లు ముగ్గురూ మౌనంగా కూర్చుని జీవన్ రావ్‌ని చూస్తున్నారు.

రెండునిమిషాలు గదిచుట్టూ తిరిగి జీవన్, చుట్ట అవతలికి విసిరి అందర్నీ చూశాడు. ఆ తర్వాత తలాడించి బెడ్‌రూం తలుపుదగ్గర కెళ్ళాడు. అందర్నీ మరోసారి చూసి, నేలమీద కూచోని తివాసీ ఎత్తాడు. తివాసీ కిందనుంచి ప్లాస్టిక్ కవర్‌లోవున్న పెయింటింగ్ లాగాడు.

డిటెక్టివ్‌లు అయోమయంగా చూశారు.

కుమార్ నవ్వి, "అంతగొప్ప కళాఖండాన్ని కాళ్ళ కింద ఎలా నలపగలిగావు మిస్టర్?" అనడిగాడు.

జీవన్ ముఖంలో రంగులు మారాయి. వెంటనే, "ఇది గుమ్మందగ్గరే వుంది గాని మేం తొక్కలేదు. దీనికి ఇంత కంటే మంచిస్థలం దొరకలేదు!" అన్నాడు.

కుమార్ పెయింటింగ్ అందుకుని చూశాడు. ఆ తర్వాత దాన్ని చుట్టి కవర్‌లో పెట్టాడు. జీవన్ అడ్వాన్సుగా మూడువేలు యిచ్చాను.

"ఆల్ రైట్!" కుమార్ అన్నాడు. "పెయింటింగ్ క్షేమంగా మద్రాసు చేరుతుంది. మిస్టర్ జీవన్, నువ్వు నా మీద నమ్మకం వుంచినందుకు మరోసారి థాంక్స్."

జీవన్ గర్వంగా నవ్వుతున్నాడు.

కుమార్ దివాకర్‌తో అన్నాడు, "నన్ను హోటల్ దగ్గర డ్రాప్ చెయ్యి. నేను భోజనంచేసి, బట్టలు సర్దుకుని సిద్ధంగా వుంటాను. మీరు ముగ్గురూ సరిగ్గా పదకొండు గంటలకి రండి. ఏమిటి?"

దివాకర్ తలూపాడు, "మరి పెయింటింగ్?"

"నా దగ్గరవుంటుంది" కుమార్ అన్నాడు.

దివాకర్, జీవన్‌ని చూశాడు.

జీవన్‌రావ్ అంగీకారంగా తలూపాడు.

## 5

కుమార్ సూట్‌కేసులో బట్టలు సర్దుకుని సిద్ధంగా వున్నాడు. అంతకుముందు అతను నాలుగు కోడిగుడ్లతో సుష్టుగా భోజనంచేసి ఒక బాటిల్ బీరు సేవించాడు.

సమయం 11 గంటలైంది.

కుమార్ రివాల్వర్‌ని శుభ్రంచేసి గుళ్ళు నింపుతూ డిటెక్టివ్‌లకోసం ఎదురుచూడసాగాడు. ఏ క్షణాన్నైనా వాళ్ళొచ్చేస్తారు. కుమార్‌కో అనుమానం చాలా వేధిస్తోంది: ధరమ్‌చంద్ ఏం చేస్తున్నాడు? గబ్బర్‌సింగ్ ఎక్కడవున్నాడు? తనిప్పుడున్నది ధరమ్‌చంద్ కోటలోనే. ఈ పెయింటింగ్‌ని తను మద్రాసుకి తీసుకెళుతున్నట్టు అతనికి తెలుసా?

డోర్‌బెల్ శబ్దం కుమార్ ఆలోచనల్ని చెదరగొట్టింది.

"కమిన్ ఫ్రెండ్స్!" అన్నాడు తేరుకుని.

తలుపుతోసుకుని దివాకర్ వచ్చాడు, "వి ఆర్ రెడీ!"

కుమార్ రివాల్వర్‌ని జేబులో పెట్టుకుని సూట్‌కేసు అందుకున్నాడు, "లెటజ్ గో!"

దివాకర్ కదల్లేదు. కుమార్ని అదోలా చూస్తున్నాడు.

"ఏమిటి మిస్టర్?" కుమార్ అడిగాడు.

"పెయింటింగ్ ఎక్కడ వుంది?"

కుమార్ అదోలా నవ్వి టైం చూసుకున్నాడు, "దివాకర్, ఆలస్యమవుతోంది, పద!"

"పెయింటింగ్ ఎక్కడ?"

"నాన్సెన్స్! ఎందుకలా అరుస్తావ్! ఎవరైనా వింటే నువ్వూ, నేనూ శవాలవుతాం!"

దివాకర్ ముఖం ఎర్రబడింది. "బాస్టర్డ్! పెయింటింగ్ ఎక్కడ వుందో చెప్పు! సూట్ కేసులోనా?"

"కాదు."

"మరెక్కడ?"

"అది నీ కనవసరం మిస్టర్!"

"ఆర్కే! ఏమిటిది! మోసం చేస్తున్నావా? ఎత్తులు..."

కుమార్ అతని కాలరు పుచ్చుకుని బయటకి లాగాడు. ఆ తర్వాత సూటు కేసు తీసుకుని బయటికి వచ్చి తలుపుకు తాళం వేశాడు.

దివాకర్ ఆయాసంతో వగరుస్తున్నాడు...

"దివాకర్! ఆ పెయింటింగ్ ఎక్కడవుందో నీ కనవసరం. నువ్వు నావెంట వచ్చి, నేను చెప్పినట్టు చెయ్యాలి."

"అదెక్కడుందో తెలియకపోతే దాన్నెలా రక్షిస్తాను!"

"అదెక్కడవుందో నీకు తెలియకపోతేనే క్షేమంగా వుంటుంది."

"ఏమిటి నీ వుద్దేశ్యం? నన్నుమానిస్తున్నావా?"

"అవును. ఖర్మకాలినువ్వు గబ్బర్ సింగ్ చేతికిచిక్కావంటే అదెక్కడవుందో చెప్పేస్తావు."

"పిచ్చిగా వాగుతున్నావ్! ఈ బిజినెస్‌లో నేనూ పార్ట్‌నరుని!"

"పార్ట్‌నర్స్ తగవులాడుకుంటే బిజినెస్ నాశనమవుతుంది. దివాకర్. నువ్వు డిటెక్టివ్ అయినంత మాత్రాన జేమ్స్‌బాండ్‌లా, యుగంధర్‌లా ప్రవర్తిస్తాననుకోకు! గబ్బర్‌సింగ్ దాగున్నమాతలగురించి నాకు బాగా తెలును. నువ్వు కో తపిట్టవి! నా పంజరంలో వుండాలి!" అని కుమార్ ముందుకు నడిచాడు.

వెనకనుంచి దివాకర్ గబగబవస్తూ అన్నాడు: "మరి నువ్వతనికి చిక్కితే చెప్పేయవా?"

ధడాలున తలుపు తెరుచుకుని ఒక అజానుబాహుడు బయటికి వచ్చాడు. కారిడార్‌లో ఎవరూ లేరు. దీపాలు మసకగా వెలుగుతున్నాయి. అజానుబాహుడి చేతిలో పిస్తోలు, ముఖంలో చిరునవ్వు మెరుస్తున్నాయి.

"హల్లో ఆర్కే!" పలకరించాడతను. "ఎటు వెళుతున్నావు? ఆ పెయింటింగ్ ఇచ్చేసి వెళ్ళు."

దివాకర్ భయపడి రివాల్వరు తీయబోయాడు.

అజానుబాహుడు మళ్ళీ అర్చాడు, "హాండ్సప్! చెప్పినట్లు చెయ్యండి! పిస్తోలు నా చేతిలోవుంది!"

కుమార్, దివాకర్‌లు చేతులెత్తారు. వాళ్ళిద్దరికీ, అజానుబాహుడికీ మధ్య పదిగజాల దూరముంది. అజానుబాహుడ్ని పరీక్షగా చూశాడు కుమార్. అతని తల మీద వెంట్రుకలులేవు. నున్నగా మెరుస్తోంది.

కుమార్ సూట్‌కేసు నేలమీద వుంది.

"కమాన్! పెయింటింగ్ ఇచ్చేయ్!"

కుమార్ నవ్వాడు, "నీ పేరేమిటి మిస్టర్?"

"తెలియటంలా?" అజానుబాహు డర్చాడు తల

నిమురుకుంటూ, "నా పేరు గుండు! చెప్పాను! ఆ పెయింటింగ్ ఎచ్చట వున్నది?"

"ఇచ్చటవున్నది," అన్నాడు కుమార్ సూటుకేసు చూపిస్తూ.

గుండు నవ్వాడు. "సూటుకేసిలా యివ్వు! ఆగు_దాన్ని కాలితో యిటు తన్ను!"

కుమార్ సూటుకేసుమీద కాలుపెట్టాడు.

దివాకర్ వూపిరి బిగబట్టి చూస్తున్నాడు.

ఈసారి గుండు చిరునవ్వు అదృశ్యమయింది. ఇప్పుడతని పిస్తోలు, నున్నటి తల మెరుస్తున్నాయి.

కుమార్ సూటుకేసుమీద కాలుపెట్టి రెండుక్షణాలు వూరుకున్నాడు. దివాకర్ భయంతో గొణిగాడు. "ఆర్కే, వాడిమీద దాడిచేయకు! షూట్ చేస్తాడు!"

గుండు పాముచెవులు ఈమాటలు విన్నాయి. వెంటనే కాళ్ళు బారజాపి నిలబడి అన్నాడు, "ఆర్కే! ఆసూటుకేసు నా కాళ్ళమీదకి తన్ని పడగొట్టాలనుకుంటున్నావేమో! అది బుద్ధితక్కువ పని! సరిగ్గా నాకాళ్ళమధ్యకి నెమ్మదిగా నెట్టు!"

నవ్వుకున్నాడు కుమార్.

"జాగ్రత్త!" అన్నాడు దివాకర్.

కుమార్ ఛటుక్కున సూటుకేసుని కాలితో తన్నాడు' అది విసురుగా గుండు కాళ్ళమధ్యనుంచి దూరి అవతలికి వెళ్ళింది.

అంతే! రెప్పపాటు కాలంలో కుమారు వూహించిందంతా జరిగిపోయింది.

సూటుకేసు కాళ్ళమధ్యనుంచి దూరి అవతలికి వెళ్ళడంతో, గుండు ఛటుక్కున తిరిగాడు. కుమార్ ఆ ఒక్క

క్షణాన్ని వినియోగించుకుని గుండుమీదకి లంఘించి మెడ కాయమీద ఒక్కటిచ్చాడు. గుండు ముందుకు తూలిపడ బోతుండగా మళ్ళీ ఆతని వీపుమీద గుద్దాడు. ఆ తర్వాత చెయ్యి మెలేసి పిస్తోలు లాక్కుని గుండుని కింద పడే శాడు.

గుండు కిందపడుతూ ముఖాన్ని నేలకేసి కొట్టు కున్నాడు. బోర్లాపడ్డ ఆతనిమీద కుమారు కూచోని "మిస్టర్ గుండు, ఇప్పుడు చెప్పు; పెయింటింగ్ కావాలా? ప్రాణాలు కావాలా?" అనడిగాడు.

దివాకరలాగే దూరంగా నిలబడి చూస్తున్నాడు.

గుండు ఆలస్యం చేయిలేదు. "ప్రా...ప్రా... ప్రాణాలు" అన్నాడు.

"వెరీగుడ్! నిన్నెవరు పంపించారు?" కుమారన్నాడు లేచి నిలబడుతూ.

"నాఖర్మ! నన్నెవరూ పంపించలేదు!"

"పెయింటింగ్ గురించి నీకెలా తెలుసు?"

గుండు లేచినిలబడి ముఖానికున్న రక్తం తుడుచుకుని అన్నాడు :

"సాయంత్రం వేలం జరుగుతున్నప్పుడు చూశాను. ఆ డిటెక్టివ్‌తో నువ్వు మాట్లాడుతుండగా చూశాను. ఆ తర్వాత నువ్వు జీవన్‌ని కలుసుకున్నావు!"

"నువ్వు తెలుసుకున్నది ఇంకెవరికి చెప్పావు?"

"ఎవరికీ చెప్పలేదు. నా పిస్తోలు ఇచ్చేయి!"

సూటుకేసు అందుకుని కుమారన్నాడు, "పెయింటింగ్ ప్రాణాలు - పిస్తోలు - ఈ మూడింట్లో నీకు యేదో ఒకటి దక్కుతుంది. నువ్వు ప్రాణాలడిగావు, ఇచ్చేశాను. ఇక వెళ్ళు. రన్ అవే!"

కారిడారులో గుండు కనుమరుగయ్యే వరకూ చూసి, ఆ తర్వాత వెనుదిరిగాడు కుమార్.

# 6

కారు రాష్ట్రపతి రోడ్డుమీద పరుగెత్తోంది. అందులో వున్న నలుగురూ మౌనంగా వున్నారు. రామ్స్ డ్రైవింగ్ చేస్తున్నాడు. సింగ్ అతనిపక్కన కూచున్నాడు. వెనక సీట్లో కుమార్, దివాకర్లు కూచున్నారు. చార్మినార్ తాగుతూ కుమారాలోచిస్తున్నాడు.

అయిదు నిమిషాలు గడిచాక దివాకరుండబట్టలేక అడిగాడు.

"ఆ పెయింటింగ్ ఎక్కడవుందో చెప్పవా?"

"ఊహుఁ!"

"సరే!" దివాకరన్నాడు ఒక నిర్ణయానికి వచ్చి, "రామ్స్, కారు తిన్నగా జీవన్ దగ్గరకి డ్రయివ్ చేయ్. ఈ వ్యవహారం ఏమిటో తేల్చుకొందాం!"

"అవసరం లేదు!" అన్నాడు కుమారు రెండవసారి వెనక్కి తిరగిచూసి, "అదిగో అటు చూడండి! ఈ వ్యవహారం యేమిటో తేల్చుకోడానికి వాళ్ళొచ్చేస్తున్నారు!"

డిటెక్టివ్ లందరూ వెనక్కి తిరిగిచూసి వులికిపడ్డారు. వెంటనే ముగ్గురి చేతుల్లోనూ రివాల్వర్సు ప్రత్యక్ష్యమయ్యాయి.

కుమార్ తాపీగా సిగరెట్ కాలుస్తున్నాడు.

వెనక ఒక ఎర్రటి జీపులో నాలుగు మానవాకారాలు వెంబడిస్తున్నాయి.

"కుమార్! వాళ్లెవరూ? గబ్బర్ సింగ్" గాభరాగా దివాకరన్నాడు.

"కాదు. అది ఆడవాళ్ళనగలు కాజేసే ముఠా," కుమారన్నాడు.

ఆ రెండు వాహనాలకీ మధ్యదూరం ఇరవయి గజాలుంటుంది. రామ్సే కారు స్పీడుపెంచి ఆ దూరాన్ని ఎక్కువ చేశాడు. వెనకవున్న వాహనం వేగం పెరగలేదు. అది తాపీగా వస్తూంది.

“ఇప్పుడేం జరుగుతుంది?”

“ఏమీ జరగదు. అది షేక్ గాడి ముఠా. నా చేతిలో వాడు అనేక రకాల రుచులు చూశాడు. అయినా ఇప్పుడు వెంటపడుతున్నాడు. ఈరోజు వాడు బకెట్ తన్నడం ఖాయం!”

“గాడ్! ఈ సిటీలో ఎంతటి కిరాతకులున్నారు?”

రామ్సే కారు యింకా వేగంగా డ్రయివ్ చేశాడు.

వెనక వాహనం వేగంకూడా పెరిగింది.

“కుమార్! పెయింటింగ్ ఎక్కడవుందో చెప్పేయ్! ఆ ముఠా దాడిలో నువ్వుచస్తే!”

“నా మృత్యువు ప్రభుత్వహస్తంలో వుంది మిస్టర్. రెండుహత్యలు చేశాను, చట్టవ్యతిరేక పనులు చేశాను. హత్యలు బయటపడి నేను పట్టుబడితే ఉరితప్పదు.”

“డామిట్! జీపు ఓవర్ టేక్ చేస్తూంది!” రామ్సే కసురుకున్నాడు.

“అయితే మనం ఆపడం మంచిది” కుమారన్నాడు.

“అరే! పెయింటింగ్ ...?” దివాకరు గొణిగాడు.

“హోల్డాన్, రామ్సే!” కుమారు అర్చాడు.

రామ్సే అప్రయత్నంగా బ్రేకువేశాడు. అందరూ ముందుకి తూలారు. అప్పటికి కారు టాంకుబండు చేరుకొంది. కారు ఆగినచోట నిర్మానుష్యంగానూ, మసక చీకటిగానూవుంది. సమయం 11-45.

రెండు నిమిషాలతర్వాత కారుపక్కన జీపువచ్చి

ఆగింది. అందులోంచి ముగ్గురు వస్తాదులు, ఒక బక్క మనిషి దిగారు. బక్క మనిషి పాన్ నములుతున్నాడు. వస్తాదుల్లో ఒకరిదగ్గర తుపాకీ, ఇద్దరివద్ద పిస్తోళ్ళూ వున్నాయి. బక్క మనిషి కారుదగ్గరకివచ్చి వెకిలిగానవ్వి, "పెయింటింగ్ లావ్!" అన్నాడు.

కుమార్ కారుదిగి సిగరెట్టు వెలిగించి అడిగాడు, "షేక్ భాయ్! ఏ పెయింటింగ్?"

"ఏక్ చాందినీ రాత్ వాలా!"

"అంటే?"

"ఒక వెన్నెలరాత్రి అంటయ కదు!"

"నాదగ్గర లేదు. నాకేమీ తెలియదు." కుమార్ అన్నాడు నిర్లక్ష్యంగా. "షేక్ భాయ్! నువ్వనవసరంగా నాతో పేచీ పెట్టుకుంటున్నావు. ఈసారి యెలాంటి రుచి చూపిస్తానంటే, తలచుకోడానికి నువ్వు బ్రతికివుండవు!"

"అఛ్ఛా!" అని వెనక్కి తిరిగి వస్తాదులకి సైగ చేశాడు బక్క మనిషి.

వస్తాదులు కారుదగ్గరికి వెళ్ళి డిటెక్టివ్‌లని బయటికి లాగారు. ఆ తర్వాత కారు మొత్తం గాలించారు. ఏమీ దొరకలేదు. చివరికి డిక్కీ తెరిచి డిటెక్టివ్‌ల లగేజీతో బాటు కుమారు సూట్ కేసు కూడా సోదాచేశారు. ఏమీ దొరకలేదు.

"క్యారే, కుమార్ కే బచ్చే! పెయింటింగ్ కిదర్ హై బోలో నై?" కోపంగా అరిచాడు బక్క మనిషి.

"ఇదర్ హై" అన్నాడు కుమార్ పిడికిలి చూపిస్తూ. బక్క మనిషి చూసేలోపున అతని ముఖంమీద బలంగా గుద్ది వెనక్కి తోశాడు.

కీచుమని వెనక్కి పడ్డాడు బక్క మనిషి.

"హేండ్సప్!" ముక్తకంఠంతో అర్చారు వస్తాదులు.

హఠాత్తుగా వెనక రివాల్వర్ మోత వినిపించింది. వస్తాదుల్లో ఒకడు నేలకూలాడు. కుమార్ చటుక్కున కారుపక్కన నక్కాడు. డిటెక్టివ్‌లు అతని పక్కన దూకారు.

మళ్ళీ రివాల్వర్ గర్జించింది.

మరో వస్తాదు నేలకూలాడు.

నేలమీదపడ్డ బక్కమనిషి గాభరాగా లేచినిల్చుని అర్చాడు. అతని అరుపు, మరోసారి రివాల్వర్ మోత ఒకేసారి ప్రతిధ్వనించాయి. బక్కమనిషి నేలకరిచాడు. మిగిలిన వస్తాదు చెట్టు చాటుచేసుకుని తుపాకీ పేల్చాడు. రెస్పాన్స్ లేదు. తూటా చీకట్లో కలిసిపోయింది.

ఈ భీకర యుద్ధంచూసి ఇరువేపులా వస్తోన్న వాహనాలు వెనక్కితిరిగి వురికాయి.

"కారెక్కండి!" కుమార్ అర్చాడు డ్రైవింగ్ సీట్లో దూకుతూ.

. ఆ క్షణంలో మరోసారి రివాల్వర్ పేలింది. బుల్లెట్ కారు కిటికీలోంచి దూసుకుని అవతలికి వెళ్ళింది. డిటెక్టివ్ డోర్ తెరుచుకుని లోపలికి దూకాడు. కానీ అప్పటికే ఆలస్యం అయింది... చెట్టు చాటునవున్న వస్తాదు ఇద్దరు డిటెక్టివ్‌లని షూట్ చేసేశాడు...

డిటెక్టివ్‌లు భయంకరంగా ఆర్తనాదం చేశారు. వారి ఆర్తనాదంలో వెంటవెంటనే మూడుసార్లు రివాల్వర్ గర్జించింది. చెట్టుచాటునవున్న వస్తాదు కెవ్వురు మనకుండా నేలకూలాడు.

కుమార్ కారు స్టార్టుచేసి ముందుకి దూకించాడు.

అప్పుడే ప్రారంభమైంది, అసలు పోరాటం.

చీకట్లో ఆయుధాలు ప్రయోగించిన ఇద్దరు ఆగంతకులు తటాలున దూకి మోటారుసైకిల్స్ ఎక్కారు. అమిత వేగంతో నడుపుతూ కుమార్ కారుని వెంబడించసాగారు. మధ్యమధ్యలో రివాల్వర్స్ ప్రయోగిస్తున్నారు.

ట్రాఫిక్‌లో కల్లోలం చెలరేగింది. కుమారు అతి నేర్పుగా డ్రైవ్ చేస్తూ ఎదురుగా వస్తోన్న వాహనాల్ని తప్పించుకుంటున్నాడు.

కారు లిబర్టీ వేపు తిరిగాక పరిస్థితి ఇంకా విషమించి పోలీస్ పాట్రోలింగ్ కారు రంగప్రవేశం చేసింది. కారులోవున్న అసిస్టెంట్ కమీషనర్ దేవరాజ్ ఛటుక్కున రివాల్వరు తీసి వేగం పెంచమని డ్రైవరుకి చెప్పాడు. డ్రైవరు సైరన్ ఆన్ చేసి వేగం పెంచాడు.

సైరన్ విన్న ఆగంతకులు మోటారుసైకిల్స్ వేగం పెంచి వీలు చిక్కినప్పుడల్లా వెనక్కి తిరిగి షూట్ చేయసాగారు.

విశాలమైన బషీర్బాగ్ రోడ్డుమీద కుమారు కారు రాకెట్టులా దూసుకుపోతోంది. కారువెనుక మోటారు సైకిల్స్, వాటివెనక పోలీసుకారూ వెంబడిస్తున్నాయి.

దేవరాజ్ రివాల్వరు ప్రేలుస్తూ నేవున్నాడు. కానీ ఆగంతకులు చాకచక్యంగా తప్పించుకోడమేగాక ఎదురు దాడి జరుపుతున్నారు.

చివరికి అబిడ్స్ చేరుకున్నాక కుమారు కళ్ళు మూసుకుని సడెన్ బ్రేకువేశాడు. అంతే! అతను వూహించిందంతా జరిగిపోయింది.

వెనక వస్తోన్న మోటారుసైకిల్స్ కారుని ఢీకొని అడ్డంపడ్డాయి. ఆ సంఘటన చూసి తేరుకుని బ్రేకువేసే లోపున పోలీసుడ్రైవరు కారుని, ఆ మోటారుసైకిలిస్టుల మీదికి ఎక్కించేశాడు.

మోటారుసైకిల్స్ తుక్కు కావడమేగాక అగంతకుల శరీరాలు పచ్చడయ్యాయి. కుమార్ కళ్ళు తెరిచి, తేరు కుని, గాఢంగా వూపిరిపీల్చి కారు స్టార్ట్ చేసి ముందుకు దూకించాడు...

# 7

దివాకర్ నెమ్మదిగా కళ్లు తెరిచాడు. ఏం జరిగిందో అతనికి తెలియదు. కాని క్రమంగా బోధపడింది. టాంక్ బండ్ మీద కారెక్కుతున్నప్పుడు జరిగిన సంఘటన జ్ఞాపకం వచ్చింది. అప్పుడు తాము ముగ్గురూ కారెక్కుతున్నప్పుడు ఏదో జరిగింది_ఏమిటది?

తుపాకీ రెండుసార్లు మోగింది. రామ్సే, సింగ్ లు లోనికి దూకారు. ఏం జరిగిందో తెలియని తను కూడా కార్లోకి దూకాడు...కానీ దూకబోతూ డోర్ ని గుద్దుకుని తెలివితప్పాడు! అంతే,

దివాకర్ తేరుకుని రామ్సే, సింగ్ లను చూశాడు. వాళ్ళిద్దరూ సీట్లో ఒకరిమీద ఒకరు పడివున్నారు.

వాళ్ళిద్దరూ నిర్జీవంగా పడివున్నారని తెలుసుకోడానికి ఎంతోసేపు పట్టలేదు దివాకరుకి. వెంటనే భయంకరంగా అర్చాడు, "ఆర్కే. కారాపు!!"

అప్పటికిగాని కుమార్ కి తెలిసిరాలేదు, కారు ఎటు వెళుతోందో?

ఆబిడ్స్ దగ్గర బయలుదేరిన వేగంతో అతను కోఠికీ, ఆ తర్వాత అక్కడ్నుంచి మలక్ పేటకీ డ్రైవ్ చేశాడు. ఇప్పుడు మలక్ పేట కూడా దాటిపోయింది.

"ఆర్కే! కారాపు!!" మళ్ళీ దివాకరర్చాడు.

కుమారు వేగం పూర్తిగా తగ్గించాడు. వెనక్కి తిరిగి చూసి అలసటగా, "ఏం జరిగింది మిస్టర్?" అనడిగాడు.

"గాడ్! ఏం జరిగింది! మై పార్ట్‌నర్స్ ఆర్ డెడ్!"

కుమార్ కళ్ళు తిరిగి కారాపాడు.

సీటుమీద రామ్మే, సింగ్ లు ఒకరిమీద ఒకరు పడి వున్నారు. కుమార్ నాడి చూసి ముఖం చిట్లించాడు.

"ఇప్పుడేం చేద్దాం?" దివాకరడిగాడు ఆందోళనగా.

"పూర్ ఫెలోస్! ఐ పిటీదెమ్'" కుమార్గొణుకున్నాడు. "ఈ శవాన్ని మద్రాసు తీసుకెళదాం! దివాకర్, నీపార్ట్‌నర్స్ నా మూలంగా చచ్చారు. ఎక్స్‌క్యూజ్ మీ!"

దివాకరు కన్నీళ్ళు తుడుచుకుని కారు దిగాడు.

"నాకేమీ అర్థంగావటంలేదు, అర్కే! నా పార్ట్‌నర్స్ పెయింటింగ్ కోసం ప్రాణాలిచ్చారంటే అర్థముంది. కానీ...కానీ..."

"ఏమిటి?"

"అసలు నీ దగ్గర పెయింటింగ్ వుందా?"

"ఆ ప్రశ్న అడగొద్దన్నాను!"

"పోనీ ఎక్కడ దాచావో చెప్పు!"

"ఆల్ రైట్! మద్రాసు వెళ్ళాక ఎక్కడ దాచానో చూపిస్తాను."

"అంటే?"

"ఇప్పుడు చెప్పను. ఎవరికీ చెప్పను. నేనొకవేళ ఎవరికైనా పట్టుబడ్డా చెప్పను! వాళ్ళు నన్ను చంపరు! ఎందుకో తెలుసా? ఆ పెయింటింగ్ ఎక్కడ వుందో నాకే తెలుసు కాబట్టి!"

"ఒకవేళ...ఒకవేళ...నన్ను చంపుతామని బెదిరించినా చెప్పవా?" దివాకరు అడిగాడు గాభరాగా.

"మిస్టర్ దివాకర్! సీరియస్‌గా చెబుతున్నాను -

మనం ఎవరికీ పట్టుబడం! నువ్వు పిచ్చిభయాలు పెట్టుకోకు!''

''మరి గబ్బరుసింగ్ గురించి ఏమిటి? ఎక్కడున్నాడు?''

కుమార్ మాట్లాడలేదు. కారెక్కి స్టార్ట్ చేశాడు. దివాకరు వచ్చి ముందుసీట్లో కూచున్నాడు. కారు బయలు దేరింది.

మళ్ళీ దివాకరన్నాడు: ''ఆర్కే, నువ్వు నన్ను మోసం చేస్తున్నావేమో తెలియదు. ఆ పెయింటింగ్ కి ఏం సంభవించినా ఫలితం అనుభవించేది నేనే—కిరణ్ నా మీద చర్య తీసుకుంటాడు. కాబట్టి, ఆర్కే—''

''కారాపమంటావా? దిగి వెళ్ళిపోతావా?''

''మిస్టర్ ఆర్కే!''

కుమార్ నవ్వాడు, ఆ పెయింటింగ్ కాజెయ్యాలన్న పాడు ఆలోచన నాకుంటే నిన్నెప్పుడే కాల్చి బయటికి గెంటేద్దును! పాడులోకం! మంచితనం భరించదు!''

దివాకరు మాట్లాడలేదు. కారు చాలా దూరం నిశ్శబ్దంగా ప్రయాణించింది. సమయం 12:30 దాటింది. కారు సరూర్ నగర్ దాటింది. కుమారు విలాసంగా సిగరెట్ కాలుస్తూ డ్రైవ్ చేస్తోంటే, దివాకరు బయట వెన్నెల చూస్తూ ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

మరికొంత సమయం గడిచింది. కారు పూర్తిగా సిటీ లిమిట్స్ దాటి వచ్చేసింది.

అప్పుడు చూశాడు కుమార్ _ రియర్ వ్యూ మిర్రర్ లో హెడ్ లైట్స్.

వేగం తగ్గించి రోడ్డువారగా కారాపాడు. దివాకర్ ఏం జరగబోతోందో గ్రహించి, రివాల్వర్ తీసి, ''ఆర్కే ఇప్పుడు నేనెవర్నీ కనికరించేది లేదు! కన్పించిన ప్రతివాడ్నీ కాల్చేస్తాను!'' అన్నాడు.

"చల్లార్చుకో! ఉద్రేకం చల్లార్చుకో! ఆ కారు ధరమ్ చంద్ ది" కుమారన్నాడు.

దివాకర్ వెనుదిరిగి చూశాడు. అంతలో ధరమ్‌చంద్ బెంజికారు పక్కన వచ్చి ఆగింది. దివాకర్, కుమార్‌లు, ముఖాలు చూసుకున్నారు.

"కార్లో ఎవరున్నారు?" అర్పు విన్పించింది.

కుమార్ కారు దిగాడు. అతని వెంట దివాకరు దిగాడు.

ఇద్దరూ బెంజికారు దగ్గరకు వెళ్ళారు.

"హల్లో మిస్టర్ ధరమ్‌చంద్! ఎక్కడికి ప్రయాణం?" కుమారు పలకరించాడు.

"అరె! ఆర్కే, నువ్వా! ఆశ్చర్యంగా వుంది!" ధరమ్ అర్చాడు కళ్ళు పెద్దవి చేసి.

"నాకూ ఆశ్చర్యంగానే వుంది! యెక్కడికి ప్రయాణం?"

"ఎలా చెప్పాలి ఆర్కే నీకు! తోతారామ్ ఇంట్లో డిన్నర్కి వెళ్ళి వచ్చి పడుకున్నానా, కలలో సినీయాక్టర్ చంద్రిక కన్పించింది! వెంటనే లేచి ఇలా మద్రాసుకి బయలుదేరాను..."

"నువ్వెంతటి విశ్వాసంగల కుక్కవో ఇప్పుడు తెలుస్తోంది!" అన్నాడు కుమారు. "ఇక్కడ్నుంచి ట్రంకాల్ కొడితే ఆ చంద్రిక వచ్చి నీ వొళ్ళో వాలుతుంది కదా? ఆమె చుట్టూ కుక్కలా తిరగడానికి నీకు సిగ్గుగా లేదూ?"

"బద్మాష్! నిన్ను పలకరించడం నా బుద్ధితక్కువ!"

ఛటుక్కున కారు స్టార్ట్ చేసి దూసుకుపోయాడు ధరమ్ చంద్.

"ఏమిటి దీని అర్థం?" దివాకరడిగాడు.

"ఏమీ లేదు. పెయింటింగు ఎవరు కాజేసినా ధరమ్ దగ్గరికి వెళ్తారు అమ్మకానికి."

"అంటే, పెయింటింగుకోసం ధరమ్ పథకాలు వేయడంలేదా?"

"చెప్పలేం, బాస్టర్డ్‌కి ఎప్పుడేం తోస్తుందో."

ఇద్దరూ తిరిగి కారెక్కారు. కుమారు స్టార్ట్ చేసి పోనిచ్చాడు.

దివాకరు చాలాసేపు మాట్లాడలేదు. కుమారు పెయింటింగు ఎక్కడ దాచివుంటాడా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. చివరికి, కారు మూడు కిలోమీటర్లు ప్రయాణించాక కుమారు బ్రేకువేశాడు.

"ఏమిటి?" దివాకరడిగాడు తేరుకుని.

"నువ్వీలోకంలో లేవు. ఎదురుగా చూడు!" కుమారు అన్నాడు.

దివాకర్ రోడ్డుకేసి చూశాడు. పదిగజాల దూరాన రోడ్డుకడ్డంగా ఒక లావాటి చెట్టుకొమ్మ పడేసివుంది...

"రోడ్ ఎవరు బ్లాక్ చేశారు?"

"మన మిత్రులు. పరిచయం చేసుకుందామా?"

"మిస్టర్ రమేష్ కుమార్!" ఖంగుమంది ఒక కంఠం_ స్త్రీ కంఠం.

ఇద్దరూ అరుపు విన్పించినవేపు తలలు తిప్పారు.

రోడ్డుకి కుడివేపు గుబురుగావున్న చెట్లమధ్య నుంచి మళ్ళీ విన్పించింది.__అదే కంఠం:

"మిస్టర్ రమేష్ కుమార్! నువ్వు మర్యాదగా కారు దిగి చేతులెత్తి నిలబడాలి! కార్లో ఎవరేనా వుంటే వాళ్ళను కూడా దిగమను. జాగ్రత్త! మేం నీకు కన్పించని చోట వున్నాం. నువ్వు మాకు బాగా కన్పిస్తున్నావు. ఎలాంటి ట్రిక్కులుచేసినా నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాం!"

దివాకరు, కుమార్ని చూశాడు. కుమారు గుసగుస లాడాడు.

"ఆ చెట్లలోకి మనం షూట్ చెయ్యాలి - క్షణం విరామం ఇవ్వకుండా. అర్థమైందా?"

దివాకరు తలూపాడు. వెంటనే ఇద్దరూ సీటుమీద పడుకుని రివాల్వర్స్ కిటికీలోంచి బయటికి గురిపెట్టి, మరు క్షణం చకచక ట్రిగర్ లాగడం ప్రారంభించారు...

చెట్లమధ్యనుంచి భయంకరమైన అరుపులు! దిక్కు లన్నీ మార్మోగుతున్నాయి! దివాకరు,కుమారులు కేరింతలు కొడుతూ టపాకాయలు కాలుస్తున్నట్టు రివాల్వర్స్ పేలు స్తున్నారు. ఒకదాని వెంట ఒకటి వెలువడుతున్న బుల్లెట్స్ చెట్లలోకి దూసుకుపోతోంటే బదులుగా చావు కేకలు విన్పిస్తున్నాయి!

మూడునిముషాల తర్వాత ఫైరింగు ముగిసింది.

ఎక్కడికక్కడ సద్దుమణిగింది.

"ఇప్పుడేం చేద్దాం - అందరూ చచ్చారో లేదో. ఆ తర్వాత చెట్టును తొలగించి బయలుదేరుదాం."

# 8

ఇద్దరూ రివాల్వర్స్ సిద్ధంగా పట్టుకుని ఎడమవేపు కారు దిగారు.

ఆ సమయంలో ఎటునుంచీ ఏ వాహనాలు రాక పోవడం మంచిదే అయింది.

రోడ్డుమీద గబగబ ప్రాకుతూ కుడివేపుకు వెళ్ళారు. ఆ తర్వాత నెమ్మదిగా ఏటవాలుగా వున్న డొంకలోకి దొర్లారు. దివాకర్ 'అమ్మా!' అని మూల్గాడు.

"ఏం జరిగింది మిస్టర్?" కుమారడిగాడు.

"ఏదో...ఏదో...గుచ్చుకుంది. ఏమిటిది? మైగాడ్!"

కుమార్ దివాకర్ చేతిలోకి చూశాడు. ఏదో గుండ్రంగా పాత్రలా కన్పించింది. దివాకరు మళ్ళీ అరిచాడు: "మైగాడ్! మైక! మైకపెట్టి మోసం చేశారు!"

కుమార్ చటుక్కున దివాకర్ చేతిలోని మైక లాక్కున్నాడు.

అప్పుడే వెనకనుంచి మాటలు విన్పించాయి, "అర్కే, మైక డ్యామేజీ కాలేదు కదా?"

కుమార్, దివాకర్లు ఉలికిపడి తలలెత్తారు. చుట్టూ తుపాకులతో శత్రువులు దర్శనమిచ్చారు. వాళ్ళలో ఒక ముప్ఫైఏళ్ళ స్త్రీవుంది. ఆమె జీన్సు ధరించింది. చేతిలో రివాల్వరు వుంది.

కుమారు, దివాకర్కి ఏమీ చేయడానికి పాలుపోలేదు. తాము షూట్ చేస్తే, వాళ్ళు షూట్ చేస్తారు.

కుమారు మైక చేతబట్టి లేచి నిలబడ్డాడు. దానికున్న ఎలక్ట్రిక్ తీగ తెంపేసి, "ఎవరు తల్లీ నువ్వు?" అనడిగాడు.

"రాణిని_చంబల్ లోయ రాణిని!" గర్జించిందామె.

"నువ్వెవరైనా మమ్మల్ని ఫూల్స్ చేసినందుకు చేతు లెత్తి దండం పెట్టాలి!"

"సరే! ఇద్దరూ పైకి రండి! రివాల్వర్సు కింద పడే యండి" ఆజ్ఞాపించిందామె.

దివాకరు, కుమారులు అలాగే చేశారు.

రాణి దొంగలముఠా మొత్తం ఎనిమిదిమంది. అందరి వద్దా తుపాకులున్నాయి. అవన్నీ గురిపెట్టివున్నాయి.

రాణి తన మనుషులలో ముగ్గుర్ని ఉద్దేశించి అంది, "వెళ్ళండి! ఆ చెట్టు తొలగించి కారు సోదా చెయ్యండి! ప్రతిపార్టూ, ప్రతి అంగుళమూ!"

ముగ్గురు తలలూపి వెళ్ళిపోయారు.

"ఆర్కే. నా పథకం బావుంది కదూ?"

నవ్వాడు ఆర్కే, "చాలా బావుంది! చాలా చాలా బావుంది!"

"హేళన చేస్తున్నావా? ఏమిటి నీ వుద్దేశ్యం?"

"ఆ పెయింటింగ్ నీకు దొరకదు!"

"ఎక్కడవుంది?"

"నాకు తెలియదు."

"ఎవరికి తెలుసు?"

"ఎవరికీ తెలియదు."

"అయితే నువ్వెక్కడికి వెళుతున్నావు?"

"మద్రాసుకి."

"ఎందుకు?"

"నీకెందుకు? అది రహస్యం."

"ఎలాటి రహస్యం?"

"అడగడానికి నువ్వెవరు?"

"నీ మృత్యువుని. ఆ పెయింటింగ్ యెక్కడవుందో చెప్పు మర్యాదగా."

"నాకు మార్యాద అంటే తెలియదు."

రాణి క్రూరంగా మాసింది. "జానీ, వీళ్ళిద్దర్ని సోదా చెయ్."

జానీ ముందు దివాకర్ని సోదా చేశాడు. అతని జేబుల్లోంచి రివాల్వరు, సిగారు లైటరు, డైరీ, కలమూ, లైసెన్స్, సిగరెట్ పెట్టె మొదలయినవి తీశాడు. ఆ తర్వాత కుమార్ని సోదా చేశాడు. కానీ ఏమీ లభించలేదు, అగ్గిపెట్టె, సిగరెట్ పెట్టె తప్ప.

"ఓకే! ఆర్కే, నువ్వు బట్టలు విప్పెయ్యి" ఆజ్ఞా

పించింది రాణి, "పెయింటింగ్ నువ్వెక్కడో దాచి వుంటావు."

కుమార్ చిన్నగా నవ్వాడు. "విత్ ప్లెజర్! నగ్నత్వం నాకు చాలా ఇష్టం. అందులోనూ చక్కటి వెన్నెల వుంది, ఎదురుగా నీ అందమయిన విగ్రహముంది. ఇంకేం"

కుమార్ షర్టువిప్పి అవతలకి విసిరి, బెల్టువిప్పి పాంట్ జిప్ లాగాడు. పాంట్ మోకాళ్ళవరకు జారిపోయింది. ఆ తర్వాత అండర్‌వియర్ మీద చెయ్యివేసి ఎలాస్టిక్ లాగబోతుండగా రాణి అర్చింది. "ఆగు, నువ్వు బట్టలు పూర్తిగా విప్పనవసరంలేదు."

"లేదు లేదు. నీముందు పూర్తి నగ్నంగా నిలబడ తాను. అలాగయితేనే ఒప్పుకో."

"హే భగవాన్," రాణి కుడిచెయ్యి ఎత్తి నుదుటి మీద మూడుసార్లు కొట్టుకొంది, "జానీ, పెయింటింగ్ వీళ్ళదగ్గర లేదు."

"మరెక్కడ వుంది?"

రాణి కారువేపు చూసింది. "కాలియా, దొరికిందా" అనర్చింది.

"లేదు" సమాధానం వచ్చింది. "కార్లో యెక్కడా లేదు."

కాస్సేపయ్యాక కారులో సోదాచేసిన ముగ్గురూ తిరిగి వచ్చి కారులో శవాలున్నాయని చెప్పారు.

రాణి కుమార్ని ఆత్రంగా చూసింది.

"ఆ శవాలు మా మనుషులవి" దివాకరన్నాడు.

రాణికళ్ళు మెరిశాయి. "వెరీగుడ్! అక్కో, పెయింటింగ్ నీదగ్గరగానీ, కారులోగానీ లేదు. ఇప్పుడుచెప్పు, పెయింటింగు ఎక్కడవుందో చెప్తావా? నీ ఫ్రెండుని చంపేయమంటావా?"

దివాకరు వులిక్కిపడి కుమార్ని చూశాడు. కుమారు సాలోచనగా తలూపాడు.

"ఆర్కే, చెప్పకు. నన్ను చంపనీ" దివాకరర్చాడు.

కుమారు జాలిగా చూశాడు.

"ఆర్కే, మూడు నిమిషాలు సమయమిస్తున్నాను," రాణి అంది.

"ఆర్కే, చెప్పకు." మళ్ళీ అర్చాడు దివాకర్.

రాణి పకపక నవ్వింది, "నిమిషం గడిచింది," అందామె.

ఆమె అనుచరులంతా తుపాకులు గురిపెట్టి నిలబడ్డారు వలయాకారంలో.

"రెండు నిమిషాలు!"

కుమార్ మాట్లాడలేదు. పరిసరాలన్నీ ప్రశాంతంగా వున్నాయి. కానీ కుమారు, దివాకర్ల చుట్టూ ఉద్రిక్తత అలుముకుని వుంది. కుమారుకి తెలుసు, మూడు నిమిషాలు గడిచాక తను చెప్పకపోతే దివాకర్ని కాల్చేస్తారని.

కాబట్టి ఈ పరిస్థితినుంచి తప్పించుకోవాలంటే ఏదో ఒకటి చేయాలి. బుకాయించాలి. నాటకమాడాలి. శత్రువుల్ని బోల్తాకొట్టించి పలాయనం చిత్తగించాలి. అంతే, కుమారు ఈ నిశ్చయానికివచ్చి మూడవ నిముషం కోసం కాచుకున్నాడు.

"ఆర్కే, సమయం దగ్గరపడుతోంది" రాణి అర్చింది "నీ తెలివితేటల గురించి నాకు తెలుసు. నేనెప్పుడూ నీతో తలబడకపోయినా నీతో గెలవగలనన్న నమ్మకం వుంది. నిజానికి పెయింటింగు నువ్వు కూడా తీసుకెళ్ళడం లేదు. మమ్మల్ని తప్పుదోవ పట్టించడానికి, మా బారి నుంచి దాన్ని రక్షించటానికి సిటీలో నే ఎక్కడో దాచి

వాట్టి చేతులతో బయలదేరావు. నువ్వు మద్రాసు చేరుకున్నాక ఆ పెయింటింగు సులభంగా అందుకొనే ఏర్పాటేదో చేశావు. అదిప్పుడు ఫెయిలయింది. ఆర్కే నువ్వు యిప్పుడు..."

"సమయం దాటిపోయింది, నాలుగు నిముషాలు," అరిచారెవరో వెనకనుంచి.

అందరూ వులికిపడి చూశారు. కానీ అప్పటికే ఆలస్యమైంది. రివాల్వర్ పెద్దగా చప్పుడుచేస్తూ పేలడమూ, బుల్లెట్ రాణి కంఠంలో దూసుకపోవడం, ఆమె కింద పడి గిలగిల తన్నుకుని ప్రాణాలు విడవడమూ జరిగిపోయాయి...

ఆమె అనుచరులు కేకలు పెడుతూ తుపాకులు పేల్చారు.

కుమార్, దివాకర్లు తటాలున నేలమీద పడుకున్నారు. తుపాకులు, రివాల్వర్లు మోగుతున్నాయి. ఒకరి తర్వాత ఒకరు రాణి అనుచరులు నేలకూలుతున్నారు. కుమార్, దివాకర్లు వేగంగా పాకుతూ రోడ్డుచేరుకొని కారెక్కేశారు.

ఇరువర్గాలమధ్య పోరాటం ఇంకా సాగుతూనేవుంది. కుమారు కారు స్టార్టుచేసి ముందుకు దూకించాడు. అరవై కిలోమీటర్ల వేగంతో రెండునిమిషాలు ప్రయాణించాక కాల్పులు వినిపించలేదు.

అప్పుడు కుదుట పడ్డారిద్దరూ.

కానీ ఇప్పుడు ఇద్దరిదగ్గరా రివాల్వర్లు లేవు.

ఇకముందు ఎదురయ్యే దుండగుల్ని వొట్టి చేతులతో ఎదుర్కోవాలి.

"వెరీగుడ్, మిస్టర్ ఇర్కే," వినిపించాయి మాటలు.

కుమారు తలతిప్పి దివాకర్ని చూశాడు. దివాకరు

గాభరాగా చూస్తున్నాడు. "ఏమిటి మిస్టర్?" కుమా రడిగాడు.

"మాట్లాడిందెవరు?" దివాకరన్నాడు తికమకగా.

"వెనక్కి తిరిగి చూడండి!" మళ్ళీ విన్పించాయి మాటలు.

కుమారు వేగం తగ్గించి వెనక్కి తిరిగి చూశాడు.

వెనకసీట్లో గబ్బర్‌సింగ్ కూచోని వున్నాడునవ్వుతూ చేతిలో ఆటోమాటిక్ రివాల్వరు పట్టుకొని.

అతని కాళ్ళదగ్గర సింగ్, రామ్మోల శవాలున్నాయి.

# 9

కుమార్ కారాపేసి దివాకర్ని గబ్బర్సింగుకి పరిచయం చేశాడు. ఆ తర్వాత, సరిగ్గా సమయానికి వచ్చి దేవుడిలా తమని కాపాడినందుకు కృతిజ్ఞతలు తెలుపుతూ చార్మినారు ఆఫరు చేశాడు.

గబ్బర్ చార్మినారు వెలిగించి గర్వంగా అన్నాడు. "మిస్టర్ ఆర్కే, నువ్వింతగా నన్ను పొగడ నవసరం లేదు. పొగడ్త నా ప్రథమ శత్రువు. ఇక బిజినెస్ మాట్లాడుకుందాం."

"ఏమిటి నీ కోరిక?"

దివాకరిద్దర్ని జాగ్రత్తగా గమనిస్తూన్నాడు.

"పెయింటింగ్ కావాలి." గబ్బరన్నాడు స్పష్టంగా.

"దానికోసం నువ్వెందుకు శ్రమపడాలి? దాన్ని ఎవరు కాజేసినా నీబాస్‌కే అమ్ముతారుకదా?" కుమారన్నాడు.

గబ్బరు తలూపాడు, "అవును, మా బాస్‌కే అమ్ముతారు. అయితే ఇక్కడ నీకో విషయం చెప్పాలి. నాకు అవకాశం చిక్కినపుడల్లా మా బాస్‌కి పొడుపు సేర్పుతుంటాను. ఆ పెయింటింగు నీ దగ్గర ఎవరయినా కాజేసి

బాస్‌కి అమ్మాలనుకుంటే లక్షల రూపాయలు అడుగుతారు.

ఎక్కడో దిక్కుమాలినచోట దొరికిన ఆ గుడ్డపీలికకి లక్షల రూపాయలా! నో, నో. బాస్‌కి పిచ్చెక్కింది. ఆ పెయింటింగు ఎవరు తెచ్చినా అయిదులక్షలు యిచ్చి కొంటాననని పట్టుబట్టాడు. నేను చివాట్లుపెట్టి, ఆ పెయింటింగు పుణ్యానికి తెస్తానని చెప్పాను. అతను ఒప్పుకున్నాడు. నేనిలా వచ్చాను..."

"ఇప్పుడతను ఎక్కడున్నాడు?"

"వాకోసం కాచుకున్నాడు. మనం త్వరగా వెళ్ళాలి"

"సారీ, నేను రాలేను."

"ఎందుకు?"

"మీకు కావలసింది నాదగ్గర లేదు."

"నీకు కావలసింది నాదగ్గరవుంది."

కుమార్ నవ్వాడు. "నేను డబ్బుకి అమ్ముడుపోను. డబ్బుని బహుమతిగా స్వీకరిస్తాను."

"నా దగ్గర వున్నదీ, నీకిచ్చేదీ డబ్బుకాదు."

"మరి?"

"ప్రాణాలు - అరవైమంది ప్రాణాలు."

కుమార్ తీక్షణంగా చూశాడు. "ఏమిటి, నన్ను ట్రాప్‌లో ఇరికిస్తున్నావా?"

"అవును. నీతో ఎలా వ్యవహరించాలో నాకు తెలుసు. ఇంతవరకు నీమీద దాడి జరిపిన వారెవరికీ తెలియదు. అందుకే చచ్చిపోయారు. నా పథకాలు స్టాండర్డుగా వుంటాయి. ఎవర్ని ఎక్కడ గురిచూసికొట్టాలో అక్కడే కొట్టాలి. సరయిన రిజల్టువస్తుంది. నేను నీ బలహీనతను కనిపెట్టాను."

"ఏమిటి నా బలహీనత?"

"సాటి మనుషుల ప్రాణాలు. అమాయకులు నీ కళ్ళ ముందు గిలగిలతన్నుకుని చచ్చిపోతుంటే వాళ్ళని రక్షించ డానికి నువ్వు ప్రాణాలయినా ఇస్తావు. ఇక ఆ పెయిం టింగు ఎంత? నువ్వు దౌర్జన్యం చేస్తావు కాని దౌర్జన్యం సహించవు. అది నీ బలహీనత. ఒప్పుకొంటావా?"

కుమార్ ఆలోచించాడు. బాస్టర్డ్, ఈ టక్కరినక్క ప్రాణాలతో వ్యాపారం చేస్తున్నాడు!

"ఒప్పుకొంటాను." చివరకి అన్నాడు కుమార్. "అయితే ఎవరి ప్రాణాలగురించి నువ్వు మాట్లాడేది?"

"ప్రయాణీకుల ప్రాణాల గురించి! కారు స్టార్టుచెయ్. పదికిలోమీటర్లు డ్రయివ్ చెయ్. ఎడమవేపు 16వ నెంబరు రాయి కన్పిస్తుంది. అక్కడనుండి అడ్డరోడ్డు గుండా రెండు కిలోమీటర్లు—అంతే, అక్కడ మా క్యాంపు కన్పిస్తుంది. నువ్వు నేను చెప్పినట్టు మాత్రమే చెయ్యాలి. నీ ట్రిక్కులతో గారడీ చెయ్యకూడదు. నా చేతిలో ఆటోమేటిక్ వుంది. అరవైమంది ప్రాణాలు రక్షించే బాధ్యత నీ చేతిలో వుంది. అర్థమయిందా? లెటజ్ గో!"

కుమార్ భారంగా నిట్టూర్చి కారు స్టార్టు చేశాడు. దివాకర్ తటస్థంగా కూచుండిపోయాడు. అతని మెదడు ఎప్పుడో మొద్దుబారింది. గబ్బరుసింగ్ తన కొవ్వుబలిసిన శరీరాన్ని కారు కుదుపులకి అనుగుణంగా వూపుతూ విలా సంగా సిగరెట్టు తాగుతున్నాడు.

పావుగంట తర్వాత కారు గబ్బర్సింగు క్యాంపు చేరుకొంది.

చుట్టూ దట్టమయిన చెట్లు, కంద ఏపుగా పెరిగినగడ్డి, పైన వెండిలా మెరుస్తున్న చంద్రుడు.

చంద్రుడి వెన్నెల్లో అక్కడి దృశ్యమంతా స్పష్టంగా కన్పిస్తోంది.

ఒకదానిపక్కన ఒకటి మూడు అంబాసిడరు కార్లు ఆగివున్నాయి. వాటిలో ఎవరూ లేరు. వాటికి పదిగజాల దూరాన ఒక R.T.C. ఎక్స్‌ప్రెస్ ఆగివుంది.

బస్సులో లైట్లు వెలుగుతున్నాయి. లోపల మనుషులు స్పష్టంగా కన్పిస్తున్నారు. బస్సులో అక్కడక్కడ కొందరు సాయుధ వ్యక్తులున్నారు. అంతేగాక బస్సు చుట్టూకూడా నిలబడి వున్నారు.

కుమార్ అంబాసిడర్ను ప్రక్కన కారాపి, గబ్బ ర్సింగు కేసి చూశాడు. ఇంతలో కారు దగ్గరకి నలుగురు సాయుధవ్యక్తులు వచ్చారు. వాళ్ళ ఆజ్ఞానుసారం, కుమార్, దివాకర్లు కారుదిగి చేతులెత్తి నిలబడ్డారు. ఆ తర్వాత గబ్బర్ దిగి బస్సువేపుకి నడిచాడు.

వైజాగ్ నుంచి హైదరాబాదు వెళుతూ గబ్బర్సింగ్ చే హైజాక్ చెయ్యబడ్డ ఆ బస్సులోని ప్రయాణీకులు ప్రతి క్షణం ఒకగండంలా గడుపుతున్నారు. భయంకరమైన నిశ్శబ్దం. సమయం మూడున్నర.

"మిస్టర్ ఆర్కే!" గబ్బరరిచాడు గొంతు చించు కొని. "నా మాటలు జాగ్రత్తగా విను! ఈ బస్సులో మొత్తం అరవయిమంది వున్నారు, రెండేళ్ళ పసిపాపల నుంచి అరవై ఏళ్ళ ముసలివాళ్ళ వరకు! ప్రాణాలు తీయా లనుకుంటే మాకు వయోభేదం లేదు. నేనెంత కిరాతకు డినో నీకు తెలుసు. పుట్టలో నే పసిపాపల పీకలునొక్క గల దుర్మార్గుడ్ని నేను.

"ఆర్కే! మనిద్దరిమధ్య శత్రుత్వం యెప్పుడూ లేదు. ఎప్పుడూ కోరుకోనుకూడా. నువ్వెంత చెడ్డవాడివయినా

నీలో మానవత్వముంది. నువ్విప్పుడు మానవత్వ దృష్టితో ఆలోచించు.

"అరవైమంది ప్రాణాలముందు ఆ పెయింటింగు ఏపాటి విలువ చేస్తుంది? ఆ పెయింటింగు కోసం ఇందరి ప్రాణాలు బలియిచ్చి నువ్వొక్క క్షణం నిశ్చింతగా వుండ గలవా? మనశ్శాంతి వుంటుందా? వుండదు! అనుక్షణం నిన్ను ఈ అరవైమంది ఆత్మలు వెంటాడి, వేటాడి పీక్కు తింటాయి. కుమిలి కుమిలి చివరికి నువ్వు పిచ్చివాడవై పోతావో, చచ్చిపోతావో!

"కాబట్టి, నీ బాగుకోరి నేను చెబుతున్నాను, ఆ పెయింటింగు నా కిచ్చెయ్! నీకొచ్చే నష్టమేమీ వుండదు! డబ్బుగలవాళ్ళ అభిరుచులు అమాయక ప్రాణాలు బలి గొనకూడదు! నువ్వాలాటి పరిస్థితిలో చిక్కుకుని పెయిం టింగుని మాకప్పగించావో చెబితే జీవన్ తృప్తిచెందు తాడు. పైగా నిన్ను అభినందిస్తాడు – అతని కారణంగా అరవైమంది ప్రాణాలు పోగొట్టుకునే పరిస్థితిని తప్పించి నందుకు. జీవన్ సినీ ప్రొడ్యూసరు. అతనిలో మానవత్వం రవంతైనా వుండితీరాలి!"

గబ్బర్‌సింగ్ కొన్నిక్షణాలు ఆగాడు వూపిరి పీల్చు కోడానికి.

అతని మాటలు అందరూ వూపిరి బిగబట్టి, చెవులప్ప గించి వింటున్నారు.

గబ్బర్ మళ్ళీ అన్నాడు. "పెయింటింగు నా పరం చేయకపోతే, ఈ అరవైమందినీ నీ కళ్ళముందు కాల్చేసి, బస్సుతోసహా తగులబెట్టేస్తాం. నిన్నేమీ చేయం. పైగా ఆ పెయింటింగు అడగను. ఆలోచించు!"

కుమార్ తేలిగ్గా నవ్వేశాడు. "గబ్బర్! నీ మెదడులో

పేదతప్పు ఏమీలేదు. ఓ.కే. ఆ పెయింటింగు యివ్వడం నాకిష్టంలేదు. ఈ అరవై మందిని కాల్చేయ్!" ఫకాలున నవ్వాడు కుమార్. "ఆ తర్వాత నేను నిన్ను కాల్చక పోతే ఒట్టు! నువ్వు నన్నేమీ చేయనని మాటిచ్చావు. పైగా పెయింటింగు అడగవు! నువ్వేమీ చెయ్యక పోయినా నేను నీ అంతు చూసి నిద్రపోతాను. ఓ. కే.? ఇక అందర్నీ చంపేయ్!"

"కుమార్!" దివాకరర్చాడు గాభరాగా.

"భయపడకు మిస్టర్!" కుమారరర్చాడు కోపంతో.

"ఆల్ రైట్, ఆర్కే!" గబ్బరన్నాడు. గంభీరంగా, "నువ్వు నన్ను పరిహాసిస్తున్నావు! ఫలితం యిప్పుడే చూస్తావు!".

గబ్బర్ బస్సులో ఎక్కి ప్రయాణీకుల్ని పరీక్షగా చూశాడు. ప్రయాణీకులలో ఎవరికీ నోటమాట పెగలడం లేదు. కళ్ళప్పగించి వూపిరి పీల్చడం మరిచిపోయి చూస్తున్నారు.

గబ్బర్ ముందుకు కదిలి ఒక ముప్ఫైఏళ్ళ స్త్రీ ఒళ్ళో నుంచి రెండేళ్ళ పిల్లావాడ్ని లాక్కున్నాడు. ఆమె 'కెవ్వు'మని అర్చి మూర్ఛపోయింది. గబ్బర్ అనుచరులు కూచున్న చోటునుంచి కదిలితే కాల్చేస్తామని హెచ్చరించారు.

గబ్బర్ పిల్లవాడితో బస్సు దిగాడు. పిల్లవాడి ముఖంలో భయంలేదు. కనుపాపల్ని వేగంగా కదిలిస్తూ అక్కడున్న వాళ్ళందర్నీ వింతగా, అమాయకంగా చూస్తున్నాడు.

దివాకర్ శరీరం చల్లబడింది. జరగబోయే దారుణాన్ని అపమని చెప్పడానికి అతని గొంతు సహకరించలేదు.

తనే స్వయంగా ముందుకువెళ్ళి రక్షించాలనుకుంటే కాళ్లు కదలనీయకుండా నేలకతుక్కుపోయాయి.

కుమారు కళ్ళు పిల్లవాడిమీద వున్నాయి. తను నిర్ణయం మార్చుకోకపోతే అతని ప్రాణాలు పోవడం ఖాయం! గబ్బర్ స్వభావం తనకి తెలుసు.

"అర్కే!" గబ్బర్ అర్చాడు. "ఒక్కొక్కర్ని నీ కళ్ళముందు ఇలాగే చంపుతాను!" అని రివాల్వరుని పిల్లవాడి నుదుటిమీద ఆన్చాడు. "నువ్వు నాశక్తిని తక్కువ అంచనా వేయడం తప్పని తక్షణం తెలుసుకో! వెంటనే క్షమాపణ కోరుకుని అడిగింది ఇచ్చేయి! లేదా ఒకటి - రెండు - మూడు లెక్కబెట్టి - "

"కుమార్! కుమార్!" దివాకరు అరుపు ప్రతిధ్వనించింది. "చెప్పేయ్! అదెక్కడుందో చెప్పేయ్! ఆ దుర్మార్గుడు అతన్ని చంపేస్తాడు! ప్లీజ్, కుమార్! ఇప్పుడు నువ్వు ఓటమి అంగీకరించాలి! ఆ పెయింటింగు మనకి వద్దు! అసలీ వ్యవహారం ఏమిటో ఏమో తెలియని ఆ పసివాడి ప్రాణాలు కాపాడాలి!"

"దివాకర్!" కుమారర్చాడు. "గబ్బర్ ఆ పిల్లాడ్ని చంపడు! అతని గురించి నీకో రహస్యం చెప్పాలి: గబ్బర్ కోతలరాయుడు. కిరాతకుడు కాడు! పురిట్లోనే పసిపిల్లల పీకలునొక్కే దుర్మార్గుడు కాడు. వట్టికోతల రాయుడు! తుంటరినక్క!"

దానితో గబ్బర్ యింకా రెచ్చిపోయాడు. "రాస్కెల్! నీకు అవకాశాలు ఇస్తున్నకొద్దీ మితిమీరి పోతున్నావు!" అనరిచి, పిల్లవాడ్ని కిందికి దించి, అతని నుదుటికి రివాల్వరు ఆన్చి, "ఒకటి!" అనరార్చాడు.

దివాకరు ఛటుక్కున కుమార్ మీదికి దూకి అతన్ని

కిందికి పడేశాడు. కుమార్ వెల్లకిలా పడడంతో, దివాకర్ అతని కాళ్ళమీద కూచోని గొంతు పుచ్చుకున్నాడు.

"బాస్ర్! చెప్పేయ్!"

కుమార్ అతికష్టంమీద వూపిరి పీలుస్తూ దివాకర్‌ని వెనక్కి నెట్టాడు. దివాకర్ వెల్లకిలా పడి నేలకేసి తల గుద్దుకున్నాడు. మరుక్షణం కళ్ళు తేలేసి తెలివి తప్పాడు.

"రెండు" గబ్బర్ అంటున్నాడు.

కుమార్ లేచి నిలబడి బట్టలు దులుపుకున్నాడు. అతని చుట్టూవున్న దుండగులు రివాల్వర్స్ గురిపెట్టారు. కుమార్ వాళ్ళందర్నీ ఒకసారి చూసి ఆతర్వాత పిల్లవాడ్నీ, గబ్బర్‌నీ చూశాడు.

"ఆల్ రైట్! ఆ అబ్బాయిని వదిలేయ్!" అన్నాడు భారంగా నిట్టూర్చి.

"వెరీగుడ్!" గబ్బర్ అన్నాడు.

కుమార్ వంగి ప్యాంటు ఎడమకాలి మోకాలు వరకు లేపి, మోకాలు కింద చుట్టి, తాడుకట్టివున్న పెయింటింగుని విప్పి, గబ్బర్ కేసి విసిరాడు.

గబ్బర్‌తో సహా అతని అనుచరులంతా ఆశ్చర్యంగా చూశారు.

# 10

తెల తెలవారుతుండగా ఇద్దరూ తిరిగి సిటీ చేరుకొన్నారు కారులో. అలసిపోయిన ముఖాలతో, చిరిగిపోయిన బట్టలతో, రేగిపోయిన జుత్తుతో వాళ్ళఅవతారం చూసేవాళ్ళకి అసహ్యం పుట్టించేలావుంది.

కుమార్ పెయింటింగుని గబ్బర్‌సింగు పరంచేసాక

దివాకర్ని కారులో వేసుకొని బయలుదేరాడు. సిటీదగ్గర పడుతోందనగా వెనుకనుంచి హైజాక్ చేయబడ్డ బస్సు దాని వెనక గబ్బరు ముఠాకి చెందిన కారులు ఓవరు టేక్ చేసి వెళ్ళాయి.

ఆ తర్వాత బెంజి కారు ఓవరు టేక్ చేసింది. అందులో ధరమ్‌చంద్, గబ్బరుసింగులు వున్నారు. ధరమ్ సంతోషము పట్టలేక పెయింటింగుని కిటికీలోంచి బయటకు వూపుతూ, "ఏయ్ కుమార్ యిటు చూడు! యిటూ!!" అనరాచాడు.

కుమారు శరీరం అవమానంతో కుతకుతలాడింది. సిటీ దగ్గరపడ్డాక దివాకర్ తెలివిలోకి వచ్చి ఏం జరిగిందో అడిగి తెలుసుకున్నాడు. ఆ తర్వాత కుమారుని అభినందించాడు. కుమారెక్కువగా మాట్లాడలేదు.

సుమారు ఆరు గంటలకి కారు జీవన్‌రావ్ కాటేజి చేరుకుంది. రామ్సే, సింగ్‌ల శవాలు కార్లో అలాగే వున్నాయి.

ఇద్దరూ కారుదిగి కాటేజ్ తలుపు దగ్గర ఆగి ముఖాలు చూసుకున్నారు. ఆ తర్వాత కుమార్ కాలింగ్ బెల్ నొక్కాడు.

"ఎవరు?" అంది స్త్రీ కంఠం లోపలినుంచి.

"మిస్టర్ ఆర్కే. తలుపు తెరువ్!" కసిరాడు కుమార్.

కొన్నిక్షణాలు గడిచాక తలుపు తెరుచుకుంది.

ఎదురుగా జీవన్‌రావ్ నిలబడి వున్నాడు. అతని వాలకం చూస్తూంటే యెక్కడికో బయలుదేరుతున్నట్టు వున్నాడు. కుమార్ని చూసి వులికిపడ్డా, ఆ వులికిపాటుని దాచుకోడానికి ఎంతో ప్రయత్నించాడు. బలహీనపు నవ్వు విసిరి, "ఆర్కే, ఏమిటిలా వచ్చావు?" అన్నాడు.

"సారీ మిస్టర్! పెయింటింగు పోయింది...ధరమ్ చేతిలోకి."

జీవన్ రావ్ అదిరిపడ్డాడు.

అతని ముఖం కందిపోయింది.

పెదవులు వణికాయి. ఊగిపోతున్న శరీరాన్ని అతి కష్టంమీద సంబాళించుకుని, "ఎంతిచ్చాడు? డబ్బెంత ఇచ్చాడు?" అనడిగాడు.

"ఏమీ యివ్వలేదు. మేం అడగలేదు" కుమారంటున్నాడే గాని, అతనికళ్ళు కదిని పరిశీలనగా పరికిస్తున్నాయి.

గాయత్రీదేవి గార్డెన్ చైర్ లో కూచొని ఆపిల్ తింటున్నదల్లా కుమారు మాటలు విని ఉలికిపడింది. ఆమె గాభరాగా లేవబోతుండగా మోకాళ్ళు టీపాయ్ కి తగిలి దానిమీది సూట్ కేసు కిందపడింది...

దురదృష్టవశాత్తు సూట్ కేసు క్లిప్స్ బిగించిలేవు. తటాలున మూత తెరుచుకుని అందులోని వస్తువులు బయటపడ్డాయ్. కుమారుకళ్ళు పెద్దవయ్యాయ్ కిందపడ్డ వస్తువులు, కాస్మెటిక్స్ సరంజామా, కొన్ని కాయితాలు యింకా ఒక నీలిరంగు కాన్వాస్ చుట్ట వున్నాయి.

జీవన్, గాయిత్రి కొయ్యబారి చూస్తున్నారు. కుమార్ చిన్నగా నవ్వి దివాకర్ కి సైగచేసి లోనికి నడిచాడు. కిందపడ్డ వస్తువుల్లోంచి కాన్వాస్ చుట్ట అందుకున్నాడు. చుట్టవిప్పి చూశాడు.

'ఒందు బెళిదింగళ్ కతల్ హాగతే' పెయింటింగ్!

"వాట్!" దివాకర్ షాక్ తిని అర్చాడు.

జీవన్ కంగారుగా వచ్చి చైర్ లో కూలబడ్డాడు. ఆ తర్వాత ముఖంలో ఎలాటిభావాలూ కన్పించనీయకుండా పకపక నవ్వాడు.

"అదీ! ప్లానంటే అలాగుండాలి!" సంతోషంతో అరుస్తున్నాడతను. "ఓహ్! నేను వూహించింది నిజమే అయ్యింది! హ. హ. ఈ ప్లాను నేను వేయకపోతే ఒరిజినల్ పెయింటింగు ధరమ్‌కి చిక్కివుండేది! ఆ పెయింటింగు వేలం వేస్తారని తెలిసిన వెంటనే దాని డూప్లికేట్ తయారుచేయించాను! పెయింటింగు నేను కొంటే అందరూ నా వెంటపడతారని తెలుసు. నా వస్తువుల్ని రక్షించుకునే హక్కు నాకుంది! డామిట్! ఆర్కే, ధరమ్ దగ్గరవున్నది ఒరిజనల్ కాదు!"

"బాస్టర్డ్!" దివాకరర్చాడు. "ఈ రహస్యం మాకెందుకు చెప్పలేదు?"

"డామిట్! చెప్పే అవసరం నాకేమిటి? మీకు డబ్బిస్తానని ప్రామిస్ చేశాను!" తనని తాను సమర్థించుకుంటూ జీవన్ అర్చాడు.

"మరి నా పార్ట్‌నర్స్ గురించి ఏమిటి? ఆ డూప్లికేట్ పెయింటింగుకోసం వాళ్ళు చచ్చారా? డూప్లికేట్ కోసం గాడ్! ఆర్కే! ఆ పనికిరాని పెయింటింగుకోసం ఎంతమంది ప్రాణాలర్పించుకున్నారు! చివరికి—చివరికి—ఆ పసివాడి ప్రాణాలుకూడా. ఓహ్! ఆర్కే ఈ బిజినెస్‌లో అసలు విలన్ వీడు! వీడ్ని చంపెయ్యాలి!"

కుమార్ వంగి టీపాయ్‌మీద ఆపిల్ కోసే కత్తి తీసి దివాకరుకి అందించాడు, "చంపు!"

"దివాకర్! ఆర్కే! నన్ను చంపకండి!"

"నీ తెలివిమాలిన పథకంవలన ఎంతమంది ప్రాణాలు కోల్పోయారో తెలుసా?" కుమారడిగాడు, "బాస్టర్డ్! అది డూప్లికేట్ అని మాకు చెబితే ఈ వ్యవహారాన్ని మరోవిధంగా హాండిల్ చేసేవాళ్ళం కదా? అప్పుడీ చచ్చినవాళ్ళంతా బ్రతికివుండే వారు కదా?"

"పొరపాటయిపోయింది కుమార్! క్షమించు!"

"సరే, డబ్బిలా ఇవ్వు!" కుమారన్నాడు చెయ్యిచాచి.

"డబ్బు! నా దగ్గరలేదు! మద్రాసు వెళ్ళాక—"

"చెక్కు వ్రాయ్!" కుమారర్చాడు.

గాయత్రి భయంతో అర్చింది: "ఏమండీ! వాడికళ్ళు చూడండి! మిమ్మల్ని చంపేస్తాడు! చెక్కు ఇచ్చేయండి!"

కిందపడ్డ వస్తువుల్లోంచి చెక్కు-బుక్ ఏరి తీశాడు జీవన్. ఆ తర్వాత వణుకుతున్న చేతితో కుమారుకీ, దివాకరుకీ చెరో పదివేలకి చెక్కు వ్రాసి యిచ్చాడు. కుమారు వాటిని అందుకుని జేబులో వేసుకున్నాడు.

"పెయింటింగు...?" గాభరాగా అడిగాడు జీవన్, కుమార్చేతిలోని పెయింటింగు చూస్తూ.

కుమారు దివాకర్చేతిలోని కత్తి తీసుకుని పక్కనూరి, ఒక అడుగు ముందుకేశాడు.

"సాధారణంగా నాతో దాగుడుమూతలు ఆడినవారిని చంపకుండా వదలను!"

గాయత్రి కెవ్వుమంది, "వాడు చంపుతాడండీ!"

"పోకులాడీ అరవక" కుమారన్నాడు ప్రశాంతంగా. "కానీ జీవన్—నీ విషయంలో అలా చెయ్యను. నీకు బుద్ధి చెప్తాను. నీ వెధవ పెయింటింగు కోసం ఇందరి ప్రాణాలు బలిగొన్నందుకు జీవితాంతం కృంగికృశించి నశించేలా బుద్ధి చెప్తాను."

కుమారు పెయింటింగును దివాకరుకి యిచ్చి విప్పి పట్టుకోమన్నాడు. జీవన్ వొంటినిండా చెమటలు కారుతున్నాయి. దివాకరు పెయింటింగుని విప్పిపట్టుకోగానే కుమారు కత్తితో దాన్ని పొడిచాడు.

"కుమార్! ఆ పని చెయ్యకు! దాన్ని నాశనం

చెయ్యకు!'' జీవన్ ఎగిరి గంతేసి కుమార్ చేతులు పట్టుకుని అరుస్తున్నాడు.

కుమార్ తాపీగా పెయింటింగుని పోట్లు పొడుస్తున్నాడు. ఆ తర్వాత కత్తి విసిరేసి, పెయింటింగుని పీలుకలుగా చించేసి జీవన్ రావ్ మీదికి విసిరాడు.

''కుమార్! అన్యాయం చేశావ్! నీకు డబ్బిచ్చాను!'' జీవన్ యింకా అరుస్తున్నాడు.

జీవన్ కళ్ళలో నీళ్ళు చూసి, హేళనగా నవ్వి, దివాకరు భుజం మీద చెయ్యివేసి బయటికి నడిచాడు రమేష్‌కుమార్.

అంతటితో 'ఒక వెన్నెలరాత్రి' చరిత్ర అంతమైంది.

—: ఐపోయింది :—

# మృత్యులేఖ!

అజీజ్

"మిస్టర్ సుగంధరావ్!

ఈ ఉత్తరాన్ని నువ్వు చదవడం పూర్తిచేసేలోపల నా నూరేళ్ళ జీవితాన్ని ఈ పాతికేళ్ళలోనే అంతం జేసుకోవాలని నిశ్చయించుకున్నాను.

అంతేకాదు, నా కడుపులో పెరుగుతున్న నీ ప్రతిరూపం కూడా నాతోబాటు అంతమౌతుంది. ఎందుకో తెలుసా? ఎప్పుడైతే ఈ రూపానికి నువ్వు 'తండ్రి' అనే అనుబంధపు లంకె వెయ్యడానికి నిరాకరించావో అప్పుడే ఆ ఆకృతి ఈ లోకంలో సజీవంగా కళ్ళు తెరిచే అర్హత కోల్పోయింది!

నిన్ను నమ్మేను. నిలువునా మోసపోయేను. అంతా అజ్ఞానం! పామరత్వం! నువ్వు నా యజమానివనీ, నేను నీ ఆఫీసులో నెలసరి భత్యంమీద పనిచేస్తూ, నీ కరుణా కటాక్షాలమీద బ్రతికే సామాన్య స్టెనోగ్రాఫర్నని తెలిసీ, నీకు భార్యా పిల్లలున్నారని తెలిసీ, నీ మాయ

మాటల్లోపడి బంగారు ఉచ్చులో బిగుసుకున్నానంటే, అదంతా నా అమాయకత్వం, మూర్ఖత్వం కాక మరేమిటి?

నీవు మేకతోలు కప్పుకున్న పులివి. పైకి స్త్రీ జనోద్ధరణకోసమే అవతారం ఎత్తినట్టూ, బడుగుజీవుల్ని ఉద్ధరించడానికే పుట్టినట్టూ ఒకదంపుడు ఉపన్యాసాలిస్తూ, అటు జనం అభిమానాన్ని చూరగొంటూ ఇటు రాజకీయ రంగంలో పునాదులు వేసుకుంటూ, లోలోన నా వంటి అమాయికలనెందర్ని కబళిస్తున్నావో ఎవ్వరికి తెలుసు?

నేనీ లోకానికి ఇహ మొహంచూపే అర్హత కోల్పోయాను. లజ్జాకర జీవితం గడుపుతూ, అనుక్షణం నరకాన్ని అనుభవించడంకంటే, క్షణికమైన మరణంతో స్వర్గాన్ని చేరడం మేలు.

నీవీ ఉత్తరం చదివేలోపల నా నిర్జీవశరీరం నా పడగదిలో మంచంమీద శాశ్వతనిద్రపోతూ వుంటుంది. నీలో ఏ కాస్త మానవత్వం, పశ్చాత్తాప హృదయం, పాపభీతీ వున్నా ఇకముందు నా వంటి అమాయికల జీవితాలతో చెలగాటమాడకు. మరణిస్తూ నేను కోరే చివరికోరిక ఇదే.

నా ఆత్మహత్యకి కారణాలేమిటో తెల్పే ఉత్తరమేదీ నేను వదిలి వెళ్ళడంలేదు. నీ బ్రతుకు బజారుపాలుచేసే నిదర్శనాలేవీ వదలడంలేదు. ఈ వుత్తరాన్ని కూడా కాల్చిపడేయ్!

పత్రికలకూ, పోలీసులకూ నీ నిగూఢ నిర్వాకాలు తెల్పుతూ ఉత్తరాలు రాసివుంటే, నీకీ లోకంలో పుట్టగతులుకూడా వుండవు. ఏ ఎలక్షన్లో నిలబడి గద్దె నెక్కుదామని కలలు కంటున్నావో ఆ ఎలక్షన్లో నీ నామరూపాలుకూడా మిగలవు.

నీ మీద ప్రతీకారం తీర్చుకుందామనే ఉద్దేశం నాకే కోశానా లేదు. నా మంచితనమే నీకు శిక్ష. తీరని శిక్ష!

సెలవు

నిన్ను నమ్మి నష్టేట్లో మునిగిన—

క్షీరవేణి"

ఉత్తరం చదవడం పూర్తికాగానే సుగంధరావు వేళ్ళు అప్రయత్నంగా వణకడం ప్రారంభించాయి. గుండె గతి వేగం అందుకుంది. దిగ్భ్రాంతితో అతని కళ్ళు అవసరానికి మించి పెద్దవయ్యాయి.

పదినిమిషాల క్రితమే అతను ఆఫీసులో అడుగుపెట్టాడు. రాగానే టేబిల్ మీద పేపరువెయిట్ కింద పెట్టివున్న ఆ ఉత్తరంమీద పడింది దృష్టి!

కొంపదీసి తనకన్నా ముందు ఇంకెవ్వరూ చదవలేదు కదా దీన్ని? తనకన్నా పదినిమిషాలు ముందే వచ్చేస్తుంది స్టాఫంతా ఆఫీసుకి.

ప్యూన్ని పిల్చి కనుక్కుందామని కాలింగ్ బెల్ నొక్కాడు. అతను రాగానే, "ఈ వుత్తరం ఎవరు పెట్టారిక్కడ?" అడిగాడు.

"ఉత్తరమా? నేను పెట్టలేదు సార్!" అన్నాడు ప్యూన్ నోరు తెరుస్తూ.

"మరి ఎలా వచ్చిందిక్కడికి? నా కన్నా ముందు ఎవరైనా వచ్చారా?"

"లేదండి!"

"ఆఫీసు తెరిచాక నువ్వెక్కడికైనా వెళ్ళావా?"

"ఔనండి. ఆఫీసు తెరవగానే టేబిలూ, కుర్చీలూ తుడిచి, కూజాలో మంచినీళ్ళు నింపుకురావడానికెళ్ళానండి. అప్పుడే ఎవ్వరైనా..." నీళ్ళు నమిలాడు ప్యూన్.

"అఘోరించావు. ఆఫీసులో మిగతావాళ్ళంతా వచ్చేశారా?"

"మేనేజరుగారితో సహా అందరూ వచ్చేశారండి."

"ఐతే, క్షీరవేణి ఇంకా ఎందుకు రాలేదు?"

"ఇప్పటిదాకా నేనూ అదే అనుకుంటున్నానండి. ఆవిడ ఉద్యోగంలో చేరిన ఈ మూడేళ్ళలోనూ ఎప్పుడూ ఇలా జరగలేదండి. మీకన్నా పదినిమిషాల ముందు ఠంచనుగా వచ్చేసే ఓరండి. మీరేమో ఈ రోజు..."

టేబిల్ మీది టెలిఫోన్ దగ్గరికి లాక్కుని రిసీవరందుకున్నాడు సుగంధరావు. గబగబ క్షీరవేణి ఫ్లాట్‌కు రింగ్ చేసి, రిసీవరు చెవికానించేడు. రెండు నిమిషాలు గడిచినా అవతలినించి రెస్పాన్స్ లేదు!

ఇంట్లో ఫోన్ మోగుతున్న శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది. సుగంధరావు గుండెలో దడ ప్రారంభమైంది. నిశ్శబ్దంగా రిసీవర్ని రెస్టుమీదుంచాడు. అతని కళ్ళల్లో నిర్జీవంగా మంచంమీద పడున్న క్షీరవేణి శవం కదులుతోంది!

ఫ్యాన్ గాలికి టేబిల్ మీద రెపరెపలాడుతున్న ఉత్తరంమీద పడింది అతనిదృష్టి. ఎట్టి పరిస్థితిలోనూ ఈ ఉత్తరం మరో ప్రాణికంట పడకూడదు. దీనివల్ల తన సోషల్ పొలిటికల్ కెరియర్ మీద తీవ్రమైన కళంకం పులుముకునే ప్రమాదముంది!

అంతెందుకు, తనే మరొక్కసారి దాన్ని చదివితే, తనమీద తనకే అనుమానం కలగవచ్చు!! ఫ్యాన్ని పంపేసి, టేబిల్ మించి లైటర్, ఉత్తరం అందుకున్నాడు. లైటర్ వెలిగించి ఉత్తరం కొస అంటించాడు.

అరతావు సైజు తెల్లకాగితం మీద ముత్యాలవంటి అక్షరాలతో రాసిన ఉత్తరం అది. కాగితం అంటుకో

గానే మంటల్తో బాటు తెల్లనిపొగ బైలుదేరింది. సుగంధ రావు దగ్గేడు.

దగ్గు క్రమంగా పొరలుపొరలుగా రాసాగింది. అవతల కూర్చొన్న ఫ్యాన్ ఆ దగ్గువిని ఎక్కడ పరిగెత్తుక వస్తాడో అని అరచేత్తో నోరు అదుముకున్నాడు. దాంతో ఉత్తరం రాస్తా చేతిలోంచి జారి కిందపడింది. ఇంకా సగం కాలకుండానే మంట ఆరిపోసాగింది.

## 2

"దొరగారు వచ్చేశారా?" అన్న కంఠం విని, స్టూల్ మీద కూర్చున్న ఫ్యాన్ ఉలిక్కిపడి తలెత్తాడు.

క్షీరవేణి!

"పావుగంట క్రితమే వచ్చేరండి. మిమ్మల్నడిగేరు. మీ ఇంటికి ఫోనుకూడా చేసినట్టున్నారండి" అన్నాడు ఫ్యాన్ లేచినిలబడుతూ.

"నేనింకా రాలేదని చెప్పలేదు కదా?"

"లేదండి!"

"ఇంటనుంచి పావుగంటముందే బైలుదేరాను. దార్లో ఓ జులాయి వెధవ అల్లరిపెడితే పెద్దగొడవ జరిగింది. అందుకే ఇంత ఆలస్యమయ్యాను."

"అయ్యో, ఆ వెధవని ముక్కలిరగదన్నారా, లేదా?"

"తన్నేవారే! తప్పించుకున్నాడు రాస్కెల్! ఐనా, వాడి కారు నెంబరు నోట్ చేసుకున్నాన్లే! అయ్యగారితో చెప్పి పోలీస్ కంప్లైంట్ ఇవ్వాలి" అంటూ స్ప్రింగ్ డోర్సు ముందాగి, "మే ఐ కమిన్ సర్?" అంది క్షీరవేణి.

లోపలినించి జవాబు లేదు.

క్షీరవేణి కనుబొమలు ముడిపడ్డాయి.

ప్రశ్నార్థకంగా చూసింది ఫ్యాన్ వైపు.

"లోపలే వున్నారండి" చెప్పాడతను స్వరం తగ్గించి.

"మే ఐ కమిన్ సర్?" అంది క్షీరవేణి మళ్ళీ.

నిశ్శబ్దం!

తను ఆలస్యంగా రావడంవల్ల ఆయనకోపం వచ్చి, పలకడం లేదేమో అనుకుంటూ సందేహిస్తూనే స్ప్రింగు డోర్స్ తోసుకుంటూ లోన అడుగుపెట్టింది.

మరుక్షణం ఆశ్చర్యంతో ఆమె కళ్ళు పెద్దవయ్యాయి'

సుగంధరావు టేబిల్ మీద తల ఆనించి కూర్చునున్నాడు.

నిశ్శబ్దంగా!! చలనరహితంగా!!!

ఒంట్లో బాగులేదేమో? అనుకొంటూ కొద్దిగా దగ్గ— "సార్!" పిల్చింది నెమ్మదిగా.

ఐనా, సుగంధరావులో ఉలుకూ, పలుకూ లేదు.

"సార్!" మళ్ళీ పిల్చింది.

జవాబు శూన్యం!

అతని దగ్గరికెళ్ళి తట్టేంతటి చనువు లేదామెకు. అందుకే, ప్యూన్ని కేకేసి లోపలికి పిల్చింది. అతను రాగానే అయోమయంగా ఆయనవైపు సైగ చేసింది.

"బాబుగారూ!" అంటూ సుగంధరావుని సమీపించేడు ప్యూన్.

అప్పుడు పడింది క్షీరవేణి దృష్టి, నేలమీద సగం కాలిన కాగితంమీద. వేలుపెడితే ధూళి తగలనంత నీట్ గా వుండే ఈ ఆఫీసుగదిలో ఓ కాగితం కాలి పడుంటమా?

టేబిల్ కింద వేస్ట్ బాక్స్ వుంటుంది. సుగంధరావు వేస్ట్ కాగితాలని వుండగా చుట్టి అందులో పడేస్తాడుగానీ ఇలా కాల్చిపారేయడం ఇదివరకెన్నడూ జరగ లేదు.

సూదిమొనంత అశుభ్రత కూడా ఆమోదించని ఆయన యిలా ఎందుకు చేశాడు? అలోచిస్తూ ఆ కాగితం అందుకుంది.

అప్రయత్నంగా ఆమె దృష్టి అందులో రాసున్న చివరి నాలుగు పంక్తులమీద పడింది.

'నీ మీద పగతీర్చుకుందామనే ఉద్దేశం నాకే కోశానా లేదు. నా మంచితనమే నీకు శిక్ష! తీరని శిక్ష!!

సెలవు

నిన్ను నమ్మి నట్టేట్లో మునిగిన—

క్షీరవేణి.'

ఆశ్చర్యంతో క్షీరవేణి కళ్ళు విప్పారేయి. తాను రాసిందా ఈ ఉత్తరం? ఎప్పుడు? గబగబ మిగిలిన పంక్తులు కూడా చదివేసింది. అందులోని సారాంశం ఆమె ఆశ్చర్యాన్ని ఇంకింత అనుమోదింప చేసింది!

తాను గర్భవతా? హవ్వ! అదీ సుగంధరావువల్లా? ఇక్కడ ఉద్యోగంలో చేరిన ఈ మూడేళ్ళలో ఏ నాడూ తనని పరీక్షగా కన్నెత్తి చూడని సుగంధరావుమీద ఇటువంటి నీతి బాహ్యమైన నింద మోపుతుందా తను?

ఎవ్వరు రాసుంటారిది? వుంది. తప్పకుండా యిందులో ఏదో గూడుపుఠాణీ వుంది...

అదే సమయంలో—"అమ్మగారూ?" అన్న ప్యూన్ గావుకేకతో ఉలిక్కిపడింది.

"దొరగారు చచ్చిపోయారండి!"

పక్కలో పిడుగుపడ్డట్టు అదిరిపడింది క్షీరవేణి. మరుక్షణం తనచేతిలోవున్న ఉత్తరం తాచుపాములా తోచిందామెకు.

చటుక్కున దాన్ని హాండ్ బాగులో పడేసి, "వెంటనే అందరికీ తెలియజెయ్!" అంటూ గబగబ బైటికి నడిచింది.

మరుక్షణం ఆ బిల్డింగులో పనిచేస్తున్న స్టాఫంతా ప్రళయం ముంచుకువచ్చినట్లు అక్కడికి పరిగెత్తు కొచ్చారు. కంపెనీ మేనేజర్ యోగానంద్ అందర్నీ బైటికి పంపి, టేబిల్ మీద టెలిఫోన్ అందుకుని, పోలీసులకి ఫోన్ జేశాడు.

పదినిమిషాల్లో వచ్చేశాయి పోలీస్ జీప్, అంబులెన్స్!

"శవాన్ని మొదట ఎవరు చూశారు?" అడిగాడు క్రయింబ్రాంచి ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి ఆఫీసులో అడుగు పెడుతూ.

"క్షీరవేణీ, ఆఫీసు ప్యూన్!" అంటూ వాళ్ళని పిలిపించి, ఇన్‌స్పెక్టర్‌కు పరిచయం చేశాడు మేనేజరు.

ప్యూన్ ద్వారా కొన్ని నోటెడ్ పాయింట్స్ దొరికాయి ఇన్‌స్పెక్టరుకు.

సుగంధరావు ఆఫీసుకు రాగానే అతన్ని లోనికి పిల్చి ఏదో ఉత్తరం గురించి వాకబ్ చేశాడు.

తరవాత క్షీరవేణి గురించి అడిగాడు. ఆమె యింకా రాలేదని తెలిసి హడావుడిగా ఎవ్వరికో ఫోన్ చేశాడు. మరుక్షణం ఆయన మొహం రంగులు మారింది. ప్యూన్ని వెళ్ళిపొమ్మన్నాడు...

రోజూ క్రమం తప్పకుండా కరెక్ట్ టైంకు ఆఫీసులో వుండే క్షీరవేణి ఆరోజు అరగంట ఆలస్యంగా వచ్చింది!

ఇన్‌స్పెక్టర్ కళ్ళు చకచక టేబులుమీద వెదికాయి. సుగంధరావు ప్యూన్‌కు చూపిన ఉత్తరమేదీ లేదు టేబులుమీద, ఆయన శవం తప్ప.

"ఉత్తరం ఎక్కడుంది?" అడిగేడు ఇన్‌స్పెక్టర్ ప్యూన్ని.

"ఇక్కడే వుండాలండి. ఆయన సాయంగా చూపేరు నాకు" అన్నాడు ప్యూన్ ఆశ్చర్యంగా.

కింద కలయజూశాడు ఇన్స్పెక్టర్. అప్పుడు పడిందతని దృష్టి, నేలమీద కొద్దిగా కాలినకాగితపు బూడిద మీద. వంగి చూసేడు పరీక్షగా. బూడిదగా మారిన ఆ ముక్కల్లో చేతివ్రాత స్పష్టంగా కనిపిస్తోంది.

వేస్ట్బాక్స్లోంచి చిన్నకాగితం అందుకుని, ఆ బూడిదని అందులోకి ఊది పొట్లం కట్టి జేబులో వేసుకున్నాడు.

పోలీస్ డాక్టరు శవం ఒగర్మార్టన్ని పరీక్షించడం, ఫింగర్ ప్రింట్ ఎక్స్పర్ట్స్, ఫోటోగ్రాఫర్సు చకచక తమ పనులు ముగించడం, శవం స్ట్రెచర్మీద అంబులెన్స్లోకి తరలివెళ్ళడం నిమిషాలమీద జరిగిపోయాయి.

అందర్నీ బైటికి పంపి, క్షీరవేణిని కూర్చోబెట్టి రొటీన్ క్వశ్చన్స్ ప్రారంభించేడు ఇన్స్పెక్టర్.

"మీరిక్కడ అపాయింట్ అయి ఎన్నాళ్ళయింది?"

"మూడేళ్ళు!"

"ఎన్నడూ ఆఫీసుకు ఆలస్యంగా రానిమీరు, ఈరోజు లేటయ్యారు! కారణం?"

"ఇంటినించి పావుగంట ముందే బైలుదేరాను. దార్లో ఓ పోకిరీ వెధవ అల్లరిపెడితే గొడవ జరిగింది. నలుగురూ గుమిగూడేసరికి వాడు కారెక్కి పారిపోయాడు. నేనా కారు నెంబరు నోట్ చేసుకున్నాను" అంటూ తన హాండ్ బాగులోంచి డైరీతీసి నెంబరు చూపెట్టింది క్షీరవేణి.

నెంబరు ఎ.జెడ్. 14520. బ్లూ ఫియట్ కారు.

ఆ వివరాలు తన డైరీలో ఎక్కించేడు ఇన్స్పెక్టరు.

డైరీని హాండ్బాగులో పడేసి, సగంకాలిన ఆ వుత్తరం బైటికి తీసింది క్షీరవేణి.

"ఏమిటిది?" ఇన్స్పెక్టర్ కనుబొమలు ముడిపడ్డాయి.

తను ఆఫీసులో అడుగుపెట్టడం, సుగంధరావు నిశ్చలంగా కూర్చునుండటం, నేలమీద కొద్దిగా కాలిపడున్న ఆ ఉత్తరం కనిపించడం పూసగుచ్చినట్టు వివరించింది క్షీరవేణి.

దాన్నందుకుని పరిశీలించిన ఇన్‌స్పెక్టర్ కళ్ళు ఆశ్చర్యంతో విప్పారేయి.

"కింద మీ సంతకం వుంది. మీరు రాయలేదంటారా ఈ ఉత్తరం?"

"లేదు. అసలు మా మధ్య అటువంటి హేయమైన సంబంధం లేనే లేదు. ఎవరు రాశారో, ఎందుకు రాశారో నాకేటూ అర్థం కాకుండా వుంది. అందులోని హాండ్‌రైటింగు నాది కాదు."

ఇన్‌స్పెక్టర్ నవ్వి—"ఇటువంటి ఉత్తరాలు రాసేటప్పుడు హాండ్‌రైటింగు మార్చడం పెద్దసమస్య కాదే! మరొకరిచేత రాయించే అవకాశం కూడా వుంది కదా?"

"అదే నిజమైతే నా అంతట నేను ఆ ఉత్తరం తీసి మీకు దేనికి చూపిస్తాను? ఐనా ప్రాణాలతో నిక్షేపంగా వుండి, ఆయనమీద అటువంటి అభాండాలు వేస్తూ ఆత్మహత్య చేసుకుంటున్నానని రాసే ఖర్మ నాకేం పట్టింది? గిట్టని వాళ్ళెవ్వరో పనిగట్టుకుని ఇటువంటి పోకిరీపనికి దిగి ఉంటారని నా అనుమానం!"

ఇన్‌స్పెక్టర్ బుర్ర చురుగ్గా పనిచెయ్యసాగింది. ఉత్తరాన్ని మరోసారి పరిశీలించేడు. అక్షరాలు అందంగా, పొందికగా, గుండ్రంగా వున్నాయి. ఆత్మహత్య చేసుకోబోతున్న వ్యక్తి అంత నింపాదిగా, ఆహ్లాదంగా అక్షరాలు కూర్చి రాయలేడు.

క్షీరవేణి వాదం సమంజసంగానే వుంది. ఐతే,

ఎవ్వరు చేసుంటారీ పని? రోజూ రంచనుగా ఆఫీసుకు వచ్చే క్షీరవేణికి ఆ రోజు ఓ రోడ్ సైడ్ రోమియోవల్ల ఆలస్యమైంది.

ఉత్తరం పోస్టులో రాలేదు. ఫ్యాన్ కూజా నింపుకు రావడానికి బైటకెళ్ళినప్పుడే ఎవ్వరో చడీచప్పుడు కాకుండా ఆఫీసులో ప్రవేశించి టేబులుపైన పెట్టి వెళ్ళుంటారు.

సుగంధరావు రాగానే దాన్ని చూసేడు. చదివేడు. కాల్చేడు. ఐతే, అది పూర్తిగా కాలకముందే నేలమీద దేనికి పడేశాడు? ఉత్తరం కాలుతున్నప్పుడే అతని ప్రాణం పోయిందా? ఎలా? హార్ట్ ఎటాకా?

పోస్ట్ మార్టం రిపోర్టందేవరకూ ఇదమిదంగా ఏమీ తెలియదు. తెలియని మిస్టరీ అల్లా ఈ ఉత్తరమే! ఎవ్వరు రాశారు? ఎందుకు రాశారు? అతన్ని అపఖ్యాతిపాలు చెయ్యడానికా?

మద్రాసు మహానగరంలో సుగంధరావు గురించి తెలియనివాళ్ళు బహుఅరుదు. నగరంలో పెద్ద బిజినెస్ మాగ్నెట్స్‌లో ఆయనొకరు. 'ఎస్. ఆర్. ఇంపోర్ట్ అండ్ ఎక్స్‌పోర్ట్' అనే పెద్ద సంస్థ ఆయన యజమాని. అంతేకాదు, కొద్దిరోజుల్లో జరగబోయే ఎం. పీ. ఎలక్షన్స్‌లో కోడంబాకం నియోజక వర్గంనుండి పోటీ చెయ్యబోతున్నాడాయన. ఆ ఎలక్షన్స్‌లో సుగంధరావు అవలీలగా గెలుస్తాడని అందరూ అనుకొంటున్నారు.

అందుకు కారణం లేకపోలేదు. అతనిది మచ్చలేని క్యారెక్టర్. ఇటు ప్రజల్లోనూ, అటు ప్రభుత్వం దృష్టిలోనూ ఆయనకు మంచి ఖ్యాతివుంది. స్వచ్ఛంద సేవా సంస్థలెన్నిటికో ఆయన చేతికి ఎముక లేకుండా ధన

సహాయం చేశాడు. అనాధ శరణాలయాలెన్నిటికో భూరి విరాళాలిచ్చాడు.

రాజకీయాల్లో ప్రవేశించింది కూడా ఆయన మిత్రుల బలవంతం మీదనే! ఆ ఎన్నికల్లో ఆయన ప్రత్యర్థిగా డాక్టర్ గోపాలవర్మ పోటీ చేస్తున్నాడు. సుగంధరావు ముందు అతను ఘోరపరాజయం పొందక తప్పదనీ, చిత్తుగా ఓడి తీరతాడనీ, డిపాజిట్ కూడా దక్కదనీ, ఇప్పటినించే చెవులు కొరుక్కుంటున్నారు జనం!

సుగంధరావుగాక, ఇంకెవరైనా ఈ ఎన్నికల్లో నిలబడుంటే గోపాలవర్మ తప్పకుండా గెలిచే అవకాశా లున్నాయని రాజకీయ పరిశీలకుల అభిప్రాయం.

అటువంటి సుగంధరావు ఇలా హఠాత్తుగా చనిపోయాడని తెలిస్తే నగరమంతా నిర్ఘాంతపోదూ?

ఆలోచనలు కట్టిపెట్టి, క్షీరవేణి వైపు చూశాడు ఇన్‌స్పెక్టర్. "దార్లో మిమ్మల్ని అటకాయించి అల్లరి పెట్టిన యువకుడెలా వుంటాడు?" అడిగేడు.

"సుమారు పాతికేళ్ళుంటాయి. చామనఛాయ. నార్మల్ హైట్. లావు పెదాలు. హిప్పీ జులపాలు. ఎడం చెంపమీద ఎప్పుడో దెబ్బతగిలి కుట్లు వేసిన గాయం. ఇదీ అతని అవతారం"

అవసరమైతే మళ్ళీ వచ్చి కలుసుకుంటానని చెప్పి, ఆమె చిరునామా, ఫోన్ నెంబరు నోట్ చేసుకుని, అక్కణ్ణించి బైలుదేరాడు ఇన్‌స్పెక్టరు.

# 3

హెడ్ క్వార్టర్స్ చేరగానే దేవిడ్‌ని పిల్చి, క్షీరవేణి యిచ్చిన కారునెంబరు రాసిచ్చి, ఆ కారు ఎవరిదో కనుక్కోవలసిందిగా పురమాయించాడు.

అంతలో సుగంధరావు శవం తాలూకు పోస్టుమార్టం రిపోర్టు అందింది. ఆ రిపోర్టు చదివేక, ఇన్‌స్పెక్టర్ బుర్ర గిరగిర తిరగసాగింది.

సుగంధరావుది సహజమరణం కాదు!

హార్టుఎటాక్ అంతకన్నా కాదు.

విషప్రయోగం జరిగింది.

ఐతే, విషం జీర్ణకోశంలోగానీ, ప్రేవుల్లోగానీ ఎక్కడా కానరాలేదు. ఇంజక్షన్ రూపంలో శరీరంలోకి యివ్వబడలేదు. కేవలం కంఠనాళికలోనూ, ఊపిరి తిత్తుల్లోనూ అక్కడక్కడ అతుక్కునుంది.

ఇన్‌స్పెక్టర్ మస్తిష్కంలో సవాలక్ష సందేహాలూ, అనుమానాలూ ఉవ్వెత్తున లేచి పడసాగాయి.

ఈ హత్య ఎలా జరిగింది?

సుగంధరావు ఆఫీసులో అడుగు పెట్టినప్పటినించీ, క్షీరవేణి పిల్చేవరకూ ప్యూన్ బైటేవున్నాడు. ఆమె తప్ప లోనికెవ్వరూ వెళ్ళలేదు.

ఇతరులకు విషప్రయోగం చేసే అవకాశాలేవీ లేవు.

ఐతే, అతని ఊపిరితిత్తుల్లో ఎలా చేరింది విషం?

తీవ్రంగా ఆలోచిస్తున్న ఇన్‌స్పెక్టరు బుర్రలో తళుక్కుమంది ఓ ఆలోచన.

సుగంధరావు టేబులుమీద దొరికిన ఆ ఉత్తరం తీసి చూసేడు పరీక్షగా. వెంటనే ఓ ఐడియా స్ఫురించింది. సాలోచనగా తలూపుతూ లేచి నిల్చున్నాడు కుర్చీలోంచి.

అదేసమయంలో సార్జంట్ డేవిడ్ స్ప్రింగు డోర్సు తోసుకుంటూ లోనికి వచ్చి "ఆ కారు ఎవ్వరిదో కను క్కున్నాను సార్" అన్నాడు.

"ఎవ్వరిది?"

"ప్రొఫెసర్ పాండురంగానిది."

"గుడ్. అతని అడ్రస్ ఏమిటి?"

"డోర్ నెంబరు 3-1-146, తంబుచెట్టి స్ట్రీట్."

"ప్రొఫెసర్ వయసెంతుంటుంది?"

"నలభై నలభైఅయిదు మధ్య."

"బహుశా, ఆ యువకుడు అతని ఇంటివాడే అయుం టాడు. సరే, ఇప్పుడు నేనో ప్రయోగం చెయ్యబోతు న్నాను. పద నా ఇంటికి" అంటూ సార్జంట్‌ని వెంట బెట్టుకుని జీప్ ఎక్కాడు ఇన్‌స్పెక్టర్.

ఇల్లు చేరగానే నౌకర్ని పిలిచి, "కిచన్ రూంలో ఎలకలబోను పెట్టావా?" అడిచాడు.

"పెట్టానండి."

"ఏమైనా పడ్డాయా అందులో?"

నౌకరు నెత్తిగోక్కుని, "చూశ్చేదండి" అన్నాడు.

"చూడు. పడితే బోనూ, ఓ టవల్ పట్రా."

సార్జంట్‌కూ, నౌఖరుకూ ఇన్‌స్పెక్టర్ ధోరణి వింతగా తోచింది. మారుమాటాడకుండా లోనికెళ్ళి, రెండు నిమి షాల్లో తిరిగి వచ్చాడు నౌకరు. అతని చేతిలో ఎలకల బోనూ, ఓ టర్కీ టవల్ వున్నాయి.

"ఒక్కటే పడిందండి" అంటూ తెచ్చి టేబులు మీదుంచాడు.

బోనులో బందీ అయిన ఎలక, తప్పించుకోడానికి మార్గంకోసం నానాప్రయత్నాలూ చేస్తోంది. ఇన్‌స్పెక్టర్ జేబులోంచి ఆ వుత్తరం తీసి, అందులో పైభాగం సగం చింపి, లైటర్‌తో అంటించి, చటుక్కున బోనులో పడేసి, బోనుచుట్టూ టవలుకప్పి ముక్కు మూసుకున్నాడు.

ఆశ్చర్యంతో కళ్ళు విప్పార్చి, ఆ చర్యలు చూస్తూ నిల్చున్నాడు సార్జంట్.

ఐదునిమిషాల తరవాత, బోనుమీద కప్పిన టవలు తీసేశాడు ఇన్‌స్పెక్టర్.

దిగ్భ్రాంతితో సార్జంట్ నోరు తెరుచుకుంది.

బోనులో అంతవరకూ అటూయిటూ గెంతుతున్న ఎలక —

ఇప్పుడు చచ్చిపడుంది.

ఇన్‌స్పెక్టరు పెదాలపై మందహాసం మెరిసి మాయ మయింది.

నౌఖరుద్వారా ఆ బోను అక్కడ్నించి తీయించి, సార్జంటుని కూర్చోమని సైగ చేశాడు.

"మనం మొదట అనుకున్నట్టు సుగంధరావుది సహజ మరణంకాదు. పదహారణాల హత్య. ఇంతవరకూ ఎవరూ అనుసరించని ఓ కొత్తపంథాలో పటిష్టమయిన పథకం వేసి ఆ హత్య జరపబడింది.

ఆయనకు రాయబడ్డ ఉత్తరం మామూలు ఉత్తరం కాదు. మృత్యులేఖ! ఆ ఉత్తరం రాసిన యింకులో అత్యంత ప్రమాదకరమయిన విషం కలపబడింది. ఆ విషం లోని ప్రత్యేకత ఏమిటంటే, దాన్ని ఏ వస్తువుమీదైనా చిలికి, ఆ వస్తువును కాలిస్తే తక్షణం అది విషతుల్యమైన గ్యాస్ విడుదల చేస్తుంది. ఆ గ్యాస్ పీల్చినప్రాణి మరణించడానికి అరక్షణం పట్టదు.

ఈ పద్ధతినే సుగంధరావు హత్యకు వినియోగించారు. ఆ విషం కలిపిన ఇంకుతో అతనిలో విపరీతమైన భయాందోళనలు కలిగేలా ఉత్తరం రాశారు. ఆఫీసు ప్యూను నీళ్ళు నింపుకు రావడానికి బయిటకెళ్ళిన అదను చూసి, నిశ్శబ్దంగా దాన్ని తీసుకెళ్ళి, టేబిల్ మీదుంచారు.

అతను రాగానే ముందా ఉత్తరంమీద దృష్టిపడింది.

చదివాడు. నిర్ఘాంతపోయాడు. సందేహ నివృత్తికోసం క్షీరవేణి ఇంటికి ఫోన్ చేశాడు. ఆమె పలక్కపోయేసరికి నిజంగానే ఆత్మహత్య చేసుకొనుంటుందని భ్రమపడి, తన పరువు నట్టేట్లో కలిపే ఆ ఉత్తరాన్ని నామరూపాలు లేకుండా చెయ్యాలనే ఉద్దేశంతో కాల్చి బూడిద చేద్దామని నిప్పంటించాడు.

మరుక్షణం విషం తన ప్రభావాన్ని చూపెట్టింది. నిప్పంటుకోగానే అది ఉత్పత్తిచేసిన గ్యాస్ సుగంధ రావు ఊపిరిగుండా అతనిలో ప్రవేశించింది. టేబిల్ మీద అలాగే ఒరిగిపోయాడు. కాలుతున్న కాగితం చేతిలోంచి జారి కిందపడి ఆరిపోయింది.

ఇక్కడ మనం తర్కించవలసిన పాయింట్స్ యేమిటంటే, హంతకుడు సుగంధరావుని భయపెట్టడానికి క్షీరవేణినే ఎందుకెన్నుకున్నాడు? అందుబాటులోవున్నదనా? ఇంటినుంచి సరిగ్గా సమయానికి బయలదేరిన ఆమెని దార్లో అల్లరిపాలు చేసింది కేవలం ఆమె సుగంధరావు కన్నా ముందు ఆఫీసుకెళ్ళ కూడదనా?

ఒకవేళ క్షీరవేణి రోజులాగే సుగంధరావుకన్నా ముందు ఆఫీసు చేరివుంటే, ఆ ఉత్తరాని కర్థం ఉండేది కాదు. సుగంధరావు ఆమె ఇంటికి ఫోన్ చేసి ఆందోళన పడేవాడుకాదు.

ఇక హత్యకు కారణం ఆలోచించాలి. కొద్దిరోజుల్లో లోకసభకు ఎన్నికలు జరగబోతున్నాయి. అందులో సుగంధరావు పోటీచెయ్యబోతున్నాడు. ఆ యెన్నికల్లో అతను గెలవడం ఖాయమని అందరూ అనుకుంటున్నారు.

అతనికి వ్యతిరేకంగా పోటీ చెయ్యబోతున్న డాక్టరు గోపాలవర్మకు ఘోరాపజయం తప్పదని వినికిడి. ఈ పరిస్థితుల దృష్ట్యా ఇది రాజకీయ హత్య ఎందుక్కాకూడదు.

తన విజయావకాశాలకు అడ్డుగోడగా దాపురించిన సుగంధరావును యేదోరీతిని మట్టుబెట్టాలన్న కసితో గోపాలవర్మ ఈ హత్యకు పథకం అల్లాడేమో? పైగా, అతను డాక్టరు. పాయిజన్స్ గురించి అతనికి తెలిసినంత క్షుణ్ణంగా మరెవ్వరికీ తెలీదు.

ఇక్కడ మరో విషయం గమనించాలి. ఆ ఉత్తరాన్ని అతనే స్వయంగా తీసికెళ్ళి సుగంధరావు బల్లమీద పెట్టి వుండడు. తన రాజకీయ ప్రత్యర్థి ఆఫీసు పరిసరాల్లోనే అతని ఉనికి ప్రమాదకరమయినది గనక!

ఆ పనికి అతను మరెవ్వరి సహాయమో తీసుకునుంటాడు. అలా సాయపడ్డ వ్యక్తి ఆ ఆఫీసు ఉద్యోగుల్లోనే ఎవరో ఎందుకు కాకూడదు? మనమక్కడకి వెళ్ళినప్పుడు నేనా వుద్యోగులందర్నీ పరిశీలించాను.

ఎందుకో ఆ కంపెనీ మేనేజరు యోగానంద్ మీద నా కనుమానం ఉంది. కారణం, యజమాని అకాల మృత్యువు ఆందోళనగానీ, విభ్రాంతిగానీ అతని మొహంలో ఏకోశానా కన్పించలేదు.

పైగా, అటువంటి సంఘటనేదో జరిగి తీరుతుందని అతనికి తెలిసివున్నట్టూ, జరగవలసిందే జరిగినట్టూ చాలా నిర్లిప్తంగా, భావరహితంగా కనిపించాడు.

నువ్వతన్నోకంట కనిపెడుతూండు. విడవకుండా ఫాలో చెయ్. ఎక్కడికి వెళ్తున్నాడు? ఎవర్ని కలుసు కుంటున్నాడు? వారిమధ్య సాగే సంభాషణ, అన్నీ నోట్ చెయ్.

ఎందుకయినా మంచిది, క్షీరవేణినికూడా ఓకంట కనిపెట్టి వుండటానికి ఓ మఫ్టీ కానిస్టేబుల్ని నియమించాలి. ముందు ఈ ఉత్తరాన్ని కెమికల్ టెస్ట్కోసం

లేబొరేటరీలో అప్పగించు" అంటూ లేచాడు ఇన్ స్పెక్టరు రాజారెడ్డి.

# 4

"ప్రొఫెసరు పాండురంగం గారున్నారు?"

"ఉన్నారండి."

"ఆయన్ని కలుసుకోవాలి," అంటూ విజిటింగ్ కార్డు నౌఖరు కందించాడు ఇన్ స్పెక్టరు రాజారెడ్డి.

"డ్రాయింగురూంలో కూర్చోండి, పిల్చుకొస్తాను," అంటూ అతన్ని లోనకూర్చబెట్టి వెళ్ళాడు నౌఖరు.

ఐదునిమిషాల తరవాత డ్రాయింగు రూంలో ప్రవేశించాడు ప్రొఫెసర్. ఏభైఏళ్ళుంటాయతనికి. క్లీన్ షేవ్. బట్టతల.

"హాలో ఇన్ స్పెక్టర్! మీ గురించి తరుచూ పత్రికల్లో చదువుతుంటాను. ఈ రోజు మీరే మా యింటికి రావడం ముదావహం. బహుశా, ఏదో ఇన్వెస్టిగేషన్ వ్యవహారమే అయుంటుంది. చెప్పండి నా వల్ల ఏం సహాయం కావాలి?" అడిగాడు సోఫాలో కూర్చుంటూ.

రాజారెడ్డి జేబులోంచి డైరీ తీసి, "నెంబరు ఎ. జెడ్. 14520 బ్లూ ఫియట్ కారు మీదే కదూ?" అడిగాడు సూటిగా.

"ఔను, మాదే."

"దాన్ని మీరుగాక యింకెవరయినా వాడతారా?"

"నేనసలు దాన్ని ముట్టుకోను. నా దగ్గర రెండు కార్లున్నాయి. నేను వాడేది గ్రీన్ అంబాసిడరు. బ్లూఫియట్ మా అబ్బాయి రవికాంత్ వాడతాడు. ఇంతకీ ఏం జరిగింది? కొంపదీసి వాడేదైనా ఏక్సిడెంట్ చెయ్యలేదు కదా?" అడిగేడు ప్రొఫెసరు ఖంగారుగా.

"నో. నో! ఏక్సిడెంట్ కేసుకాదు. నిన్న వుదయం పదిగంటల ప్రాంతంలో మీ అబ్బాయి ఎక్కడున్నాడు?"

"కాలేజి కెళ్ళాడు!"

"ఇప్పుడెక్కడున్నాడు."

"ఐదునిమిషాల క్రితమే వెళ్ళాడు కాలేజీకి."

"ఏ కాలేజీలో చదువుతున్నాడు?"

"గాంధీ మెడికల్ కాలేజ్. మెడిసన్ సెకెండియర్ స్టూడెంటు."

"థాంక్స్. వస్తాను!" అంటూ లేచాడు ఇన్‌స్పెక్టరు.

"ఇంతకీ, సంగతేమిటో చెప్పలేదు మీరు!" అన్నాడు ప్రొఫెసరు అయోమయంగా.

"నిన్న ఉదయం పదిగంటల ప్రాంతంలో ఆఫీసుకెళ్తున్న ఓ అమ్మాయిని మీ అబ్బాయి అల్లరిపెట్టాడు. ఆమె గొడవపెట్టేసరికి కార్లో పారిపోయాడు. ఆమె ఆ కారునెంబరు నోట్ చేసుకుని మాకు కంప్లైంట్ ఇచ్చింది..."

"ఓహ్ గాడ్!" అంటూ నోరు తెరిచాడు ప్రొఫెసరు.

అతన్నలా వదిలేసి జీప్ ఎక్కాడు ఇన్‌స్పెక్టరు.

పావుగంటలో చేరుకున్నాడు మెడికల్ కాలేజి.

రవికాంత్‌ను కలుసుకోవడం పెద్ద కష్టంకాలేదు. అతన్ని చూడగానే ఇన్స్పెక్టరు ఆశ్చర్యం అవధులు దాటింది. క్షీరవేణి వర్ణించిన యువకుడికీ, ఇతనికీ యెక్కడా పోలికల్లేవు!

రవికాంత్ సన్నగా, పొడుగ్గా, ఎర్రగా వున్నాడు. ఉంగరాల జుత్తు. పల్చని పెదాలు. అతని కుడిచెంప మీదగానీ, ఒంటిమీద మరెక్కడగానీ వీసమెత్తు గాయం గుర్తులేదు!

ఇన్స్పెక్టరు అందించిన విజిటింగ్ కార్డు చూడగానే, ఆశ్చర్యపోయి, "మీరు క్రయింబ్రాంచి ఇన్స్పెక్టరా? నాతో ఏంపని?" అడిగేడు అయోమయంగా.

"నెంబరు 14520 బ్లూఫియట్ మీదే కదూ?"

"ఔను."

"నిన్న ఉదయం పదిగంటల ప్రాంతంలో మీ కారు ఎవ్వరికైనా యిచ్చారా?"

"ఔను. నా స్నేహితుడు అడిగితే ఇచ్చాను."

"ఎవ్వరతను?"

"ప్రసాద్!"

"ఎందుకిచ్చారు?"

"అర్జంటు పనుందనీ, వెంటనే తిరిగొస్తాననీ చెప్పి తీసికెళ్ళాడు."

"ప్రసాద్ ఇప్పుడు కాలేజీలో వున్నాడా?"

"ఇంకా రాలేదు!"

"మరొక్క ప్రశ్న. అతని కుడిచెంపమీద కుట్టువేసిన గాయమేదైనా వుందా?"

"ఔను. ఉంది. ఇంతకీ..."

"అతని ఇల్లెక్కడో తెలుసా మీకు?"

"నుంగంబాకంలో వున్నట్టు తెలుసుగానీ, వివరాలు తెలియవు!"

"ఆల్ రైట్! వస్తాను" అంటూ కదలబోయాడు ఇన్స్పెక్టరు.

"ఇంతకీ...

"మళ్ళీ వచ్చాక చెబుతాను. దయచేసి, నేనిలా వచ్చి వెళ్ళినట్టు అతనితో చెప్పకండి" అంటూ జీప్ ఎక్కాడు ఇన్స్పెక్టరు.

# 5

పావుగంటలో డాక్టర్ గోపాలవర్మ డిస్పెన్సరీ ముందు జీపాపి దిగాడు. వరండాలో రకరకాల రోగులు బెంచీల మీద బారులుదీరి కూర్చునున్నారు. కంపౌండరు కాబోలు ఒక్కొక్కరి వివరాలు రిజిస్టరులో రాసుకుంటూ ఒకరి తర్వాత ఒకర్ని లోపలికి పంపుతున్నాడు.

"డాక్టరుగారున్నారా?" అడిగాడు ఇన్స్పెక్టరు అతన్ని.

"ఉన్నారు!"

"ఆయన్ని కలుసుకోవాలి."

"వెయిట్ ప్లీజ్!" అంటూ బెంచీవైపు చూపాడు కంపౌండరు.

ఇన్స్పెక్టరు జేబులోంచి విజిటింగుకార్డు తీసి అతని ముందు గిరాటేశాడు.

దాన్ని చూడగానే అతను తలెత్తి, "పోలీస్ ఇన్స్పెక్టరా?" అన్నాడు నోరు తెరుస్తూ.

"ఔను. డ్యూటీమీద వచ్చాను"

కంపౌండరు లేచి, "డాక్టరుగారికి చెప్పొస్తాను" అంటూ లోనికెళ్ళాడు. రెండు నిమిషాల తర్వాత తిరిగి వచ్చి, "ఎవరొచ్చినా సరే, నెంబరు ప్రకారం లోపలికి పంపమన్నారు" అన్నాడు.

కోపంతో ఇన్స్పెక్టరు ఒళ్ళు భగ్గుమంది. కంపౌండరు చెప్పింది ఖాతరు చెయ్యకుండా, బూట్సు టకటక చప్పుడు చేసుకుంటూ, కన్సల్టింగు రూమువైపు నడిచి, స్ప్రింగు డోర్సు తోసుకుంటూ లోన అడుగుపెట్టాడు.

చప్పుడు విని తలెత్తి చూసిన డాక్టరు గోపాలవర్మ నోరు తెరిచి, "నెంబరు ప్రకారం పంపమన్నానుగా?

నా దగ్గరికి ఎవ్వరొచ్చినా రూల్సు ప్రకారం నడుచుకో వలసిందే!

"ఇక్కడ డిసిప్లిన్ మేంటనెన్సు చెయ్యబడుతుంది. ఎవరో వచ్చారని రూల్సు సడలిస్తే రెండు గంటలనించీ వెయిటింగులో వున్న రోగుల గతి ఏంగాను?" అన్నాడు మొహాం చిట్లిస్తూ.

ఇన్స్పెక్టరు మౌనంగా త ఐడెంటిఫికేషన్ కార్డు తీసి అతని ముందు పడేశాడు.

"ఏమిటిది?"

"ఐడెంటిఫికేషన్ కార్డు!"

"కంపౌండరు చెప్పాడుగా మీ గురించి?"

"ఐనా మరొక్కసారి చదివి, మీ కర్తవ్యాన్ని గ్రహించండి."

డాక్టరు అయిష్టంగా ఐడెంటిఫికేషన్ కార్డందుకుని, "ఇన్స్పెక్టర్ రాజారెడ్డి ఫ్రం క్రయిం బ్రాంచ్, ఊఁ, నాతో ఏంపని?" అడిగాడు కనుబొమ లెగరేస్తూ.

"ఓ ఇన్వెస్టిగేషన్ పనిమీద మీతో మాట్లాడాలి" అంటూ కుర్చీలో చతికిలబడి జేబులోంచి సిగరెట్ తీశాడు ఇన్స్పెక్టరు.

"ఇక్కడ సిగరెట్ కాల్చకండి, ఆ వాసన నాకు పడదు" ముక్కు మూసుకున్నాడు డాక్టరు.

"ఆల్ రైట్. ఐతే, మీరు నా వెంట రండి."

"ఎక్కడికి?"

"హెడ్ క్వార్టర్సుకు."

"ఎందుకూ?

"అక్కడే తెలుస్తుంది ఎందుకో!"

"ఒక మామూలు ఇన్స్పెక్టరు నన్ను పోలీస్ హెడ్

క్వార్టర్స్‌కు తీసుకెళ్తాననటమా? ఎంత ధైర్యం! నేనెవ్వరో తెలిసే మాట్లాడుతున్నారా? లేక, అల్లాటప్పయ్య ననుకున్నారా" గుర్రుమన్నాడు డాక్టరు.

ఇన్స్‌పెక్టరు ముఖం జేవురించింది. "ఒక మామూలు ఇన్స్‌పెక్టరు అనుమానంమీద ఎంతటి వాళ్ళైనా మెడ బట్టి కటకటాల వెనక్కి తొయ్యగలడని మీకు తెలిసే వుంటుందనుకుంటాను."

"నా మీద అనుమానమా? ఏ విషయంలో?"

"మీ ప్రత్యర్థి సుగంధరావు హత్య విషయంలో!"

"సుగంధరావు హత్య చెయ్యబడ్డాడా? నిన్న వుదయం హఠాత్తుగా చనిపోయాడని పేపర్లో చదివానే!"

"అతను అకారణంగా చావలేదు. విషప్రయోగం జరిగింది. ఆ విషం సామాన్యులెవ్వరికీ అందుబాటులో వుండదని ఖచ్చితంగా చెప్పవచ్చు."

"ఐతే నేనేం చెయ్యాలి?"

"బేడీలు తొడుక్కోడానికి సిద్ధంగా వుండాలి!"

"మాటలు జాగ్రత్తగా రానివ్వండి. నన్ను అనుమానించడానికి మీ దగ్గర ఆధారాలున్నాయా?"

"కావలసినన్ని వున్నాయి! చెప్పమంటారా?"

"అఖ్ఖర్లేదు. నేనేమీ వినదల్చుకోలేదు. డి.ఎస్.పి.తో డి.ఐ.జి.తో మాట్లాడతాను. అందరూ నాకు తెలుసు. మీరిక వెళ్ళండి" అంటూ ఒక్క ఉదుటున లేచి లోపలికెళ్ళిపోయాడు డాక్టరు.

నీలాంటి వాళ్ళని ఎలా లొంగదీయాలో నాకు తెలుసు అనుకుంటూ లేచాడు ఇన్స్‌పెక్టరు.

జీప్ ఎక్కి మరోసారి మెడికల్ కాలేజికెళ్ళాడు. వాకబ్ చేస్తే ప్రసాద్ ఆ రోజు కాలేజీకి రాలేదని తెలిసింది.

అట్నుంచి తిన్నగా హెడ్ క్వార్టర్సుకు వెళ్ళి డి.ఎస్.పి.ని కలుసుకున్నాడు. ఆయనకు కేసు వివరాలన్నీ చెప్పి, డాక్టరు గోపాలవర్మ మీద తనకున్న అనుమానాలూ, అతను తనపట్ల ప్రవర్తించిన తీరూ వివరించేడు.

అంతా విన్న డి.ఎస్.పి. వెంటనే ఫోన్ దగ్గరికి లాక్కొని, డాక్టరు డిస్పెన్సరీకి రింగ్ చేశాడు.

"హలో...ఆఁ, నేను డి. ఎస్. పి. ని మాట్లాడుతున్నాను. డాక్టరుగారున్నారా డిస్పెన్సరీలో?"

"ఉన్నారండి" అవతలనించి వినిపించింది కంపౌండరు కంఠం.

"ఆయన్ని లైన్‌లోకి పిలువ్!"

"అలాగే సార్!" అవతల నిశ్శబ్దం.

రెండునిమిషాల తరవాత డాక్టరు కంఠం వినిపించింది. "హలో! డాక్టర్ గోపాలవర్మ స్పీకింగ్. డి.ఎస్.పి.గారా? నమస్కారం! నేనే మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నాను. ఇంతలో మీరే ఫోన్ చేశారు..."

డి.ఎస్.పి. అతని మాటలకడ్డుపడి, "సుగంధరావు హత్యకేసు పరిశోధిస్తున్న మా క్రైంబ్రాంచి ఇన్స్పెక్టరు రాజారెడ్డి మిమ్మల్ని కలుసుకోడానికి వస్తే అతనితో చాలా అమర్యాదగా ప్రవర్తించారుట.

ఇది సహించరాని విషయం! అనుమానంమీద ఎవ్వరైనా అరెస్టుచేసే అధికారాలు మాకున్నాయని మీరు గుర్తించాలి. మీరు పొలిటికల్ ఫీల్డులో బాగా పరపతి గలవారే కావచ్చు. అంతమాత్రాన మేము మా విద్యుక్త ధర్మాలని సడలించుకుంటామనుకోడం భ్రమ!

ఇది ఒక ప్రముఖవ్యక్తి హత్యకేసు. అందుకే యీ

కేసును ఇన్స్పెక్టరు రాజారెడ్డి కప్పగించడం జరిగింది. అతనెంతో బాధ్యతగల పోలీసాఫీసరు. అర్థం లేకుండా మిమ్మల్ని కలుసుకోడానికి వచ్చాడనడం అర్థరహితం!

మీకూ, నాకూ వున్న పరిచయం కేవలం వ్యక్తిగతం! మీకు డి. ఐ. జి. గారితో పరిచయంవున్నా, ఐ. జి. పి. గారితో పరిచయంవున్నా మా కర్తవ్య నిర్వహణలో ఏ పరిచయాలూ ప్రతిబంధకాలు కాలేవు.

ఈ సాయంత్రం మీ డిస్పెన్సరీ మూసేశాక, ఇన్స్పెక్టర్ రాజారెడ్డి తిన్నగా మీ ఇంటికి వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాడు. అతని ప్రశ్నలకి సరైన జవాబులిచ్చి, సహకరించగలరని ఆశిస్తున్నాను. సెలవ్!'' అంటూ యింకేమీ వినిపించుకోకుండా రిసీవర్ దించేశాడు డి.ఎస్.పి.

## 6

సాయంత్రం సరిగ్గా ఆరుగంటలకు డాక్టరుయింటికి బైలుదేరాడు ఇన్స్పెక్టర్. అతని యింటిముందు జీప్ ఆపి దిగాడో లేదో, సరిగ్గా అదే సమయంలో రెడ్ ఆస్టిన్ కారొకటి ఆ యింటి కాంపౌండ్లోకి తిరుగుతూ సడన్ బ్రేక్తో ఆగింది.

డ్రైవింగ్ సీట్లో కూర్చున్న వ్యక్తిని చూడగానే, ఇన్స్పెక్టరు భ్రుకుటి ముడిపడింది. అతను సుగంధరావు కంపెనీ మేనేజరు యోగానంద్!

ఇన్స్పెక్టర్ని చూడగానే అతను చిరునవ్వు నవ్వి— ''హలో సార్! ఏమిటిలా వచ్చారు?'' అంటూ పలకరించాడు.

''ఏంలేదు. డాక్టర్ గోపాలవర్మగార్ని చూసిపోదామని వచ్చాను. పోతే, మీరిక్కడికి రావడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది.''

"ఎందుకూ?"

"సుగంధరావుకూ, గోపాలవర్మకూ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది కదా? అటువంటప్పుడు మీ రాయన శత్రువు యింటికి రావడం విడ్డూరమే కదా?"

యోగానంద్ నవ్వి "సుగంధరావుగారి దగ్గర నేను ఉద్యోగినన్న మాట నిజమేగానీ, వాళ్ళ వ్యక్తిగత శత్రుత్వాలతో నాకేంపని చెప్పండి? గోపాలవర్మ నా ఫామిలీ డాక్టరు. అవసరమైనప్పుడల్లా వచ్చి ఆయన్ని కలుసుకుంటూంటాను. ఇందులో ఏదైనా తప్పుందంటారా?" అన్నాడు.

"లేదనుకోండి. సరే, ముందు మీరే వెళ్ళి కలుసుకోండి ఆయన్ని. నాకవతల మరో పనుంది. తరవాత వచ్చి కలుసుకుంటాను" అంటూ జీప్ యెక్కాడు ఇన్స్‌పెక్టరు.

యోగానంద్ ఆస్టిన్ కారు కంపౌండ్‌లోకి వెళ్ళింది.

యోగానంద్‌ని నీడలా వెంబడిస్తూ ఓ కంట కనిపెట్ట మన సార్జంట్ డేవిడ్‌ని నియమించేను తను. అంటే డేవిడ్ కూడా యోగానంద్ వెనక ఇక్కడికి వచ్చి ఎక్కడో పొంచివుంటాడు, అనుకుంటూ కలయజూశాడు రాజారెడ్డి.

ఎదురుగా రోడ్డుపక్క ఓ టాక్సీ ఆగివుంది. టాక్సీ బాక్‌సీట్లో కూర్చున్నాడు డేవిడ్. జీప్‌లో వస్తున్న ఇన్స్‌పెక్టర్ని చూడగానే టాక్సీ దిగాడు.

జీప్‌కు బ్రేక్ వేసి,-"యోగానంద్ విషయంలో ఏదైనా అనుమానాస్పద సంఘటనలు జరిగాయా?" అడిగాడు యిన్స్‌పెక్టరు.

"హాత్య జరిగినప్పట్నించీ అతను ఎవ్వర్నీ కలుసుకోలేదు.

ఇల్లువిడిచి ఎక్కడికీ వెళ్ళలేదు. ఇప్పుడే బైలుదేరి ఇక్కడికి వచ్చాడు" అన్నాడు డేవిడ్.

"అతనూ, డాక్టరు ఏం మాట్లాడుకుంటున్నారో నీవు వినే అవకాశం బొత్తిగా లేదు. నెవర్ మైండ్! బైటికి రాగానే విడవకుండా ఫాలో చెయ్" అంటూ జీవ్ ముందుకు పోనిచ్చాడు ఇన్స్పెక్టర్.

సార్జంట్ తిరిగి టాక్సీ బాక్ సీట్లోకి చేరి, డాక్టరు యింటివైపు చూడసాగాడు. పావుగంట తరవాత బైటికి వచ్చింది యోగానంద్ ఆస్టిన్ కారు. ఇప్పుడు కార్లో అతనేకాదు, మరోవ్యక్తి కూడా వున్నాడు.

ఎవరతను?

కారు ఎడంవైపు తిరిగి స్పీడందుకుంది.

టాక్సీని దాని వెనక పోనివ్వమని డ్రైవరుతో చెప్పాడు డేవిడ్. కారు స్టార్టయి ఆస్టిన్ కారుకు వంద గజాల ఇవతల వుండి వెంబడించ సాగింది.

ఆలివర్ రోడ్ దాటి, మౌబ్రిస్ రోడ్ గుండా ట్రిప్లికేన్ హైవేలోకి తిరిగింది కారు. అలా కొద్దిదూరం వెళ్ళి లాటిస్ బ్రిడ్జి రూట్ లోకి మళ్ళింది. సామాన్యంగా ఆ రోడ్డుమీద అట్టే జనసంచారం ఉండదు. అప్పటికే నగరంలో లైట్లు వెలిగాయి.

హఠాత్తుగా ముందు వెళుతున్న కారు స్పీడు స్లో అయింది. ఫ్రంటుసీట్ తలుపు తెరచుకుంది. మరుక్షణం ఓ మానవాకారం పిండిబస్తాలా కిందికి దొర్లింది. అంతే! కారు వాయువేగంతో ముందుకు దూసుకుపోసాగింది.

"డ్రయివర్! ఆ వ్యక్తి పడున్నచోట కారాపు!" అరిచాడు డేవిడ్.

రెండుక్షణాల్లో రోడ్డుమీద పడున్న ఆ మానవాకా

రాన్ని సమీపించి సడన్ బ్రేకుతో ఆగింది టాక్సీ. ఒక్క ఉదుటన తలుపు తెరుచుకుని దిగి,ఆ వ్యక్తిని సమీపించేడు డేవిడ్.

అత నెవరో కాదు. యోగానంద్ ప్రక్కన కారులో కూర్చున్న వ్యక్తే.

ప్రాణంలేని పీనుగులా చేతులూ, కాళ్ళూ ముడుచుకు పడున్నాడు. చటుక్కున వంగి అతని పల్స్ చూశాడు డేవిడ్. కొట్టుకొంటోంది బలహీనంగా.

ఇంకా ప్రాణం పోలేదు. తక్షణం అతన్ని హాస్పిటల్ చేర్చాలి. ప్రాణాపాయం తప్పితే, అతనిద్వారా ఏం జరిగిందో తెలుసుకోవచ్చు. డ్రైవర్ సహాయంతో అతన్ని ఎత్తి టాక్సీ బాక్ సీట్లోకి చేర్చాడు డేవిడ్.

"వెంటనే జనరల్ హాస్పిటల్ పోనివ్" అన్నాడు తనూ ఎక్కుతూ. టాక్సీ వెనుదిరిగి, పావుగంటలో చేరుకుంది హాస్పిటల్.

అతన్ని హాస్పిటల్లో చేర్పించి, అచ్చటనుంచే పోలీస్ హెడ్ క్వార్టర్సుకు ఫోన్ చేసి, ఇన్స్పెక్టరు రాజారెడ్డిని తక్షణం హాస్పిటల్ కు రమ్మని చెప్పాడు.

జీపులో హుటాహుటిన వచ్చాడు ఇన్స్పెక్టరు. అతన్ని చూడగానే గుర్తుపట్టాడు. ఉదయం డిస్పెన్సరీలో చూసిన కంపౌండరు అతను.

డాక్టర్ అతని చెయ్యందుకుని పల్సుచూసి, "పోయాడు" అంటూ చెయ్యి జారవిడిచాడు.

నిరాశతో నిట్టూర్చాడు ఇన్స్పెక్టరు.

"బహుశా యోగానంద్ ఇతన్ని బ్రిడ్జిమీంచి కింద ప్రవహించే మురుకి కాలవలోకి తోసెయ్యాలనే ఉద్దేశం తోనే ఆవైపు తీసుకెళ్ళుంటాడని నా అనుమానం. వెనక

మీ టాక్సీ వస్తుండటం చూసి, రోడ్డుమీదకితోసి పారి పోయుంటాడు.

ఇతనికి విషప్రయోగం జరిగిందో లేదో, శవపరీక్షలో తేలుతుంది. శవాన్ని పోస్టుమార్టంకు పంపి, "హెడ్ క్వార్టర్సుకు వచ్చేయ్" అని సార్జంటుతో చెప్పి, జీప్ ఎక్కాడు ఇన్స్పెక్టరు.

## 7

తన ఆఫీసులో కూర్చుని తీవ్రాలోచనల్లో నిమగ్న మయ్యాడు రాజారెడ్డి. యోగానంద్ కార్లోంచి కంపౌం డరు కిందికి తొయ్యబడటం, అనూహ్యమయిన పరిస్థితిలో అతని దుర్మరణం, వీటన్నిటినిబట్టి ఆలోచిస్తే సుగంధ రావు హత్యకూ, యోగానంద్‌కూ అవినాభావ సంబంధ మున్నట్టు ధృవపడింది.

బహుశా అతనే డాక్టరుగోపాలవర్మతో కుమ్మక్కయి సుగంధరావుని మట్టుబెట్టి వుంటాడు. దానివల్ల అతని కొరిగే లాభమేమిటో అతనిద్వారానే తెలియాలి.

కంపౌండరు హత్యలోనూ యేదో నిగూఢ రహస్యం ఇమిడి వుంటుంది. బహుశా, సుగంధరావు హత్యకోసం అతన్ని ఏదో విధంగా వాడుకునుంటారు. లేదా, ఆ హత్యకు సంబంధించిన వివరాలేవో అతనికి తెలిసుంటాయి. అతన్ని మట్టుబెట్టడం తప్పనిసరి అని తలచి వుంటారు వాళ్ళు.

ఇక జాగు చెయ్యడం అనవసరం. అనుమానంమీద డాక్టరు గోపాలవర్మనూ, యోగానంద్‌నీ వెంటనే అరెస్టు చెయ్యాలి, అనుకుంటూ లేచాడు ఇన్స్పెక్టరు.

సరిగ్గా అదే సమయంలో, టేబిల్ మీద టెలిఫోన్ మోగింది. రిసీవరందుకుని, "ఎస్, ఇన్స్పెక్టర్ రాజారెడ్డి హియర్," అన్నాడు.

"నేను సార్! సుగంధరావు స్టెనోగ్రాఫరు క్షీర వేణిని కనిపెట్టడానికి నియమించిన కానిస్టేబుల్ని. ఆమె అడయారులో ఉన్న శాంతినిలయం అనే మూడంతసుల బిల్డింగులో, ఫ్లాటు నెంబర్ అరవైనాలుగులో నివసి స్తోంది.

ఉదయంనించీ నేనా మె ఫ్లాటుమీద కన్నేసివుంచేను. ఆమె తలుపు మూసుకుని లోపలేవుంది. సూర్యాస్తమయం వేళ సుగంధరావు కంపెనీ మేనేజరు యోగానంద్ ఆమె ఫ్లాటులో ప్రవేశించి, వెంటనే తిరిగి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే ఆమె ఖంగారుగా బయటకువచ్చి, కాసేపు అటూ ఇటూ పచార్లుచేసి తిరిగి లోనికెళ్ళి తలు పేసుకుంది. ఆమెతీరు చూస్తోంటే తీవ్రమయిన భయాం దోళనకు గురయివున్నట్టు కనిపించింది.

ఆ తరవాత కొద్దిసేపటి క్రితమే, అంటే యెనిమిది గంటల ప్రాంతంలో మళ్ళీవచ్చి, ఆమె ఫ్లాటు తలుపు తట్టేడు. క్షీరవేణి తెరవలేదు. పది నిమిషాలవరకు అతను తలుపు తెరవడానికి ప్రయత్నించి, విసుగెత్తి వెళ్ళి పోయాడు. ఇది నోటెడ్ న్యూస్ గనక మీకు తెలీజేస్తు న్నాను." అన్నాడు అవతలనుంచి కానిస్టేబుల్.

"ఆల్ రైట్! అక్కడేవుండు. అతను మళ్ళీవస్తే విడవకుండా ఫాలోజెయ్" అని రిసీవరు దించి, జేబులో నుంచి డైరీతీశాడు ఇన్స్పెక్టర్.

ఆ బిల్డింగులో పెద్దపెద్ద ఉద్యోగాలు చేస్తున్న మను షులూ, వ్యాపారస్థులూ నివసిస్తుంటారు. డైరీలో క్షీర వేణి ఇచ్చిన ఫోన్ నెంబరు చూసుకొని డయల్ చేసి, రిసీ వరందుకున్నాడు.

"యూ డామ్ ఫూల్, ఈడియట్, ఇది లాస్ట్ వార్నింగ్, మళ్ళీగనక నాకు ఫోన్ చేశావో, పోలీస్ రిపోర్టు

ఇస్తాను జాగ్రత్త,'' అవతలినుంచి అరచింది క్షీరవేణి.

''మిస్, క్షీరవేణీ, నేను ఇన్స్పెక్టర్ రాజారెడ్డిని.''

''మైగాడ్...మీరా! నేనా రోగ్ మళ్ళీ ఫోన్ చేశా డనుకున్నాను.'.

''ఎవ్వరు?''

''యోగానంద్!''

''ఏం జరిగింది?''

''సాయంత్రం ఐదుగంటల ప్రాంతంలో అతను అను కోకుండా నా దగ్గరకు వచ్చాడు. నేను చాలా డల్‌గా కనిపిస్తున్నాననీ, క్లబ్బులకూ, సినిమాలకూ వెళ్ళి కాస్త రిలాక్స్ అవడం మంచిదనీ ఉచిత సలహాలివ్వసాగాడు.

నేనందుకు నిరాకరించడంతో ఉగ్రుడై, సుగంధరావు గారి మరణానికి కారణం నేనే అన్న విషయం తనొక్క డికే తెలుసునని, ఆ సంగతి ఇంకా పోలీసుల దృష్టికి తేలేదని, ఆ విషయం వాళ్ళకు తెలిస్తే జీవితాంతం కట కటాల వెనక మగ్గవలసి వస్తుందనీ, తను చెప్పినట్టు నడుచుకుంటే ఏ చిక్కూ వుండదనీ హెచ్చరించాడు.

అతని కంఠంలో ఒకరకం బెదిరింపువుంది. అలా బెది రించి వెళ్ళిపోయాడు. ఆ తరవాత రాత్రి ఎనిమిదిగంటల ప్రాంతంలో మళ్ళీవచ్చాడు. నేను తలుపు తియ్యలేదు. పది నిముషాలు ప్రయత్నించి వెళ్ళిపోయాడు.

గంటక్రితం నాకు ఫోన్ చేసి మళ్ళీ బెదిరించాడు. ఇప్పుడు మరోసారి ఫోన్ మోగడంతో వాడే అను కున్నాను. ఎందుకో నాకు అతన్ని చూస్తే కంపరం పుడు తోంది.

సుగంధరావుగారి ఆఫీసులో దొరికిన ఉత్తరాన్ని నేను మీకందచేసిన విషయం బహుశా అతనికి తెలీదను

కుంటాను. అందుకే అలా బెదిరిస్తున్నాడు. నాకెందుకో అతనిమీద అనుమానంగావుంది. ఇన్స్పెక్టరుగారూ, దయచేసి నాకు ప్రాణాపాయం జరక్కుండా రక్షణ కల్పించండి.''

''నే వచ్చేవరకూ తలుపు తెరవకుండా యింట్లోనే ఉండండి'' అంటూ రిసీవర్ క్రెడిల్ చేసి, గబగబ బయటకు నడిచాడు ఇన్స్పెక్టర్.

జీప్ యెక్కి పావుగంటలో చేరుకున్నాడు శాంతి నిలయం! బిల్డింగు చివర చిరుచీకట్లో జీప్ ఆపి దిగాడు. చకచక అడుగులు వేసుకుంటూ బిల్డింగులో ప్రవేశించే మెట్లవైపు నడిచాడు.

అప్పుడు పడింది ఇన్స్పెక్టర్ దృష్టి, మెట్లకు కాస్త ఎడంగా కూర్చుని ముష్టెత్తుకుంటూన్న ఓ బికారిమీద.

ఇన్స్పెక్టర్ని చూడగానే మట్టిచిప్ప ముందుకుచాచి, ''కబోదిని బాబూ, దర్మం సెయ్యండి. మీ పిల్లాపాపలు సల్లంగ వుండాలి'' అంటూ అడుక్కోసాగాడు.

ఇన్స్పెక్టర్ కర్థమయింది, అతను క్షీరవేణిమీద నిఘా కోసం నియమించిన డిటెక్టివ్ కానిస్టేబిల్ అని. జేబిలో చెయ్యివేసి చిల్లరనాణాలు తీస్తున్నట్లు నటిస్తూ అతన్ని సమీపించాడు.

ఇన్స్పెక్టర్ దగ్గరకు రాగానే ''నేను వన్ నాట్ త్రీని సార్. పదినిమిషాల క్రితం యోగానంద్ వచ్చాడు మళ్ళీ క్షీరవేణి దగ్గరకి. ఈసారికూడా ఆమె తలుపు తియ్యలేదు. చాలాసేపు ప్రయత్నించి, విసుక్కుటూ వెళ్ళిపోయాడు, అదుగో, ఎదురుగావున్న ఆ సందులోకి. నేను ఆ సందుని సమీపించేలోగానే అతని కారు స్టార్టయి స్పీడ్ గా వెళ్ళిపోయింది'' అన్నాడు కానిస్టేబుల్.

ఇన్స్పెక్టర్ సాలోచనగా తలూపి, మెట్లవేపు నడిచేడు. గబగబ మెట్లెక్కుతూ అయిదు నిముషాల్లో చేరుకున్నాడు సెకండ్ ఫ్లోర్. క్షీరవేణి ఫ్లాట్ తలుపుమూసి వుంది. మునివేళ్ళతో తట్టాడు మెల్లిగా.

"ఎవ్వరు?" ఆమె కంఠంలో కంపన.

"నేను ఇన్స్పెక్టర్ రాజారెడ్డిని."

గబగబ వస్తున్న అడుగుల సవ్వడి. గడియ తీస్తోన్న శబ్దం. తలుపు తెరచుకుంది. "హమ్మయ్యా, ఇప్పుడుగానీ నాగుండె దడ తగ్గలేదు. లోపలకి రండి" అంటూ తలుపు కడ్డం తొలిగింది క్షీరవేణి.

"మీరిక్కడ వంటరిగా వుండటం ఏ క్షణంలోనైనా ప్రమాదం కొనితెచ్చుకున్నట్టు అవుతుంది. యోగానంద్ ఇన్నిసార్లు మీ యింటిచుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాడు అంటే తప్పకుండా అతను మీకేదో హాని తలపెట్టే ప్రయత్నంలో వున్నాడన్నమాట.

మిమ్మల్నిచ్చట ఒంటరిగా వుంచేబదులు, ఏదయినా సురక్షిత ప్రదేశానికి తరలించడం మేలనిపిస్తోంది. ఏమంటారు?" అన్నాడు యిన్స్పెక్టర్ లోన అడుగు పెడుతూ.

"నాకు ప్రమాదం జరగకుండా కాపాడే పూచీ మీది. మీకెలా ఉచితంగాతోస్తే అలాగేచెయ్యండి" అంది క్షీరవేణి.

"అయితే ఇంటికి తాళవేసి పదండి. సాధ్యపడితే ఈరాత్రే యోగానంద్‌ని మా కస్టడీలోకి తీసుకోవాలనుకుంటున్నాను. లేదా, రేపెలాగయినా వాణ్ని అరెస్టు చెయ్యాక తప్పదు. పదండి" అంటూ బయటకు నడిచేడు ఇన్స్పెక్టర్.

క్షీరవేణి చెప్పులు వేసుకుని, తాళంకప్ప అందుకొని, గదుల్లో వెలుగుతున్న లైట్లార్పి బయటకి వచ్చింది. తలుపుకు తాళంవేసి ఇద్దరూ మెట్లవైపు నడిచారు.

కింద బిశారి అవతారంలోవున్న కానిస్టేబుల్ యింకా అక్కడే కూర్చునున్నాడు. "ఇక నీ అవసరంలేదు. వెళ్ళి రెస్టుతీసుకో" అన్నాడు ఇన్స్పెక్టర్ అతనితో.

కానిస్టేబుల్ లేచి, కంబళి దులుపుకుని భుజానవేసుకున్నాడు.

క్షీరవేణిని వెంటపెట్టుకుని జీప్ వున్నవేపు నడిచాడు. ఇద్దరూ అందులో కూర్చున్నారు. ఇంజన్ స్టార్ట్ చెయ్యబోతుండగా, చీకట్లో ఎవ్వరో వారివేపు పరిగెత్తుకు వస్తున్న బూట్లశబ్దం వినిపించింది. ఆ రెప్పపాటు వ్యవధిలోనే ఏదో ప్రమాదం జరగబోతున్నట్లు మెరుపు మెరిసింది ఇన్స్పెక్టర్ బుర్రలో.

క్షీరవేణిని అమాంతం తనమీదికి లాక్కుని వొరిగిపోయాడు సీట్లో. వాళ్ళలా ఒరగడం, "ఢాం, ఢాం" అనే చప్పుళ్ళతో దిక్కులు పిక్కటిల్లడం లిప్తపాటులో జరిగిపోయాయి.

మరుక్షణం ఆ అడుగుల శబ్దం పరిగెత్తుతున్నట్టు వినిపించడంతో కొద్దిగా తలెత్తిచూశాడు ఇన్స్పెక్టర్. రోడ్డు కవతలివైపున్న సందువైపు పరిగెత్తుతున్నాడతను.

కాలరు చెవులవరకూ ఎత్తిపెట్టుకున్న డార్కుబూడిదరంగు లాంగ్ కోటు. అదేరంగు పాంటు. తలమీద ఫెల్ట్ హాట్. ఆ ఒడ్డూ, పొడుగూ అచ్చువేసినట్టు యోగానంద్ లాగే వుంది.

క్షీరవేణిని జీప్లోనే వదలి, జేబులోంచి పిస్తోలు తీస్తూ కిందికి గెంతాడు ఇన్స్పెక్టర్. క్షణం వృధాచేయకుండా తనూ ఆ సందువేపు పరుగుతీశాడు.

సందులో చీకటి.

జనసంచారం శూన్యం.

పరిగెత్తుతున్న యోగానంద్ ఆకృతి లీలగా కనిపిస్తూ వుంది. అడుగుల శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది. హఠాత్తుగా అతను వెనుదిరిగి, పిస్తోలు పేల్చాడు.

''ఢాం!'' మనే శబ్దంతో సందు గింగురుమంది.

గుండు రంయ్‌మంటూ ఇన్‌స్పెక్టర్ చెవి పక్కనుంచి దూసుకుపోయింది. తనూ ఫైర్ చేశాడు కావాలని గురి తప్పేలా. దానికతన్నించి జవాబువచ్చింది. గుళ్ళు లెక్క పెట్టాడు ఇన్‌స్పెక్టర్. యోగానంద్ పిస్తోలులో ఇప్పుడు రెండే గుళ్ళు మిగిలాయి. ఆ రెండూ ఖర్చయితే అతన్ని సులభంగా లొంగదీసుకోవచ్చు. ఈ ఉద్దేశంతో మరో రౌండ్ కాల్చేడు ఇన్‌స్పెక్టర్.

మరుక్షణం, ''ఢాం, ఢాం'' అంది అవతలి పిస్తోలు.

ఇన్‌స్పెక్టర్ పడిశాలి తొడని రాసుకుంటూ దూసుకు పోయిందో గుండు. అతని పిస్తోలు ఖాళీ అయిపోయిందన్న ఉత్సాహంతో బాణంలా పరుగు తీశాడతను.

సందు మలుపుదగ్గర చేరుకున్నారిద్దరూ. అప్పుడు గ్రహించి వుంటాడతను తన పిస్తోలులో గుళ్ళు గోవిందా అయిన సంగతి. చటుక్కున వెనుదిరిగి ఇన్‌స్పెక్టర్ డొక్కలో ఒక్కతన్ను తన్నేడు. ఆ మెరుపుదెబ్బకు రాజారెడ్డి నవనాడులూ ఒక్కసారి మూలిగాయి.

పిడికిళ్ళు రెండూ బిగించి, వ్యవధి యివ్వకుండా అతని మొహంమీద పిడుగు దెబ్బలు తీశాడు వరసగా. ఆదెబ్బ లకు తాళలేక అతను రెండుచేతులతో మొహం కప్పు కుంటూ వెనుదిరిగాడు పరుగుతియ్యడానికి.

ఇన్‌స్పెక్టర్ వెంటనే అతని నడుంచుట్టూ చేతులువేసి

ఒడిసి పట్టుకున్నాడు. అతను విడిపించుకోడానికి శక్తి కొలదీ ప్రయత్నించ సాగాడు.

ఆ పెనుగులాటలో హఠాత్తుగా ఇన్స్పెక్టరు చేతికి ఏదో ఊడివచ్చినట్టు తోచింది.

ఆ ఆలోచన రాగానే అవ్యక్తి నడుంమీంచి పట్టు కాస్త సడలింది. దాంతో అతను ఒక్క వూపున ఇన్స్పెక్టరు కబంధ హస్తాలలోంచి విముక్తుడై, ట్రిగ్గర్ నొక్కిన తుపాకీ గుండులా పరుగుతీశాడు.

జేబులోంచి లైటరుతీసి వెలిగించి, తన చేతిలోకి ఊడి వచ్చిన ఆ వస్తువునుచూసి నిర్ఘాంతపోయాడు యిన్స్పెక్టరు.

అది వేలు.

ప్లాస్టిక్తో చేసిన నకిలీ చూపుడు వేలు.

ఇన్స్పెక్టరు బుర్రలో వెయ్యి ఓల్టుల బల్బులు చక చక వెలిగి మాయమవుతున్నాయి. ఆ వేలు జేబులో వేసుకుంటూ తిరిగి జీప్ దగ్గరకి నడిచాడు. క్షీరవేణి బెదరిన లేడికూనలా ఫ్రంట్ సీట్లో ఒదిగి కూర్చునుంది.

ఒంటరిగా వచ్చిన యిన్స్పెక్టర్ని చూసి, "పారి పోయాడా?" అడిగింది.

రాజారెడ్డి తలూపి, "వాడు తప్పించుకు పారిపోడం ఒకందుకు మంచిదే అయింది. రేపు కోర్టులో హంతకుడు అతనేనని నిరూపించడానికి అభేద్యమయిన ఋజువొకటి దొరికింది. ఇక మనం నిశ్చింతగా వెళ్ళవచ్చు" అంటూ జీప్లో కూర్చొని, స్టార్ట్ చేసి వేగంగా ముందుకు పోనిచ్చాడు.

"మీ కభ్యంతరం లేకపోతే రేపు దోషుల్ని బంధించే వరకూ మీరు నా ఇంట్లోనేవుండటం మంచిదనుకుంటాను.

మీ సంరక్షణకోసం నలుగురు మఫ్టీ కానిస్టేబుల్సుని ఇంటి చుట్టూ కాపలా వుంచుతాను. ఏమంటారు?''

క్షీరవేణి తలూపింది మౌనంగా.

తనింటిముందు జీప్ ఆపి, ఆమెను లోనికి తీసికెళ్ళి, నౌఖరు కప్పగించి, హెడ్ క్వార్టర్సుకు ఫోన్ చేసి, సార్జంట్ దేవిడ్‌ని అరడజనుమంది సిబ్బందితో తరలి రమ్మని పురమాయించాడు ఇన్స్‌పెక్టర్.

అరగంట లోపల వచ్చేశారు వాళ్ళు.

ఇంటి నాలుగువైపులా నలుగుర్ని నియమించి, సార్జంటుతో సహా మిగతా యిద్దరు కానిస్టేబుళ్ళతో శ్రీ పెక్కా యోగానంద్ ఇంటికి చేరుకున్నాడు ఇన్స్‌పెక్టర్.

తలుపుకి వేళాడుతున్న తాళంకప్ప స్వాగతమిచ్చింది వాళ్ళకి. నిరాశతో వెనుదిరిగి తిన్నగా డాక్టరు గోపాల వర్మ ఇంటికెళ్ళారు. గంటక్రితమే అతను కారులో బయటకు వెళ్ళినట్టు చెప్పారు ఇంటివాళ్ళు.

''ఆ ఇద్దరిసంగతి రేపు చూసుకోవచ్చు. రేపుదయం నువ్వు గాంధీ మెడికల్ కాలేజికెళ్ళి, ప్రసాద్ అనే యువకుణ్ని నా ఇంటికి పట్టుకురావాలి'' అన్నాడు ఇన్స్‌పెక్టరు సార్జంటుతో.

# 8

ఉదయం సరిగ్గా పదిగంటలకు మెడికల్ కాలేజ్ చేరుకున్నాడు సార్జంట్ దేవిడ్. అదే సమయంలో ప్రొఫెసర్ పాండురంగం కొడుకు రవికాంత్ బ్లూఫియట్ వచ్చి ఆగింది కాలేజ్ పార్కింగ్‌లో.

బుక్సూ, ఫైల్సూ పట్టుకుని కారులోంచి దిగాడు రవికాంత్. అక్కడక్కడా నిల్చుని కబుర్లు చెప్పుకుంటున్న స్టూడెంట్సువైపు పలకరింపుగా చెయ్యివూపుతూ, క్లాసెస్

వేపు నడిచాడు. అమ్మాయిలు అతన్ని చూడగానే మొహాలు చిట్లిస్తూ తలలు పక్కకి తిప్పుకుంటున్నారు.

అయినా రవికాంత్ వాళ్ళవైపు చిలిపిగాచూస్తూ కాలేజ్ వరండాలో ప్రవేశించాడు. అతని వాలకం చూడగానే పసిగట్టాడు సార్జంటు - ఆ యువకుడు దూకుడు స్వభావం, చిలిపి స్వభావం కలవాడయివుంటాడని.

తనూ అతన్ని అనుసరిస్తూ ప్రవేశించాడు కాలేజ్ వరండాలో. రవికాంత్ గ్యాలరీదాటి, లైబ్రరీవైపు తిరుగుతుండగా, వెనకనుంచి ఎవ్వరో అతన్ని పిల్చారు.

చటుక్కున వెనుదిరిగి, "హల్లో ప్రసాద్, నిన్నటి నుంచి కనిపించటం లేదేం? ఎక్కడికెళ్ళావ్?" అంటూ పలకరించి అతన్ని సమీపించాడు రవికాంత్.

ఆ యువకుడ్ని చూడగానే సార్జంటు ఉలికిపడ్డాడు. క్షీరవేణి వర్ణించిన ప్రసాద్ అనబడే యువకుడు అతనే!

"ఏం చెప్పను బ్రదర్! నిన్న సాయంత్రంనుంచి మా నాన్న ఐపూ, అజా లేకుండా పోయాడు. తెలిసిన వాళ్ళందరి దగ్గరా వాకబ్ చేశాం. పత్తాలేదు. ఏం చెయ్యాలో తోచడంలేదు నాకు," అన్నాడు ప్రసాద్ విచారంగా.

"సాయంత్రం డిస్పెన్సరీనించి రానేలేదా?"

"లేదు. డాక్టరుగార్ని అడిగితే, డిస్పెన్సరీ మూశాక ఆరోజు వచ్చిన కేసులతాలూకు రిజిస్టరతో తనవెంట ఇంటికి వచ్చాడనీ, పని పూర్తయ్యాక ఆరున్నర ప్రాంత ములో ఇంటికెళ్తున్నానని చెప్పి వెళ్ళిపోయాడనీ తెలిసింది.

ఇంటికి బయలుదేరిన వ్యక్తి యెక్కడి కెళ్ళుంటాడు? ఏమయుంటాడు? రాత్రంతా అమ్మకూ, నాకూ నిద్రలేదు.

ఆయన గురించి తీవ్రంగా ఆందోళన పడుతున్నాం!"
అన్నాడు ప్రసాద్.

సార్జంటు బుర్రలో మెరుపులా మెరిసింది ఓ ఆలోచన.

చటుక్కున స్తంభించాటుకు తప్పకొని జేబిలోంచి డైరీ - బాల్ పెన్ తీసి, సెంటర్ పేజ్ లో గబగబరాయసాగాడు.

'ప్రసాద్! నేనో చిక్కులో యిరుక్కున్నాను... ఈ వ్యక్తిద్వారా ఈ ఉత్తరం పంపుతున్నాను...యిది చూసిన వెంటనే ఈయనవెంట వచ్చేయ్...వివరాలు ఇక్కడే చెబుతాను.'

డైరీలోంచి ఆపేజి చింపి, వాళ్ళ వైపుచూశాడు. ఇప్పుడక్కడ రవికాంత్ లేడు. ప్రసాద్ ఒక్కడేనిల్చునున్నాడు. గబగబ అటు నడిచాడు సార్జంట్.

ఖంగారు నటిస్తూ, "ప్రసాద్ మీరేకదూ!" అడిగాడు ఆత్రంగా.

"ఔను, మీరెవరు?" అడిగాడతను కనుబొమలు ముడిచి.

"మీ ఇంటికెళితే మీరు కాలేజ్ కొచ్చారని తెలిసింది. ఇక్కడ మీగురించి అడిగితే, అదిగో ఆ అబ్బాయి మిమ్మల్ని చూపించాడు." అంటూ అప్పుడే ఓ క్లాస్ రూంలో కెళుతున్న ఓ యువకుడి వైపు చూపేడు సార్జంట్.

"ఇంతకీ, సంగతేమిటి?" అన్నాడు ప్రసాద్ ఆతృతగా.

"ఈ ఉత్తరం మీకందచెయ్యడానికి వచ్చాను" ఆ కాగితాన్ని తన కందించాడు డేవిడ్.

ప్రసాద్ గబగబ గబగబ ఆ ఉత్తరం చదివి, "ఓహ్, ఎక్కడున్నాడు మా నాన్న?" అడిగాడు ఆందోళనగా.

"నా వెంట రండి చూపిస్తాను" అంటూ పార్కింగ్ వైపు నడిచాడు డేవిడ్. మరేమీ ఆలోచించకుండా గబగబ అతన్ని అనుసరించాడు ప్రసాద్. పార్కింగ్‌లో ఆగివున్న ఓ టాక్సీ తలుపు తెరిచి, లోన కూర్చున్నాడు సార్జంట్. అతని వెనకే ప్రసాద్.

"ట్రిప్లికేన్ పోనివ్!" అన్నాడు డేవిడ్ డ్రైవర్‌తో.

ఇన్స్పెక్టర్ రాజారెడ్డి యిల్లువున్నది ఆ వీధిలోనే!

టాక్సీ ట్రిప్లికేన్‌లో ప్రవేశించగానే, ఇన్స్పెక్టర్ ఇంటిముందు ఆపించి, దిగాడు సార్జంట్. మీటర్ బిల్ పేజేసి ప్రసాద్‌ను వెంటపెట్టుకుని ఇంట్లో ప్రవేశించాడు.

వాళ్ళకోసమే ఎదురుచూస్తున్న ఇన్స్పెక్టర్ రాజారెడ్డి, ప్రసాద్‌ని కూర్చోమన్నట్టు సైగచేశాడు.

"ఎవరు మీరు? మా నాన్నగారెక్కడ?" అడిగాడు ప్రసాద్ కూర్చుంటూ.

"చెబుతాను. ముందు నా ప్రశ్నలకి జవాబివ్వు. మీ నాన్న పేరేమిటి? ఏం పని చేస్తుంటారు?" అడిగాడు ఇన్స్పెక్టర్ సిగరెట్ అంటించి.

"ఆయినపేరు శ్యామసుందర్! డాక్టర్ గోపాలవర్మ గారిదగ్గర కంపౌండరుగా పనిచేస్తున్నారు!"

ఇన్స్పెక్టరు నోట్లోంచి సిగరెట్ జారి కిందపడింది. "నువ్వు గోపాలవర్మ కంపౌండరు కొడుకువా?"

"ఔను. ఇంతకీ ఎక్కడున్నారాయన? మీరెవ్వరు?" అడిగాడు ప్రసాద్ చిరాకుగా.

"క్రయింబ్రాంచి పోలీసులం..." అని పక్కగది వైపు చూసి, "క్షీరవేణీ!" అంటూ కేకేశాడు ఇన్స్పెక్టర్.

అడుగులో అడుగు వేసుకుంటూ ఆ గదిలోంచి బైటికి వచ్చింది క్షీరవేణి.

ఆమెని చూడగానే ప్రసాద్ ఉలిక్కిపడ్డాడు.

"ఈ అమ్మాయి తెలుసా మీకు?" అడిగాడు ఇన్స్పెక్టర్ అతన్ని ఓరగా చూస్తూ.

ప్రసాద్ మొహంలో స్వేదబిందువులు వేరుతో సాగాయి. చూపులు దించుకున్నాడు కిందికి.

"మర్యాదగా అడుగుతుంటే చెప్పాలి. లేదా హెడ్ క్వార్టర్స్‌కి తీసికెళ్ళి ప్రశ్నించాల్సి వుంటుంది. అక్కడ ప్రశ్నించే పద్ధతి ఎలావుంటుందో బహుశా నీవు వినే వుంటావు" అన్నాడు ఇన్స్పెక్టరు నవ్వుతూ.

ప్రసాద్ తలెత్తకుండానే, "తెలుసు!" అన్నాడు నీరసంగా.

"రెండురోజుల క్రితం ఈమెని బజార్లో అల్లరిపెట్టింది నీవే కదూ?"

"నేను కావాలని అల్లరిపెట్టలేదు. ఓ పందెం గెలవటానికి ఆ పని చేశాను."

"పందెం గెలవటానికా? ఎవరు కాశారు నీతో పందెం?"

"రవికాంత్! తరుచూ వాడు నాతో ఇలాటి పందాలు కాస్తుంటాడు. ప్రతిసారీ ఓడిపోతుంటాడు. వాడికి అమ్మాయిల్ని ఏడిపించటమంటే సరదా! నాకు వాడి జేబులు ఖాళీచెయ్యడమంటే సరదా!

అలా వాడిపుణ్యమా అని నా నెలసరి పాకెట్ మనీకి పుష్కలంగా దొరుకుతుంది డబ్బు! మీరే చెప్పండి, ఒక మామూలు కంపౌండరు తన కొడుకు పాకెట్ మనీ భరించ గలడా ఈ రోజుల్లో? అందుకే వాడు చెప్పిన అమ్మాయి

నల్లా యిష్టంలేకున్నా ఏడిపించి నా పబ్బం గడుపు కుంటుంటాను.

ఆ రోజు కూడా నేనూ, రవికాంత్ వాడి కార్లో కాలేజీకెళ్తుండగా, ఫుట్‌పాత్ మీద నడుస్తున్న ఈమె కనిపించింది. వాడు వెంటనే కారు ఓ పక్క ఆపి, ఈమెని గనక అల్లరిపెట్టి దాదాపు అరగంట వరకూ ఇక్కణ్ణించి కదలకుండా చేశానంటే వెయ్యిరూపాయలు ఇస్తానన్నాడు. అంత పెద్ద మొత్తాన్ని వాడు పందెం కాయడం ఇదే ప్రథమం!

వెయ్యిరూపాయలనగానే నా కళ్ళు జిగేల్‌మన్నాయి. వెంటనే ఒప్పుకున్నాను. రవికాంత్ అక్కడే దిగిపోయి, నన్ను కార్లో ఆమె వెంట పడమని పురమాయించాడు.

నేనామె వెనక నెమ్మదిగా కారు నడుపుతూ కామెంట్సు విసరసాగాను. పదినిమిషాల వరకూ ఓపిగ్గా వాటిని భరించింది. నేను మితిమీరడంతో చటుక్కున ఆగి గొడవ ప్రారంభించింది. దాంతో నలుగురూ పోగయ్యారు. దేహశుద్ధి జరక్కముందే అక్కణ్ణించి జారుకోవడం మంచిదని కార్లో పారిపోయాను..." అంటూ నీళ్ళు నమిలాడు ప్రసాద్.

ఇన్స్‌పెక్టర్ చటుక్కున సార్జంట్ వైపు తిరిగి, "వెంటనే కాలేజ్‌కెళ్ళి రవికాంత్‌ని ఇక్కడికి తీసుకురా!" అంటూ పురమాయించేడు.

# 9

అరగంట లోపల రవికాంత్‌తో తిరిగివచ్చాడు సార్జంట్ డేవిడ్.

లోపలకూర్చున్న ఇన్స్‌పెక్టర్నీ, క్షీరవేణిని, ప్రసాద్‌నీ చూడగానే ఉలిక్కిపడ్డాడతను.

"మిస్టర్ రవికాంత్! రెండురోజుల క్రితం మీరు మీ స్నేహితుణ్ని ఈ అమ్మాయిని నడిరోడ్లో అల్లరిపెట్టడానికి వాడుకున్నారు కదూ?" అడిగాడు ఇన్స్పెక్టరు అతను కూర్చోగానే.

రవికాంత్ కాసేపు తటపటాయించి, "అది పందెం! నాతోనూ ఒకరు కట్టిన పందెం ఇన్స్పెక్టర్!" అన్నాడు వణికే కంఠంతో.

"ఎవరు కట్టారు?"

"యోగానంద్!"

"అతనికీ, మీకూ ఏమిటి పరిచయం?"

"మా నాన్నగారు సైంటిస్టు. ఆయన సైంటిఫిక్ ఎక్విప్మెంట్సన్నీ వాళ్ళ కంపెనీ ద్వారానే ఫారిన్ నుంచి తెప్పిస్తారు. ఆ విధంగా అతనికీ, నాన్నగారికీ పరిచయం వుంది. తరుచూ మా ఇంటికి వస్తూంటాడు. అలా నాకూ పరిచయమయ్యాడు."

"మీ నాన్నగారి స్నేహితుడైన అతను, మీతో అటువంటి పోకిరీపందెం కాస్తాడా?"

"నమ్మండి! ఇప్పుడతనికి ముప్పైఅయిదేళ్ళుంటాయి. ఐనా, ఇంతవరకూ పెళ్ళిచేసుకోలేదు. తరుచూ మా ఇంటికి వచ్చి నాతో టేబుల్ టెన్నిస్ ఆడుతూంటాడు. ఆ విధంగా మా మధ్య కాస్త చనువు ఏర్పడింది. కబుర్లలో అప్పుడప్పుడూ మా మధ్య అమ్మాయిల విషయం కూడా వచ్చేది.

ఓ రోజు టెన్నిస్ ఆడుతూ అతడు క్షీరవేణి విషయం కూడా ఎత్తాడు. తనామెను మనసారా ప్రేమిస్తున్నాననీ, త్వరలో పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాననీ, ఐతే ఈ లోగా ఆమె నడవడిని పరీక్షించదల్చాననీ, ధనవంతు

డైన యువకుడెవ్వడైనా ప్రయత్నిస్తే ఆమె లిఫ్ట్ ఇస్తుందేమో చూడదలచాననీ, ఒకవేళ ఆమె క్యారెక్టర్ మంచిదని తేలితే తను వెయ్యిరూపాయలు ఓడడానికి సిద్ధమనీ చెప్పాడు.

ఉద్యోగాలు చేసి బ్రతికే పెళ్ళికాని అమ్మాయిలపై నాకు నమ్మకం లేదనీ, అటువంటి వాళ్ళని లొంగదీసుకోడం చిటికెలో పననీ, ఇదివరకు అలాటివాళ్ళ నెందర్నో చూశాననీ, ఈ విషయంలో నేనోడితే వెయ్యిరూపాయలు చెల్లిస్తాననీ చెప్పాను.

ఇలాంటి వ్యవరాల్లో ప్రసాద్ ఆరితేరిన ఘటికుడు. వాణ్ణడ్డం పెట్టుకుని ఇదివరకెందరో అమ్మాయిల్ని ఏడిపించాను. ఈ పని కూడా వాడికే అప్పగించాను...'' అన్నాడు రవికాంత్ తల వంచుకుంటూ.

ఇన్స్పెక్టరు పలకలేదు. కాసేపు ఆలోచించి లేచాడు. ''పదండి యోగానంద్ ఇంటికెళ్దాం!'' అని క్షీరవేణిని అక్కడే వదలి మిగతా ముగ్గురితో జీప్ ఎక్కాడు.

# 10

ఇప్పుడు యోగానంద్ ఇంటికి తాళం లేదు. తలుపులు మూసున్నాయి.

జీప్ దిగగానే తలుపుతట్టాడు ఇన్స్పెక్టర్.

''కమిన్!'' వినిపించింది లోపలనించి.

తలుపు తోసుకుంటూ అందరూ లోన అడుగుపెట్టారు. ముందుగదిలో ఎవ్వరూ లేరు.

''ఇక్కడున్నాను. రండి లోపలికి'' వినిపించింది పక్కగదిలోంచి.

ఇన్స్పెక్టర్ సార్జంట్ని దగ్గరికి పిల్చి, అతని చెవిలో ఏదో చెప్పాడు. సార్జంట్ తలూపి, ఇంట్లోంచి బైటికెళ్ళి

పోయాడు. రవికాంత్, ప్రసాద్‌లతో పక్కగదిలో ప్రవేశించి స్థాణువైపోయాడు ఇన్‌స్పెక్టర్.

ఆ గదిలో అసలే వెలుతురులేదు. మసక చీకటి. ఎదురుగావున్న కిటికీకడ్డంగా నిల్చున్నాడతను. చెవులవరకూ కాలర్ ఎత్తిన డార్క్ బూడిదరంగు లాంగ్ కోట్. అదే రంగు హాటు. తలమీద బాగా ముందుకు లాగిపెట్టుకున్న ఫెల్ట్ హాట్. కళ్ళకి అద్దాలు.

కుడిచేతిలో సూటిగా వాళ్ళవైపు గురిపెట్టివున్న పిస్తోలు!

"ఇక మీ రెవ్వరూ బ్రతికి బైటపడలేరు. ఈ దేశం నించి పారిపోడానికి అన్ని ఏర్పాట్లూ పూర్తిచేసుకున్నాను.

సుగంధరావునీ, కంపౌండర్నీ చంపింది నేనే! నేను క్షీరవేణిని మనసారా ప్రేమించాను. ఐతే, ఆమె నన్ను లెక్కచేసేదికాదు. దాంతో, సుగంధరావుకూ, ఆమెకూ అక్రమసంబంధమేదో ఏర్పడేటు నా కనుమానం వేసింది. సుగంధరావుమీద కసితో నా హృదయం భగ్గుమంది.

పథకం వేశాను. డాక్టర్ గోపాలవర్మ దగ్గర పనిచేసే కంపౌండరు ద్వారా గేస్ట్రిక్ విషాన్ని సంపాదించి, దాంతో క్షీరవేణి రసినట్టు ఓ వుత్తరం రాసి, సుగంధరావు బల్లమీద పెట్టా...అది చదవగానే కాల్చి పారేశాడు ... ఫలితంగా మృత్యువాతబడ్డాడు ... ఆ విషపు రహస్యం తెలిసిన కంపౌండర్ని కూడా దారికడ్డు తొలగించుకున్నాను.

ఇక ముగ్గురూ చేతులెత్తి బుద్ధిగా గోడవైపు తిరిగి నిల్చోండి. నా దారి కడ్డుపడ్డారో అందర్నీ ఇక్కడే.."
అతని మాట యింకా పూర్తికాలేదు.

"ఢాం! ఢాం!!" అనే శబ్దాలతో గది మారుమోగింది.

అతను రెండుభుజాలూ అదుముకుంటూ గావుకేక పెట్టాడు. మరుక్షణం చేతిలోంచి పిస్తోలు జారి ఖంగు మంది. ప్రసాద్, రవికాంత్ ఆశ్చర్యంగా అతని వెనక వున్న కిటికీవైపు మూశారు.

కిటికీ ఊచలమధ్య పిస్తోలు ఆనించి నిల్చునున్నాడు సార్జంట్. ఇన్స్పెక్టరు వెంటనే కిందపడ్డ పిస్తోలందుకుని చిన్నగా నవ్వుతూ అతన్ని సమీపించాడు.

"నీవు నిజంగా యోగానంద్ వైతే, ఈ అవతార మెందుకు?" అంటూ అతని ఫెల్ట్ హాట్, కళ్ళద్దాలు తీసేశాడు.

"నాన్నా! మీరా!!" అన్నాడు రవికాంత్ దిగ్భ్రాంతితో.

ప్రొఫెసర్ పాండురంగం తల దించుకున్నాడు కొడుకువైపు చూడలేక.

అప్పుడు పడింది ఇన్స్పెక్టర్ దృష్టి అతని ఎడంచేతి మీద. ఆ అరచేతికి వేళ్ళు కనిపించకుండా కర్చీఫ్ చుట్టి వుంది. ఇన్స్పెక్టర్ వెంటనే దాన్ని లాగేశాడు.

ఆ చేతికి బొటనవేలు లేదు.

"ఏరోజైతే, నీ కొడుకు రవికాంత్ గురించి వాకబ్ చెయ్యడానికి మీ ఇంటికి వచ్చి, నీతో మాట్లాడానో అప్పుడే నా కనుమానం వేసింది, నీ బొటనవేలు నకిలీదని. అదృష్టవశాత్తు నిన్నరాత్రి ఆ చీకటిసందులో నాతో కలియబడ్డప్పుడు ఆ వేలు కాస్తా ఊడి నా చేతిలోకి వచ్చింది.

మొత్తానికి యోగానంద్ ఒడ్డూపొడుగుని నీ పథకానికి బాగానే వాడుకున్నావ్. ఇప్పుడతనెక్కడున్నాడు? ఏం చేశావతన్ని?" అడిగాడు ఇన్స్పెక్టర్ కర్కశంగా.

ప్రొఫెసర్ పలకలేదు. కాసేపు ఆలోచించి, ఏమను కున్నాడో ఏమో, మెల్లిగా తలెత్తాడు. "సుగంధరావు నా బద్ధవిరోధి. సుగంధరావునూ, కంపౌండర్ని నేనే హత్యచేశాను.

సుగంధరావు మరణం తరవాత నన్ను బ్లాక్ మెయిల్ చేస్తూ డబ్బు గుంజడానికి ప్రయత్నించాడు కంపౌండరు. దాంతో, వాణ్ణి మట్టుబెట్టడానికి నిర్ణయించాను. నిన్న సాయంకాలం వాడు డాక్టర్ ఇంటికి వచ్చినప్పుడు నేనక్కడే వున్నాను. వాడికి తెలీకుండా టీలో విషం కలిపి యిచ్చాను. అదే సమయంలో యోగానంద్ వచ్చా డక్కడికి.

వెళ్ళేటప్పుడు తనని ఇంటివరకూ డ్రాప్ చెయ్యవల సిందిగా కోరాడు కంపౌండర్ అతన్ని. యోగానంద్ కంపౌండర్ని కారెక్కించుకుని తీసికెళ్ళాడు. బహుశా, దార్లో అతని పరిస్థితి విషమించేసరికి, భయపడి కిందికి తోసి పారిపోయాంటాడు.

యోగానంద్ మీద మీ అనుమానం బలపడటానికే రాత్రి మీ వెంట జీపులో బైలుదేరబోతున్న క్షీరవేణి మీద పిస్తోలు పేల్చాను... దురదృష్టవశాత్తు ఆ గొడవలో నా బొటనవేలు ఊడిపోయింది... దాంతో యోగానంద్ని మట్టుబెట్టడం అనివార్యమైపోయింది.

రేపు యోగానంద్ చెయ్యి చెక్ చేస్తే అతని చేతికి అన్ని వేళ్ళూ నిక్షేపంగా వున్నప్పుడు అతనిమీద మీకేర్పడ్డ అనుమానం తొలగడం సహజమే కదా?

అతన్ని చంపి, ఆ శవాన్ని మరొకంటికి కన్పించ కుండా మాయంచేస్తే యోగానంద్ మద్రాసు వదిలి ఎటో

పారిపోయాడనుకుంటారు పోలీసులు. ఆ విధంగా నేను సేఫ్ అవుతాను...

ఆ వుద్దేశంతో నే ఇక్కడికి వచ్చాను. పిస్తోలుతో అతన్ని కాల్చి చంపాను. ఆ శవాన్ని గ్యారేజ్ లో వున్న అతని కార్లోకి చేర్చాలనుకుంటుండగా మీరొచ్చారు'' అన్నాడు ప్రొఫెసర్ రక్తం కారుతున్న భుజాల గాయాల నదుముకుంటూ.

అతన్ని సార్జంట్ కప్పగించి, గబగబ బెడ్ రూంలో కెళ్ళాడు ఇన్స్పెక్టర్.

నేలమీద పడుంది యోగానంద్ శవం!

వెల్లకిలా! చలనరహితంగా!!

—:ఐపోయింది:—

# సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మం



## వసుంధర

(మూడవ భాగము)

"నేను ముందే చెప్పానుగా. మనిషి చాలా మొండి వాడు. ఎంతటి ఘోరశిక్షనైనా భరిస్తాడు కానీ తను చెప్పకూడదనుకున్నది చెప్పడు..." అన్నాడు రఘునాథ్.

"అతని స్నేహితుడెవరో కానీ చాలా అదృష్టవంతుడు. గురువులు దగ్గర్నుంచి అన్ని అక్షులూ పుచ్చుకుని హాయిగా అనుభవిస్తున్నాడు" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"ఇంతకూ మీకు గురువులుతో పనేమిటి?" అన్నాడు రఘునాథ్.

"ఏదో ప్రొఫెషనల్ క్యూరియాసిటీ—అంతే!" అంటూ

తల వెనక్కి వాల్చి కళ్ళు మూసుకున్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

రఘునాధ్‌కు ఈ శ్రీకృష్ణపరమాత్మ ఒక వింత మనిషిగా తోచాడు. అతని పేరే వింతగా వుందతనికి. అయితే రామకృష్ణ పరమహంస అని పేరు పెట్టుకున్న కొందరు మనుషులు అతనికి తెలుసు. అలాగే యిదీ ఓ పేరయివుంటుంది అనుకున్నాడతను.

ఇతనో ప్రయివేటు డిటెక్టివ్‌నని చెప్పాడు. మనుషుల చేత నిజం చెప్పించడానికి తనవద్ద కొన్ని పద్ధతులున్నాయనీ, అవి గురువులమీద ప్రయోగిద్దామనుకుంటున్నాననీ అతను రఘునాధ్‌కు చెప్పాడు.

ఏ పుట్టలో ఏ పాముంటుందో చూద్దామని రఘునాధ్ అంగీకరించాడు. అంగీకరించాడుకానీ అతడికి యింతో అంతో అతడిమీద అనుమానమూ కలిగింది. దూరాన్నించి ఓ కంట కనిపెడుతూనే వున్నాడు. శ్రీకృష్ణపరమాత్మ మాట్లాడిన ధోరణిని దూరాన్నించి చూసి పెద్దగా అనుమానించవలసింది లేదని రఘునాధ్ అనుకున్నాడు.

శ్రీకృష్ణపరమాత్మ మళ్ళీ కళ్ళు తెరిచాడు—"నాకు కళ్ళు తిరుగుతున్నాయి" అన్నాడు.

"ఏమయింది?" అన్నాడు రఘునాధ్.

"ఏమో తెలియడం లేదు" అంటూ తల వెనక్కి వాల్చి "నాకు చాలా నీరసంగా వుంది. ఏదైనా ఏర్పాటు చేస్తే ఇక్కడే పడుకుంటాను" అన్నాడు.

రఘునాధ్ అప్పటికప్పుడు ఓ మడతమంచం తెప్పించి అక్కడే వేయించాడు. శ్రీకృష్ణపరమాత్మ నెమ్మదిగా లేచివెళ్ళి మంచంమీద కూర్చుని కాసిని మంచినీళ్ళు తాగి పడుకున్నాడు. రఘునాధ్ అతడిగురించి ఓ కానిస్టేబుల్ని కాపలా వుంచాడు.

పరమాత్మ కాసేపటికి గాఢనిద్రలోపడ్డాడు. అతడు కొద్దిగా గుర్రుకూడా పెడుతున్నాను. రఘునాథ్ తనలో తనే నవ్వుకొని గురువులుకు సంబంధించిన ఫైలంతా తిరగేయసాగాడు.

తర్వాత రెండు గంటలక్కాబోలు ఓ కానిస్టేబులు కంగారుగా పరుగెత్తుకుంటూ వచ్చి "గురువులు కండిషన్ ప్రమాదకరంగా వుంది సార్. మనిషి శరీరం నల్లగా మారిపోయింది" అన్నాడు.

రఘునాథ్ కంగారుపడి లేచాడు. అప్రయత్నంగా అతనిదృష్టి పరమాత్మమీదకు మళ్ళింది. అతనింకా గుర్రు పెడుతూనే వున్నాడు.

* * *

గురువులు కళ్ళువిప్పి చూశాడు. గదిలో తనొక్కడే వున్నాడు. తన శరీరం నల్లగా మారిపోయింది. చూసుకుందుకు బాగోలేదు.

"ఇప్పుడేం జరుగుతుంది?" అని ఆలోచిస్తున్నాడు గురువులు. తనకు వైద్యం జరిగి మళ్ళీ మామూలు మనిషి అవుతాడా, లేక ఎప్పటికీ ఇలాగే వుండిపోతాడా? శరీరపు రంగు మారిందికానీ తనకేమీ బాధగాలేదు. కానీ బాధను నటించాడు. బలమైన ఇనుపసంకెళ్ళలో బంధించి తనను హాస్పిటల్‌కి తీసుకువచ్చారు.

గురువులినలా తీసుకువచ్చినందుకు డాక్టర్ బాధపడితే "డాక్టరుగారూ వీడి సంగతి మీకు తెలియదు. వీడిపేరు గురువులు. ఆరితేరిన గజదొంగ. నరరూప రాక్షసుడు" అని చెప్పాడు ఇనస్పెక్టర్ రఘునాథ్.

ఆ మాటలు విని గురువులు తనలో తనే నవ్వుకున్నాడు. అప్పుడు డాక్టర్ ఏదో ఇంజక్షన్ ఇచ్చాడు. నిద్ర పట్టేసింది. మళ్ళీ యిప్పుడే మెలకువ వచ్చింది.

గురువులు ఏదో ఆలోచిస్తూండగానే డాక్టర్ గదిలోకి ప్రవేశించాడు. గురువులు చటుక్కున లేచి కూర్చో బోయాడు.

డాక్టర్, గురువుల్ని సమీపించి "నేను శ్రీకృష్ణపరమాత్మను విశ్వసిస్తాను. అతడు ఇష్టపడ్డవారందర్నీ రక్షించడం నా విధి" అన్నాడు.

గురువులు ఆశ్చర్యపోయాడు. వాడికళ్ళలో హఠాత్తుగా ఆశ తొంగిచూసింది. తను తప్పించుకోడం నిజమని వాడికి అనిపించసాగింది. పైకిమాత్రం ఏమీ తెలీకుండా "డాక్టర్ నా వ్యాధి నయమవుతుందంటారా?" అన్నాడు.

డాక్టర్ తన చేతికివున్న వాచీ మీటనొక్కాడు. కాసేపు తర్వాత మళ్ళీ మీటనొక్కాడు. "నీ వ్యాధి యింకో రెండుగంటల్లో నయమవుతుంది. నీవు లేచి తిరిగే ఓపిక లేదనీ అటువంటి ఓపిక కలగడానికి ఇరవై నాలుగ్గంటలు పడుతుందనీ పోలీసులకు చెప్పాను. బయట చెప్పుకోదగ్గ కాపలా ఏమీ లేను. ఈ రాత్రికి నువ్వు నీ పద్ధతిలో బయటపడ్డానికి ప్రయత్నించు."

"శ్రీకృష్ణపరమాత్మ ఏంచేస్తున్నాడు?" అన్నాడు గురువులు.

"ఎలిబీకోసం పోలీస్టేషన్లో నిద్రపోతున్నాడు."

"నేను బయటపడ్డాక స్వేచ్ఛాజీవినౌతానా?"

"కావు, కాలేవు. శ్రీకృష్ణపరమాత్మ అనుచరులు నిన్ను కనిపెట్టే వుంటారు."

"అయితే నేనిప్పుడేం చేయాలి?"

"పోలీసుకళ్ళు బడకుండా బయటపడు. నిన్ను కలుసుకో వలసిన వాళ్ళెలాగూ కలుసుకుంటారు."

గురువులు ఆశ్చర్యంగా "నేను బయటపడితే మీకేమీ ఇబ్బంది వుండదా?" అన్నాడు.

"అన్నింటికీ శ్రీకృష్ణపరమాత్మ వున్నాడు" అని వెళ్ళిపోయాడు డాక్టర్.

గురువులుకు మళ్ళీ కాసేపు నిద్రపట్టింది. వాడికి మెలకువ వచ్చేసరికి గదిలో డిమ్‌గా లైట్ వెలుగుతోంది. వాడోసారి తన శరీరం వంక చూసుకున్నాడు. నల్లరంగు పోయింది.

గురువులు చటుక్కున లేచి కూర్చున్నాడు. కాళ్ళూ చేతులూ అన్నీ స్వాధీనంలో వున్నాయి. డాక్టర్‌ని మనసులో అభినందించుకుని వాడు పక్కమీంచి దిగాడు. దగ్గర్లో వున్న కిటికీ దగ్గరకు వెళ్ళాడు.

ఓసారి అంతా పరీక్షించుకుని కిటికీలోంచి బయటకు వచ్చాడు. అక్కడినుంచి క్రిందకు చాలాదూరముంది. క్రింద నలుగురు కానిస్టేబుల్సు తిరుగుతున్నారు.

గురువులు తాపీగా ఓ పైపుగొట్టాన్నందుకుని క్రిందకు జారసాగాడు. అలా జారుతూ మొదటి అంతస్థుకు వచ్చాడు. అక్కడ కిటికీపై సమతలంగావున్న ప్రదేశం మీదకు మారి అక్కడ ఆగాడు. అక్కణ్ణించి క్రిందకు దిగడానికి ఏమిప్రయత్నం చేసినా క్రిందనున్న పోలీసుల కళ్ళబడక తప్పదు. యిప్పుడేంచేయాలి? ఇక్కణ్నుంచి ఎలా బయటపడాలి?

గురువులు ఆలోచిస్తూండగా అలా ఒక కారు వచ్చింది. అప్పుడే గురువులుకొక ఆయిడియా వచ్చింది. ఆ కారు వెళ్ళిపోయింది. క్రిందకు ఎంతోదూరం లేదు. ఆ మాత్రపు దూరం ప్రాణాపాయం లేకుండా గెంతగలడు. ఒకసారి హాస్పిటల్ గేటు దాటి బయటపడితే...

మళ్ళీ ఇంకో కారు వస్తోంది. గురువులు ఆలస్యం చేయు లేదు. వాడు ఊపిరిబిగబట్టి ఒక గెంతు గెంతి కారుమీదకు

దూకాడు. ఏం జరిగిందో తెలిసేలోగా కారు హాస్పిటల్ గేటుదాటి అక్కడ ఆగింది. ఈలోగా గురువులు కారు మీంచి క్రిందకు గెంతి మెరుపులా మాయమయ్యాడు.

హాస్పిటల్ కాంపౌండులోంచి పోలీసులు పరిగెత్తుకు వచ్చారు. "ఏం జరిగింది?" అంటూ అడిగారు ఆపిన వ్యక్తిని.

"ఏదో కారుమీద పడ్డట్టయింది. అది గ్రహించి కారు ఆపేసరికి ఏదో కారుమీంచి దూకినట్లయింది, అంతే" అన్నాడు కారులోని వ్యక్తి.

* * *

గురువులు కారుదూకి కనబడ్డ సందులో ప్రవేశించాడు. ఆ సందులో చివర ఒకమనిషి అతడికి కనిపించాడు.

అతడు కాకీదుస్తుల్లో ఉన్నట్టుగా గురువులుకు అనుమానం కలిగింది. అతడు పోలీసుల మనిషా లేక శ్రీకృష్ణ పరమాత్మ మనిషా లేక మామూలుగా సందులో వున్నాడా?

మూడో విషయం నమ్మదగ్గదిగా కనబడలేదు గురువులుకు. అతనక్కడ ఎవరికోసమో యెదురు చూస్తున్నట్లుగా వున్నాడు. పోలీసుల మనిషయితే తనతో సంబంధము లేని మరో పనిమీద అక్కడ ఉండివుండాలి. అయినప్పటికీ తనను చూస్తే వెంటనే గుర్తుపట్టగలడు. ఇప్పుడు గురువుల్ని తెలియని కాకీ దుస్తులవాడుండడు.

అలాకాకుండా శ్రీకృష్ణపరమాత్మ మనిషయుంటే తనకోసమే అక్కడ నిలబడి వుంటాడు. ఈ విధంగా తను ఈ సందులోకి వస్తానని అతడు ముందే ఊహించి వుండాలి. లేదా తను పైపు దిగడం ప్రారంభించినప్పటి నుంచి తనను కనిపెడుతూండి వుండాలి.

ఎవ్వరో తెలియనప్పుడు అతని దగ్గరకు వెళ్ళడము ప్రమాదం. శ్రీకృష్ణపరమాత్మ మనిషయితే ఎలగూ తన వద్దకు తనంతట తనే వస్తాడు. ఎవరూ రాకపోయినా తనకు బాధలేదు. మరీమంచిది.

అసలీ శ్రీకృష్ణపరమాత్మ ఎవరు? అతడు తననుంచి ఆశిస్తున్న ప్రయోజనమేమిటి?

గురువులు ఎక్కువగా ఆలోచించలేదు. ఆ సందు చివర వరకూ వెళ్ళకుండా మధ్యలో ఇంకోవీధి వస్తే పక్కకు తిరిగాడు. గమ్యంలేకుండా అలా ఎంతదూరం పోవాలో నిర్ణయించుకోలేదతనింకా.

తనకు వెనకగా కాస్త దూరంలో ఏదో అడుగులచప్పుడవుతున్నట్లుతోచి వెనక్కు చూశాడు గురువులు. ఓ కాకీదుస్తులమనిషి తనను సమీపిస్తూ ఆగమన్నట్లు సైగ చేస్తున్నాడు. బహుశా ఇందాకటి సందులో మనిషే అయుంటాడు.

గురువులు ఆగాడు. ఆ మనిషి అతన్ని సమీపించి ఓ చిన్నకాగితం ఇచ్చి, "నువ్వీ ఇంటికి వెళ్ళాలని శ్రీకృష్ణ పరమాత్మ ఆదేశం. ఆ ఇంట్లో ఇద్దరే మనుషులుంటారు. తాత, మనవడు. ఇల్లు చాలా విశాలమైనది. వాళ్ళిద్దరికీ తెలీకుండా చాలాసేపు గడపవచ్చు నువ్వు. కర్మంచాలక దొరికిపోతే మాత్రం శ్రీకృష్ణపరమాత్మ పేరుచెప్పు. నీకే ప్రమాదమూ ఉండదు" అన్నాడు.

"ఇప్పుడే వెళ్ళాలా?" అన్నాడు గురువులు ఆ చీటీ మీది అడ్రసు చూస్తూ.

"అవును. పోలీసులు నిన్ను వేటాడడాని కింకెంతో సేపు పట్టదు" అన్నాడు కాకీదుస్తుల మనిషి.

"ఆ ఇంట్లో ఎంతసేపుండాలి?"

"శ్రీకృష్ణపరమాత్మనుంచి మళ్ళీ నీకు ఆదేశం అందే వరకూ."

"వాళ్ళెవరు?"

"మనకు సంబంధించిన మనుషులు కాదు. కానీ శ్రీకృష్ణపరమాత్మకు బంధువులు" అన్నాడు కాకీదుస్తుల మనిషి.

గురువులు ఇంకేమీ ప్రశ్నలు వేయలేదు. కాకీదుస్తులు మనిషి వెళ్ళిపోయాడు. గురువులు మరోసారి ఆ అడ్రసు చూసుకున్నాడు. చకచకా అడుగులు వేశాడు. ఆ ఇల్లు అక్కడికి మరీ దూరంలో లేదు.

సుమారు పదినిముషాల్లో గురువులు ఓ బంగళాముందు ఆగాడు. అచ్చటి వాతావరణం చాలా ప్రశాంతంగా ఉందనిపించిందతనికి. చక్కటి అందమయిన బంగళా. చుట్టూ తోట. చిన్న కాంపౌండ్ వాల్. ఒక చిన్న గేటు. గేటుకు తాపలా లేదు.

గేటు తీసుకుని లోపలకు ప్రవేశించాడు గురువులు. వీధి తలుపులుకూడా వేసి లేకపోవడం ఇంకా ఆశ్చర్యమనిపించింది గురువులుకు. తోసుకొని లోపల ప్రవేశించాడు. ఒకపర్యాయం చుట్టూ పరిశీలించి ఇంట్లోకి దారులన్నీ ఆకళింపు చేసుకున్నాడు.

ఇల్లు పెద్దదిగానే ఉందికానీ ఇంట్లోవాళ్ళకి తెలియకుండా ఇందులో దాక్కోవాలంటే చాలా ఇబ్బందిగానే ఉంటుంది.

గురువులు ఓ గదిలోకి వెళ్ళిపోయాడు. చిన్న దగ్గు లాంటిది అతనికి వినిపించింది. ఆ దగ్గువచ్చిన వైపే అతను చప్పుడు చేయకుండా నడిచాడు.

అక్కడ రెండు మంచాలున్నాయి. ఓ మంచంమీద ఓ ముసలాయన పడుకుని ఉన్నాడు. ఆయనకు పక్కన

వున్న స్టూలుమీద టేబిల్ లైట్ వుంది. ముసలాయన చేతిలో చాలా లావుపాటి పుస్తకం వుంది. ఆయన ఆ పుస్తకాన్ని తెరచి గుండెలమీద పెట్టుకొని తదేకదీక్షతో దానివైపే చూస్తూన్నాడు రెండు చేతులతోటీ పట్టుకొని. మధ్యమధ్యలో ఆయనకు దగ్గువస్తోంది.

రెండో మంచంమీద ఓ యువకుడు నిద్రపోతున్నాడు.

గురువులు గది గుమ్మందగ్గర ఆగినప్పుడు ముసలాయన మళ్ళీ దగ్గాడు. ఈసారి ఆయనకు దగ్గు తెరలు తెరలుగా వచ్చింది. ఊపిరి సలుపుకోలేక పోయాడు. ఆయన అదే పనిగా దగ్గుతూంటే పక్క మంచంమీద పడుకున్న యువకుడికి మెలకువ వచ్చింది. చటుక్కున లేచికూర్చుని “తాతా! నిద్ర పట్టలేదా?” అన్నాడు.

“పట్టిందిరా. కానీ మెలకువ వచ్చి చాలా సేపయింది. పుస్తకం చదువుకుంటున్నాను. వెధవ దగ్గు నాప్రాణం తీసేస్తోంది” అన్నాడు తాత.

“నిన్నటిదాకా లేని దగ్గు ఈ రాత్రి వచ్చినట్లుంది. జలుబు చేసిందేమో!” అన్నాడు మనవడు. కలవరపాటు అతడి ముఖంలో కనబడుతుంది.

“అవున్రా—ముసలివాడినై పోతున్నాను. ఏక్షణంలో ఏ ప్రమాదం వస్తుందో తెలియదు. నీకింక ఆ రహస్యం చెప్పేయక తప్పదు” అన్నాడు తాత.

“ఏ రహస్యం?” అన్నాడు మనవడు.

“అదేరా—అపూర్వనిధి రహస్యం” అన్నాడు తాత.

“నిజంగానా తాతా-ఇప్పుడే చెబుతావా?”అన్నాడు మనవడు. అతడి కళ్ళు ఉత్సాహంతో మెరుస్తున్నాయి.

“అవున్రా, యేదో ఒకరోజున చెప్పక తప్పదు. ఆలస్యం చేసినకొలదీ అది మనచేయి దాటిపోతుంది. అందు

లోనూ నా ఆరోగ్యమొకటి అంత బాగుండడం లేదు'' అన్నాడు తాత.

''నీ ఆరోగ్యానికీ దీనికీ ముడిపెట్టొద్దు'' అన్నాడు మనవడు.

''ఈ ప్రపంచంలో నువ్వుతప్ప ఇంకెవ్వరూ లేరు నాకు. అయిన వాళ్ళందరూ పోయినప్పటికీ నిన్ను చూసుకునే గదా నేను బ్రతుకుతున్నాను. అలాంటప్పుడు నీలో ఆవేశాన్ని రగిల్చి, ఉత్సాహాన్ని బికించి అపూర్వనిధికై పంపి నానుంచి ఎలా దూరం చేసుకోను?''

''సంవత్సరంనుంచి చెబుతున్నావు అపూర్వనిధిగురించి. తీర్థయాత్రలకు వెళ్ళి వచ్చినప్పటినుంచి నీ ధోరణిలో చాలా పెద్దమార్పు వచ్చింది. ఎంత అడిగినా యేం జరిగిందో చెప్పవు?'' అన్నాడు మనవడు.

''ఇప్పుడు చెబుతున్నాగా'' అన్నాడు తాత.

మనవడితోపాటు గురువులుకూడా ఆ వివరాలు విన సాగాడు.

* • *

వాళ్ళు మొత్తం నలుగురు.

తీర్థయాత్రలకని వివిధ ప్రాంతాలు తిరుగుతూ కన్యాకుమారివద్ద కలిశారు.

నలుగురిలోకీ రామేశం ముసలివాడు. ఆయన వయస్సు అరవైకి దగ్గరలోవుంది. అందరిలోకీ కుర్రవాడు జోహారీ. అతడింకా ముప్పయ్యోపడిలో పడలేదు. మిగతావాళ్ళు యిద్దరూ నలభయ్యోపడిలో వున్నారు. ఒకడు టాకూర్ రెండోవాడు జోగారావు.

జోహారీ ఉత్తరప్రదేశ్‌కు చెందినవాడు. టాకూర్ మిగతా ఇద్దరూ తెలుగువాళ్ళు. వయస్సులోనూ, భాషల లోనూ భేదాలున్నప్పటికీ చాలా విషయాల్లో వాళ్ళ అభి

ప్రాయాలు కలిశాయి. కన్యాకుమారి దగ్గర్నుంచి వారు మధుర, రామేశ్వరం వగయిరా తీర్థయాత్రలన్నీ సందర్శించడమయ్యాక నా త్రిండియన్నిద్దరూ తెలుగుదేశం వస్తామని చెప్పారు. హృదయపూర్వకమైన ఆహ్వానం వారికి యిచ్చారు తెలుగువాళ్ళిద్దరూ.

సుమారు పదిరోజులపాటు తెలుగుదేశం తిరిగారు ఈ నలుగురూ. అందుకోసం ఓ టాక్సీ బేరమాడుకున్నారు. వాళ్ళను దేశమంతా తిప్పడానికి టాక్సీవాడు అంగీకరించాడు.

రాజమండ్రికి దరిదాపుల్లో ఓ అడవివుంది. ఆ అడవిలో ప్రమాదకరమయిన ఆటవిక జాతులుకొన్ని నివసిస్తున్నాయని చెప్పుకొంటారు. ఆ ఆటవిక జాతులవారికి భాషాసంస్కారముంది. నాగరికతతో సంపర్కముంది. అయినప్పటికీ వారు అడవినివదలి బయటకురారు. తమ జీవన విధానాన్ని మార్చుకోరు.

రామేశంద్వారా ఈ విషయం విన్న నా త్రిండియన్సు ఆ ఆటవికులను చూడాలని ఉత్సాహపడ్డారు. మార్గం మరీ అంత సుకరం కానప్పటికీ టాక్సీవాలా కూడా ఆ ఆటవికులను చూడాలని ఉత్సాహంగావుంది. అందువల్ల అంగీకరించాడు.

ఆ ఆటవికుల గురించి వినడమేకానీ రామేశంకూడా చూడలేదు. అప్పుడప్పుడు వారు నగరాలకు వచ్చి పులిచర్మాలు, జింకచర్మాలు, మూలికలు వగయిరాలమ్ముతుంటారు. వారు నగరానికివచ్చి వెడుతుండటమే కానీ_ఆ ఆటవికుల ప్రాంతానికి నగరవాసులు వెళ్ళడం జరగదు. అదీకాక అది బాగా నిర్లక్ష్యం చేయబడ్డ ప్రాంతం. అటువేపు సరయిన రోడ్లుకానీ, దారులుకానీ ఏర్పడలేదు.

టాక్సీ ఒక పల్లెటూళ్ళో ఆగేక రామేశం తనప్రయా

ణము గురించి వాకబు చేశాడు. గంగాపురమనే పేరుగల ఆ గ్రామం తరవాత నాగరికత మరి కనపడకపోవచ్చునని ఆయన అభిప్రాయపడ్డాడు.

ఆఊళ్ళో ఓ చిన్న కాఫీహోటలుంది. దాని యజమాని చిన్నయ్య వాళ్ళకు ప్రయాణం వివరాలు చెప్పాడు. అతను చెప్పిన ప్రకారం ఆ ప్రయాణం సుకరమయినది కాదు.

ఊరిచివర కొండవుంది. ఆ కొండమీద సన్ననిబాట వుంది. ఆబాట పట్టుకుని బయలదేరాలి. ఆ దారిలోనే ఆటవికు లాగ్రామానికి వచ్చి వెడుతుంటారు. ఆ దారిలో ప్రయాణించడం ఆటవికులకుతప్ప ఎవ్వరికీ సాధ్యపడదని ఊళ్ళో చెప్పుకుంటుంటారు. ఆ ఆటవికులుండే చోటికి వెళ్ళ డానికి గంగాపుర గ్రామపెద్దల అనుమతి తీసుకోవాలి.

నలుగురూ ఆ ఊరి ప్రెసిడెంటును కలుసుకున్నారు. ప్రెసిడెంటు వీరి కోరికవిని అసమ్మతిని సూచించే ముఖం పెట్టాడు.

"ఇదివరలో ఇలాగే ముగ్గుర్ని వెళ్ళనిచ్చాం. మళ్ళీ వెనక్కి రాలేదు. అప్పట్నించి అలా యెవ్వరినీ వెళ్ళ నివ్వడంలేదు." అన్నాడు ప్రెసిడెంటు.

"మేము వెళ్ళితీరాలి" అన్నాడు రామేశం. "మాలో ఎవ్వరికీ ప్రాణభయం లేదు. జాతకాల ప్రకారం అంతా నూరేళ్ళు బ్రతికేవారే!"

"అయితే మీ ఇష్టం. కొండదగ్గర్నుంచి ఓ చుట్టు దారివుంది. ఇలా వెడితే పాతిక కిలోమీటర్ల దూరంలో వుండే ఆ ప్రాంతం, చుట్టుదారిన వెడితే డెబ్బయి కిలో మీటర్లుండవచ్చు. చుట్టుదారిలో కూడా ప్రమాదాలు వుంటాయి. నరబలులనిచ్చే తెగవారొకరచ్చట వుంటు న్నారని చెప్పుకుంటూంటారు. నాగరికులను వారు వదలి పెట్టరంటారు" అన్నాడు ప్రెసిడెంటు. (సశేషం)



# క్రైమ్‌లో తమాషాలు

## "ఫింగర్ ప్రింట్సు"

"204" అంటూ కేకేశాడు ఎస్.ఐ.

"యస్సార్" అంటూ వచ్చాడు కానిస్టేబుల్.

"ఆ నల్ల ప్యాంటు వేసుకున్న వ్యక్తిని స్టేషన్‌కు లాక్కొని రా" అంటూ హుకుం జారీచేశాడు రోడ్డున వెళ్తున్న ఒక వ్యక్తిని చూపిస్తూ.

"యస్సార్" అంటూ వెళ్ళిపోయాడు 204.

అరగంట తర్వాత కానిస్టేబుల్ ఒక్కడే స్టేషన్‌కు తిరిగొచ్చాడు.

"తప్పించుకుపోయాడు సార్" అంటూ తెల్లమొహం వేశాడు.

"వాడికి ఒక హత్యతో సంబంధముంది. ఇన్నాళ్ళూ తప్పించుకొని తిరుగుతున్నాడు. ఇప్పుడెలా?" అంటూ కళ్ళెఱ్ఱచేశాడు ఎస్.ఐ.

"పర్వాలేదు సార్! వాడి ఫింగర్ ప్రింట్స్ తెచ్చాను. వాడు తప్పక దొరుకుతాడు సార్" అన్నాడు 204.

"ఎక్కడ ఆ ఫింగర్ ప్రింట్స్???"

"ఇక్కడ సార్" అంటూ తన కుడిచెంప చూపించాడా కానిస్టేబుల్.

—వై. కుల్‌సుంబీ, అనంతపురం.

## జేబు దొంగ

గంగన్న ఒక జేబుదొంగ. ఒక్కసారి వాడి మిత్రుడు వాడితో "బొంబాయిలో పట్టపగలు ఏ ఎదురుగానే నీ జేబు కొట్టివేసే జేబుదొంగలున్నారు" అని అన్నాడు.

కొన్ని రోజుల తర్వాత గంగన్న బొంబాయి వెళ్ళాడు. వాడు తన జేబులో ఒక 100 రు.ల నోటుతో ఊరంతా చెడతిరిగి ఓ పాన్ షాప్‌వద్ద నిలబడి ఓ చుట్ట కాల్చుకున్నాడు.

"ఈ ఊరిలో మహామహా జేబుదొంగ లున్నారట. ఉదయంనుండి తిరుగుచున్నాగాని నా జేబులో నోటు ఎవరూ కొట్టివేయలేదేంటి?" అని తనలోతాను గొణు కున్నాడు.

పక్కనే నిలబడ్డ మరొక వ్యక్తి అది విని "నీ జేబులో నున్నది చెల్లని బిస్కెట్టు కాగితమని అందరికీ తెలుసు" అన్నాడు.

—బి.ఎ. శర్మ, మలక్‌పేట.

## అదృష్టవంతుడు

ఒక ప్రముఖ సినీ నటి దగ్గరకు ఇంటర్వ్యూకోసం వచ్చిన విలేఖరితో నటి "మీరు చాలా అదృష్టవంతులు తెలుసా! ఇవాళ ఉదయం నుండీ ఇప్పటికి పదిమంది విలే ఖర్లు వస్తే కనీసం నా ముఖమైనా చూపకుండా పొమ్మ న్నాను" అంది గొప్పగా.

"చిత్రం! ఆ పదిమంది విలేఖర్లూ నేనేనండి!" అన్నాడా విలేఖరి.

—జ్యోత్స్న, రాయగడ-1.

